

# ఆంధ్ర ప్రదేశ్

ఆగస్టు - సెప్టెంబరు

1973

50 పై.



# ఆంధ్రప్రదేశ్ గురించి

- 1971 జనాభా లెక్కల ప్రకారం, ఆంధ్రప్రదేశ్ జనాభా భారతదేశ జనాభాలో 7.93 శాతానికి, ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం భారతదేశ విస్తీర్ణంలో 9 శాతానికి సమానం.

- ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం 2.75,109 చ. కి. మీటర్లు.

- 1971 లో సేకరించిన లెక్కల ప్రకారం. ఆంధ్రప్రదేశ్ జనాభా 4,33,94,951 మంది. దేశజనాభా 54,69,55,945.

- 1971 లెక్కల ప్రకారం, రాష్ట్ర జనాభాలో అక్షరాస్యులు 24.56 శాతం మంది వున్నారు. 1961 లో 21.19 శాతం. భారతదేశం మొత్తంమీద వున్న అక్షరాస్యుల శాతం 1971 లో 29.35. 1961లో 24.03 శాతం.

- మన రాష్ట్రంలో జనాభా సాంద్రత చ. కి. మీ. 1కి 157 మంది హైదరాబాదు జిల్లాలో సాంద్రత చ. కి. మీ. 1కి, 362. అన్ని జిల్లాల కంటే యిది ఎక్కువ. అదిలాబాద్ జిల్లాలో జనాభా సాంద్రత 79 మంది. అన్నింటి కంటే యిది తక్కువ.

- రాష్ట్రంలో తలసరి సగటు ఆదాయం (1960-61 నాటి ధరలు) మొదటి ప్రణాళిక అంతానికి రూ. 281లు, రెండవ ప్రణాళిక అంతానికి రూ. 306లు, మూడవ ప్రణాళిక అంతానికి రూ. 333 ల చొప్పున ఉంది. నాలుగవ ప్రణాళిక ముగింపు నాటికి తలసరి సగటు ఆదాయం రూ. 430 లకు పెరుగుతుంది.

- రాష్ట్రంలో 1,000 అడుగుల లోతు మేరలో సుమారు 1,000 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు వున్నాయి. 2,000 అడుగుల లోతు మేరలో 1,320 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు లభించగలవని అంచనా.

- భారతదేశంలో, బారైట్స్ ఉత్పత్తిలో ఆంధ్రప్రదేశ్‌దే అగ్రస్థానం దేశంలో ఉత్పత్తి అయ్యే బా రైట్స్‌లో 90 శాతం మొదలు 95 శాతం వరకు రాష్ట్రంలో ఉత్పత్తి అవుతున్నది.

- అభ్రకం ఉత్పత్తిలో బీహారు, రాజస్థాన్ రాష్ట్రాల తరువాత స్థానం ఆంధ్రప్రదేశ్‌ది.

# ఆంధ్ర ప్రదేశ్


సంపుటి : 17 | ఆగస్టు-సెప్టెంబరు, 1973 శ్రావణ — ఆశ్వయుజ, 1895 శా. శ. | సంచికలు : 10, 11

ప్రధాన సంపాదకులు : పెండ్యాల వామనరావు

సంపాదకులు : ఈరంకి వెంకట సుబ్బారావు


దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్

ముఖచిత్రం : ఆగస్టు 15 న గవర్నరు వందన స్వీకారం చేస్తున్న దృశ్యం

మూడవ అట్ట : లేపాక్షి శిల్పము.

చివరి అట్ట : భీమునిపట్నం బీచ్.


సాలు చందా : ఆరు రూపాయలు

విడిప్రతి : 50 పైసలు

రిజిస్టరు నెం : 133




16-1




పేజీ

# అసమానతల తొలగింపు అవసరం

జాతీయ సమైక్యతను పెంపొందించే ఉద్దేశంతో భారత రాష్ట్రపతి కోసం దక్షిణ ప్రాంత ప్రధాన కార్యస్థానాన్ని భారత ప్రభుత్వం హైదరాబాదులో ఏర్పాటు చేయడం ఎంతో విజ్ఞతతో కూడిన చర్య. బొలారంలోని చరిత్ర ప్రసిద్ధమైన వెనకటి రెసిడెన్సీ భవనంలో రాష్ట్రపతి నిలయం ఏర్పాటు చేయబడింది. ప్రతి ఏటా నాలుగైదు వారాలపాటు తమ వీలునుబట్టి—సాధారణంగా ఆగస్టు-సెప్టెంబరు నెలల్లో—రాష్ట్రపతి హైదరాబాదులో విడిది చేయడం యిప్పుడు యించుమించు ఒక ఆనవాయితీ అయిపోయింది.

డా. రాజేంద్రప్రసాద్, డా. ఎస్. రాధాకృష్ణన్, డా. జాకీర్ హుస్సేన్ వంటి సుప్రసిద్ధులు రాష్ట్రపతులుగా తమ మధ్య మెలిగిన అదృష్టం, అర్హ హైదరాబాదు ప్రజలకు లభించింది. శ్రీ వి.వి. గిరి గారు రాష్ట్రపతి అయినప్పటి నుంచి రాష్ట్రపతి నిలయంలో ఏడాదికి ఒకసారి తమ కార్యస్థానాన్ని ఏర్పాటు చేసుకొనే ఆనవాయితీని కొనసాగిస్తూనే వున్నారు. ఇందువల్ల రాజ్యాధిపతిని చూసే అవకాశం యిక్కడి ప్రజలకు లభించడమే కాక దక్షిణాది రాష్ట్రాల ప్రజలు రాష్ట్రపతిని కలవాలంటే ఢిల్లీవరకూ వెళ్ళాల్సిన శ్రమ పడనక్కరలేకుండా యిక్కడే కలిసే వీలు ఏర్పడింది. తెలుగువారైన శ్రీ గిరిగారు తెలుగు మాట్లాడే ప్రజల అభివృద్ధి విషయంలో ఎప్పుడూ అత్యంత శ్రద్ధాసక్తులు కనబరుస్తూనే వున్నారు. వారు ఎప్పుడు యీ రాష్ట్రానికి వచ్చినా ఆంధ్రప్రదేశ్ ప్రజల హృదయపూర్వక స్వాగతానికి కొదువలేదు. ఆయన ప్రజల మనిషి. బలహీన వర్గాలవారి సంక్షేమం కన్న ప్రియమైనది ఆయనకు మరొకటి లేదు. రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన దృష్ట్యా యీ సారి వారి హైదరాబాదు విడిదికి చాలా ప్రాముఖ్యత వుంది. ఈ సారి వారు కొద్దిపాటి బహిరంగ కార్యక్రమాలకు మాత్రమే ఒప్పుకొని, ఎక్కువ కాలాన్ని ఆంధ్ర సమస్యకు ఒక శాశ్వత పరిష్కారాన్ని కనుగొనేందుకై వివిధరకాల, వివిధ ధోరణుల ప్రజల ఆలోచనల్ని తెలుసుకొనేందుకు భిన్న భిన్న వర్గాల నాయకులనూ ప్రజలనూ కలుసుకొనడానికి నిశ్చయించారు.

రేషను దుకాణాల్లో సక్రమంగా ఆహార ధాన్యాలు పంపిణీ అవుతున్నదీ లేనిదీ, అక్కడ పంపిణీ అవుతున్న ఆహారధాన్యాలు నాణ్యమైనవీ కానిదీ స్వయంగా తెలుసుకొనే వుద్దేశంతో అకస్మాత్తుగా శ్రీ గిరిగారు రేషను దుకాణాల్ని తనిఖీ చేయడం ప్రజలదృష్టిని బాగా ఆకర్షించింది. నల్లబజారు వర్తకుల్ని తీవ్రంగా దండించాలన్న అయన ప్రకటనకు ప్రజలు తమ హర్షాన్ని ప్రకటించారు. ప్రజల హృదయాలకు ప్రియమైన వాటినే శ్రీ గిరిగారు ఎప్పుడూ చేపట్టుతుంటారు. అందువల్లనే ఆయన అందరికీ అంత సన్నిహితులయ్యారు. శ్రీ గిరిగారు పాల్గొన్న మొట్టమొదటి కార్యక్రమం-క్రీడావారోత్సవాలకు ప్రారంభోత్సవం, ఆంధ్రప్రదేశ్ క్రీడానిర్మాణాల శంఖుస్థాపన. ఆ సందర్భంగా వారు మాట్లాడుతూ, మన జాతీయ జీవనంలో క్రీడలు—ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లోని క్రీడలు—అంతర్భాగం కావడానికీ, వాటిని బహుళ ప్రచారంలోకి తేవడానికీ పెద్ద యెత్తున కృషిచేసే విషయంలో ఎటువంటి శ్రమనూ లక్ష్యపెట్టరాదని క్రీడలకు సంబంధించిన వారందరికీ విజ్ఞప్తి చేశారు. "మన దేశాన్ని అభివృద్ధి పరచుకోడానికి వీలుగా యువజనుల శక్తిసామర్థ్యాలను, ఉత్సాహాభినివేశాలను నిర్మాణాత్మక కార్యక్రమాలలోకి మళ్ళించేట్టుగా మనం చేసే కృషి వుండాలి" అని ఆయన అన్నారు.

శ్రీ గిరిగారు తమ జీవితంలో ఎప్పుడూ సాటిలేని మేటి క్రీడాకారుడుగానే యున్నారు. యువతరాన్ని ప్రభావితం చేయడానికి ఆయనను మించిన దృష్టాంతం మరొకటి లేదు.

మరో సందర్భంలో రాష్ట్రపతి స్వర్గీయ సరోజినీ నాయుడు స్మృత్యర్థం ఏర్పాటు చేసిన బాలల వార్డుకు ప్రారంభోత్సవం చేస్తూ అంధత్వాన్ని నివారించవలసిన అవసరాన్ని గూర్చి నొక్కి వక్కాణించారు. వికలాంగులు విధి నిర్వహణలో ఆసక్తివల్లా, క్రమశిక్షణవల్లా యితరులకన్న బాగా పనిచేస్తారని నిరూపించుకున్నారని శ్రీ గిరిగారు పేర్కొన్నారు. సంచార వైద్యాలయాలు చాలా తొందరగా ప్రజల్ని చేరే సరియైన మార్గమని ఆయన చెప్పారు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో నేత్ర శిబిరాలను నిర్వహిస్తున్నందుకు సరోజినీదేవి ఆసుపత్రి అధికార్ల కృషిని రాష్ట్రపతి యీ సందర్భంగా శ్లాఘించారు.

మన రాజ్యాంగ నిర్మాతలలో ముఖ్యులైన డా. బి. ఆర్. అంబేద్కర్ పేరున ఏర్పాటు చేయబడుతున్న కళాశాలకు కూడా రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేశారు. కులము. స్థలము ఏమైనప్పటికీ శ్రమించి కృషిచేస్తే, విజ్ఞానాన్ని ఆర్జిస్తే ఒకవ్యక్తి ఎంతటి గొప్పవాడు కావచ్చో డా. అంబేద్కర్ తన జీవితం ద్వారా, కృషి ద్వారా నిరూపించారు. హైదరాబాదు నగరంలోని ఒక ప్రధానమైన కూడలిలో ఆకర్షణీయమైన అంబేద్కర్ విగ్రహాన్ని ఏర్పాటు చేసుకుని యిదివరకే యీ నగరం ఆయనపట్ల తన భక్తిప్రపత్తులను ప్రకటించింది. ఈ విగ్రహానికి లోగడ రాష్ట్రపతే ప్రారంభోత్సవం చేశారు.

అంబేద్కర్ స్మృతికి రాష్ట్రపతి తమ భక్త్యంజలి ఘటిస్తూ "మన దేశంలో సమాజంలో అట్టడుగునవున్న ఒక వర్గం ప్రజలు సాంఘిక బహిష్కారణకూ, ఆర్థికమైన అణచివేతకూ వ్యతిరేకంగా నిరంతరంగా జరుపుతున్న పోరాటాన్ని డా. అంబేద్కర్ జీవిత చరిత్ర అద్దంపట్టి చూపుతుంది" అన్నారు.

సమాజంలోని అట్టడుగు ప్రజల ప్రియతమ మిత్రుడైన మన రాష్ట్రపతివంటి ప్రముఖునిచేత ప్రారంభోత్సవం చేయబడిన యీ కళాశాల హరిజనుల ఆర్థిక, సాంఘిక స్థితిగతులను మెరుగుపరచడంలోనూ, అస్పృశ్యతను నిర్మూలించడంలోనూ సమిష్టి కృషికి దోహదం చేస్తుందనడంలో ఎలాటి సందేహమూ లేదు.

—పి. వి. ఆర్.

# చీకటి - వెలుగు

## —శ్రీ చుండి జగన్నాథం

స్వాతంత్ర్య భానూదయం కాగానే పర వశులై తొక్కిసలాము. అంతలోనే మనకు దేశ విభజన మూలంగా వచ్చిన ఘోరాతిఘోర మైన విపత్తును ఎదుర్కోవలసి వచ్చింది. దానివలన మనకు పక్కలో బల్లెం సిద్ధమైనది. ఇప్పటికీ దాని ఫలితాన్ని ఏదో విధంగా ఎదుర్కోవలసి వస్తున్నది. మన ఆర్థికాభి వృద్ధికి అవసరమైన వనరులను రక్షణకై వినియోగించవలసి వచ్చింది.

ఆ విపత్తు వుండి కూడా మనం ఒక చక్కని రాజ్యాంగాన్ని నిర్మాణం చేసుకున్నా ము. 564 స్వదేశీ సంస్థానాలను ఏక భారత రాజ్య పథకంలో సంలీనం చేసుకున్నాము. సర్వేజనా స్సుఖినోభవంతు అనే ఉద్దేశాన్ని సఫలం జేయడానికై ప్లానింగ్ పథకాలను అమలు పరచినాము.

దేశంలో ప్రజాస్వామ్యాన్ని పదిల పరుచు కొని, పరిపాలనలో దోషముయుంటే వాటిని సూచించి, పరిష్కారాలను తెలియజేయగల స్వేచ్ఛను పెంచుకున్నాము. అందువల్లనే ఈనాడు మన ప్రగతికై ఎంత గర్విస్తున్నామో మన లోపాలను పరిపాలించే వారుగానీ, ఇతరులు గానీ మనకు తెలియజేసినపుడు వాటిని గూర్చి కూడా అంతగా శ్రద్ధ వహిస్తున్నాము.

### దేశం చెడిపోయిందా?

దేశం చెడిపోయింది అని అంటున్నారు. ఆ మాట అనగల్గడం, ప్రజల దృష్టిని ఆ వైపుకు తిప్పడం ఎలా సాధ్యమైనదో గమ నిస్తే మన ప్రజాస్వామిక పంథా అంతవరకు సఫలమైనదనే చెప్పుకోవాలి.

ఈ చెడిపోవడమేమిటో కూడా మనం జాగ్రత్తగా పరీక్ష చేసుకోవాలి. మనం ఈ దేశాన్ని 'శ్రీలు పొంగే జీవగడ్డగా, పాలు పారే భాగ్య సీమగా' చేయదలచుకున్నాము. అయితే అది అల్పసంఖ్యాకులకు సిరిసంపద లను, భోగభాగ్యాలను అందించడానికి గాదు. అందరికీ సౌఖ్యాన్నీ, హాయినీ, ఆహారాన్నీ, ఆశయాన్నీ, వినోదాన్నీ, ఉత్తమ జీవన మార్గాన్నీ అందించవలె ననుకున్నాము. ఇందుకై ఎంతో శ్రమ పడినాము. శ్రమకు దగిన ఫలితం దక్కలేదు. ఎందుకు దక్క లేదో అన్వేషిస్తున్నాము.

ఈ అన్వేషణ పర్యవసానమే నవీన భారతాన్ని నిర్మాణం జేస్తుంది. ఆధునిక-నవ భారతంలో నూత్నాధ్యాయరంగం అని కూడా దానిని వర్ణించ వచ్చును.

ఇక్కడ ఒక చిక్కు వచ్చి పడుతున్నది. మనం నడిచిన నడకలో పారిశ్రామిక-వ్యవ సాయిక-విద్యా విషయికమైన అభివృద్ధి ఎక్కువగా జరిగింది; కాని, అందుకు తగి నట్లుగా ప్రజల చైతన్య స్థాయి పెగరలేదు; అంతేగాక, దిగజారిపోయింది. అంధకార బంధురమై పోయింది. పట్టపగలే చీకటి వచ్చింది. ఎవర్ని పలకరించినా నిరాశ, నిస్పృహాలేగాని ఉత్సాహం కనిపించదు.

### విషాదయోగం

అన్ని రంగములలో చీకటి అలుము కున్నది. రాజకీయం, వ్యాపారం, వ్యవ సాయం, విద్యారంగం, కార్మికరంగం, పారి శ్రామికరంగం, బుద్ధిజీవులరంగం-అన్నింటా వ్యాపించిన తమోరాశిని తొలగించే మార్గం గానక అందరు విషాదయోగంలో పడి వున్నారు.

ఇది ఎటువంటి పరిస్థితి అంటే యూరప్‌లో అభ్యుదయశక్తులు ప్రజాస్వామిక మైనవి, సోషలిస్టు గమ్యోన్ముఖమైనవి ప్రథమ ప్రపంచసంగ్రామానంతరం విజృంభించి అపూ ర్వమైన లోకకల్యాణ కారకమైన కార్యక్రమా న్ని చేబట్టగలవని విశ్వసించిన సమయంలో ఫాసిజం అనే గాఢాంధకారం వచ్చి ప్రపం చాన్ని ఆవరించింది. ఒక్కసారి ప్రపంచం వెనక్కు నెట్టబడి ప్రాథమిక నాగరికదశలో నుంచి మళ్ళీ ఆరంభించవలసి వస్తుందేమో ననే భీతి గలిగినది. అంతట, అదివరదాకా, కత్తులు దూసుకున్న ప్రజాస్వామికము సోష లిస్టు శక్తులు ప్రపంచాన ఏకమై ఫాసిజమును ఎదిరించినవి. దాని ఫలితంగా చీకటిలో నుంచి మళ్ళీ ప్రపంచానికి వెలుగు వచ్చినది.

అదే రకమైన పరిస్థితిని మనం దేశంలో ఎదుర్కుంటున్నాము. పరిశ్రమలు నడవవు. కార్మిక సంఘాలుసరిగా వర్తించవు. చదువులు సాగనే సాగవు. పరీక్షలు-వ్యర్థం. ఎందుకో పాఠకులెరుగుదురు. విశ్వవిద్యా లయాలు ఒకదాని వెంబడి ఒకటి మూం పడిపోవుచున్నవి. అధికోత్పత్తిని అందించే గింజలు దొరికినా ఎరువులు సామాన్యంగా దొరకవు. ధరలన్నీ మండుచున్నవి. ఎవరిని ఇందుకు దోషిగా పేర్కొనవలెనో తెలి యడం లేదు. రాష్ట్రప్రభుత్వాలు ఒకదాని వెంట ఒకటి మాయమవుతున్నవి.

అధికోత్పత్తి లేకపోవడం, లోటు బడ్జెట్ విధానాలు-రెండూ ప్రధాన కారణాలట ఈ దుఃఖకరమైన పరిస్థితికి! అయితే మనం వాటికి విరుగుళ్ళను కనిపెట్టలేమా!

దేశం ఎదుర్కొన్న క్షోభకు తాళ జాలక ఎవరికి తోచినట్లు వారు సభలు, సమా వేశాలు, ప్రదర్శనలు జరుపుతున్నారు. ఇది సహజమే. కాని, ఈ తరుణంలో ఇంకా దీర్ఘంగా అందరు కలిసి ఆలోచించ వలసి వున్నది.

### గాంధీజీ నేర్పిందేమిటి?

గాంధీజీ మనకు నేర్పిన సత్సూత్రా వళి ఈ సందర్భంలో మనకు మిక్కిలిగా ఉప కరించగలదనితోస్తుంది.

ఒకటవ సూత్రం : సిద్ధాంతాలు లేని రాజకీయాలు మనకు వద్దు. రెండవసూత్రం: శ్రమ పడకుండా సంపద కై ప్రాకులాడవద్దు. మూడవసూత్రం: అంతరాత్మ అంగీకరించని సౌఖ్యం కోసం తాపత్రయ పడవద్దు. నాల్గవ సూత్రం: శీలసంపద లేని జ్ఞానార్జన వ్యర్థం. అయిదవ సూత్రం: నీతి లేని వ్యాపారం చేయకూడదు. ఆరవ సూత్రం: మానవ మూల్యాలను విస్మరించి సైన్స్ వెంట పడరాదు. సప్తమ సూత్రం: త్యాగం లేకుండా ఆరాధనచేస్తే ప్రయోజనం వుండదు.

ఈ ప్రాతిపదికలపై మన సమాజాన్ని పునః నిర్మాణం చేయవలెనంటే, ఆత్మ విమర్శన నిశితంగా జరగవలెను. అప్పుడు పరిస్థితిని సమీక్షించి, మనం ఎన్నడూ కనీ విని ఎరుగని రీతిగా మనలను ఆవరించిన దిమ్మ చీకటి వదిలిపోయే మార్గాన్ని అన్వేషించడం మన అందరి కర్తవ్యం.

ఒకరిపై ఒకరు నిందారోపణ చేసుకుని తృప్తిపడే కాలం మించినది. గత రెండు శతాబ్దాలలో మన సమాజంలో ఇటువంటి అదుపులేని అన్యాయస్థితి, దౌర్జన్య ప్రవృత్తి, నీతి బాహ్యమైన ప్రవర్తన, పెద్దలలో పిన్నలలో నిర్లక్ష్యభావం సంభవించలేదు. మన భాగ్యం కొలదీ నేటికీ అన్యాయకాలం దాపురించినది.

## అందరం బాధ్యులమే

అందరం అన్నివిధాల ఈ పరిణామానికి తోడ్పడినవారమే. ఇందులో సందేహం లేదు. ఎవరికోటా వారికి వుండనే వున్నది. ఇక ఇప్పుడు దానికి విరుగుడు కనిపెట్టడంలో ఎవరికోటా వారు భరించవలెను.

గాంధీజీ మనకు చేసిన బోధలో అట్టడుగున వున్న వ్యక్తిని పైకి తీయమన్నాడు. తాత్పర్యం ? అడుగున వున్న వ్యక్తి బాగు పడితే, మిగిలిన వారంతా బాగుపడి తీర వలసిందే. సర్వోదయం కావుంటే అడుగున వున్న వ్యక్తి పైకి రావాలడు.

ఇక మనం అసహనం, అసూయ, దౌర్జన్యం, చిలిపి కయ్యాలు మానుకుని ముందుగతి మనకేమి అనే ఆవేదనతో ఆలోచిస్తే, సమాధానం రాకపోదు.

సబ్‌కో సన్మతి దే భగవాన్ !

---

# ఖమ్మంజిల్లాలో బలహీనవర్గాలకు ఇళ్ళనిర్మాణం

ఖమ్మం జిల్లాకు మంజూరైన 2613 యిండ్లకు మారుగా 1973 మే 25 నాటికి 2553 యిండ్ల నిర్మాణం పూర్తి అయింది. మిగతా వాటి నిర్మాణం కూడా త్వరలోనే పూర్తి అవుతుంది. 1971–72 వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల సహకార గృహ నిర్మాణ సంఘాల ఫెడరేషన్‌వారు ఖమ్మం జిల్లాకు 2613 యిండ్లను కేటాయించగా జిల్లా సంఘం వాటిని జిల్లాలోని 13 పంచాయతీలకు పంపిణీ చేసింది. వాటిలో 19 కాలనీలు ఉన్నాయి. కాలనీలో మంచినీటి సౌకర్యం రోడ్లు, విద్యుచ్ఛక్తి ఉన్నచోట విద్యుచ్ఛక్తి సరఫరా సౌకర్యాలు కల్పించబడినాయి.

ప్రతి యింటి నిర్మాణానికి రు, 1800 లు ఖర్చు అవుతున్నది. యీ యిండ్ల నిర్మాణం పూర్తిఖర్చు రు. 47,03,400లు. పంచాయతీరాజ్ శాఖకు చెందిన యింజనీరింగ్ విభాగం పూర్తి అజమాయిషీలో యీ కొత్త యిండ్లు నిర్మించబడినాయి. సభ్యునికి నిర్దేశించిన స్థలంలో ఫెడరేషన్ సూచించిన విధానాలలో వాటిని నిర్మించారు. ప్రయోజనం పొందిన సభ్యుడు, అంటే యిల్లు కేటాయించబడిన వ్యక్తి యింటి రుణాన్ని వడ్డీతోసహా 20 సంవత్సరాలలో తిరిగి చెల్లించాల్సి ఉంటుంది. వారికి తిరిగి చెల్లించే ఆర్థిక స్తోమత కలిగించడానికి వీలుగా ఆర్థిక సహాయక పథకాలను కూడా అమలు జరుపుతున్నారు. ఈ జిల్లాకు రు. 1,20,000 ల అంచనా ఖర్చుతో 32 పాడి యూనిట్లు కూడా మంజూరు చేయబడినాయి.

ఖమ్మం జిల్లా షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల సహకార గృహ నిర్మాణ సంఘం పేరు 1971 ఏప్రిల్ 12 న నమోదు చేయబడింది. బలహీన వర్గాల నిమిత్తం ప్రభుత్వం చేపట్టిన ప్రత్యేక గృహ నిర్మాణ పథకాన్ని యీ సంఘం యీ జిల్లాలో అమలు జరుపుతున్నది. హైదరాబాదులోని ఆంధ్రప్రదేశ్ షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల సహకార గృహనిర్మాణ సంఘాల ఫెడరేషన్‌కు యిది అనుబంధంగా పనిచేస్తుంది. జిల్లా సంఘాలకు యీ ఫెడరేషన్ ద్వారా నిధులు లభిస్తాయి.

జిల్లా కలెక్టరు యీ సంఘం ఎక్స్ అఫీషియో అధ్యక్షుడుగా వ్యవహరిస్తారు. జిల్లా పరిషత్తు అధ్యక్షుడు ఎక్స్ అఫీషియో ఉపాధ్యక్షుడు. జిల్లా రెవిన్యూ అధికారి, జిల్లా పరిషత్తు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, జిల్లా సహకార శాఖాధికారి, సాంఘిక సంక్షేమ శాఖాధికారి ఎక్స్ అఫీషియో డైరెక్టర్లుగా ఉంటారు. పార్లమెంటు సభ్యుడు శ్రీ కె. పున్నయ్య, శాసన సభ్యుడు శ్రీ కె. శాంతయ్య, శ్రీ వి. ప్రతాపరెడ్డి ప్రభృతులను ఎక్స్ అఫీషియో డైరెక్టర్లుగా రాష్ట్ర సహకారశాఖ రిజిస్ట్రారు నామినేటు చేశారు.

సత్యాగ్రహ సమర గాథలు :

# పల్నాటి సీమలో పుల్లరి సత్యాగ్రహం

పల్నాడు సీమ వీరులకు జన్మభూమి. కార్యమపూడి (నేటి కారెంపూడి) కదన రంగంగా పల్నాటి చరిత్ర ప్రసిద్ధికెక్కినది. ఇక్కడ అడవులు ఎక్కువగా ఉండేవి. పుల్లరి బాధలతోపాటు, అటవీ శాఖాధికారుల దౌర్జన్యాలు మితిమీరినవి. ఆ జబర్దస్తీలను ప్రజలు భరించలేక పోయినారు. గాంధీజీ ప్రబోధిస్తున్న శాసనధిక్కార కార్యక్రమం వారి చెవిన బడింది.

దురహంకారంతో ప్రవర్తిస్తున్న రెవిన్యూ ఫారెస్టు ఉద్యోగులపైన ప్రజలు సాంఘిక బహిష్కరణను విధించారు. అధికార్లకు చాకళ్ళు, మంగళ్ళు పనిచేయలేదు. దుకాణ దారులు చిల్లరవెచ్చాలు గూడా ఇవ్వలేదు. హోటళ్ళవారు తిండిపెట్టలేదు. మాచర్లలో మకాంచేసిన జిల్లాకలెక్టరు, పోలీసు సూపరింటెండెంటుకు గూడా పాలు, గ్రుడ్లు దొరకని స్థితి ఏర్పడింది. ఎక్కడి వారక్కడ అన్నీ "బంద్" చేశారు. అధికార్లపైప్రయోగించిన సంఘ బహిష్కరణ పూర్తి విజయం సాధించింది. ప్రజలలో ఐక్యత చేకూరింది.

పల్నాటి సీమ పరిస్థితులను విచారించేందుకు గుంటూరుజిల్లా కాంగ్రెసు సంఘం శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారిని, శ్రీమాడభూషి వేదాన్తం నరసింహాచారిగారిని అక్కడకు పంపించింది. నాయకుల ప్రవర్తనకు హామీ కావాలని అధికార్లు నోటీసు జారీచేశారు. అందుకు వారు తిరస్కరించారు. నాయకులను ప్రజలు కనక-తప్పెట్లతో బ్రహ్మాండమైన ఊరేగింపు జరిపి అధికార్లదుర్నీతికి ప్రజలు సమాధానం చెప్పారు. కొన్నిగ్రామాలలో అడవిపుల్లరిని కాంగ్రెసు ఆదేశమయ్యేవరకు చెల్లించ నిరాకరించారు. ప్రభుత్వము శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీ మాడభూషి నరసింహాచారి గార్లను మాచెర్లలో అరెస్టు చేసి, గుంటూరు చేరవేస్తున్నప్పుడు దారిపొడుగునా ప్రభుత్వాధికార్లు నిరసన-ప్రదర్శనలను ఎదుర్కొన వలసివచ్చింది. దేశభక్త శ్రీకొండా వెంకటప్పయ్య, శ్రీ నడింపల్లి నరసింహా రావు, శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగార్ల నాయకత్వాన గుంటూరు నగరవాసులు వేలాది అసమ్మతి ప్రదర్శనలు జరిపారు. జాతీయ నాయకులకు ఘనస్వాగత మిచ్చి, అభినందనలు తెలిపారు. నాయకులను జైలుకు తీసుకొనివెళ్ళుతున్న రైలును ప్రజలు కదలనివ్వ లేదు. అప్పటికే ముగ్గురు మాచెర్ల ముస్లిం దేశభక్తులను నిర్బంధించి చెరసాలకు పంపడముజరిగింది. పల్నాడులో గార్డు, వాచర్ల సంఖ్యను పెంచి ప్రభుత్వం రైతులపై తీవ్రనిర్బంధవిధానాన్ని అమలు జరిపింది. ఇది ప్రజల నింకాఉద్రిక్తపరిచింది. అటవీశాసనాలను ఉల్లంఘించవలదని, పుల్లరి చెల్లింపవలదని ఇంకనూ కాంగ్రెసు తీర్మానించలేదని కాంగ్రెసునాయకులు విజ్ఞప్తులపై విజ్ఞప్తులు చేస్తూనేవున్నారు. అయితే శత్రువర్గంగా వున్న ప్రభుత్వాధికారులను సంఘ బహిష్కరణ చేయవచ్చునని ఆదేశించడం జరిగింది.

కారెంపూడిలో జరిగిన పల్నాటి మహాజన సభకు అధ్యక్షత వహించిన శ్రీ పోలిశెట్టి హనుమయ్యగుప్తా ప్రసంగ భాగాలను ఈ సందర్భంలో గమనించండి. "అటవీశాఖాధికారులు, పోలీసు బందోబస్తుతో గ్రామాలపై బడి పశువులను బందెలకు తోలుకు

శ్రీ మాదల వీరభద్రరావు



ఉన్నవ లక్ష్మీనారాయణ

పోసాగారు. తల్లులను, వాటిదూడలను వేరు చేశారు. రైతాంగహృదయం ఇది చూడలేకపోయింది. వందలాది రైతులు, పశువుల వెంటపడి తమ పశువులను విడిపించుకోడానికి ప్రయత్నించారు. ఇది నిరంకుశాధికార్లకు, పోలీసులకు కోపకారణ మయింది. తెల్లవారేసరికి నిద్రమంచాల మీదనే గ్రామాన్నంతా పోలీసు బలగాలతో, సైనికులతో చుట్టుముట్టి మూకుమ్మడిగా అరెస్టులుచేశారు. ప్రజలు పన్నులు, పుల్లరి చెల్లించే వరకు వారి ఆస్తులను జప్తులు చేశారు. అరెస్టులు చేసినవారిని విడుదలచేయాలని కోరిన జనసమూహంపై కాల్పులు సాగించి నానాభీభత్సంచేశారు. పల్నాటి సీమలో ఇలాంటి సంఘటనలు వెల్దుర్తి, జెట్టిపాలెం, జంగమహేశ్వరపురం, ముటుకూరు, రామాపురం మున్నగు పలు గ్రామాలలో జరిగినవి.

ఇప్పుడు పుల్లరి కట్టవలెనా? లేదా, అను ప్రశ్నకు మనం జవాబు చెప్పవలసియున్నది. నేను మండల కార్యదర్శినిగనుక కాంగ్రెసు తీర్మాన భావమును చెప్పవలసియున్నది. ఈ పుల్లరి ఇవ్వకుండు విషయం శాసనోల్లంఘనము క్రిందచేరును. దేశమంతయు శాసనోల్లంఘనము క్రింద చేయుటకు కాంగ్రెసు తీర్మానము లేదు. ఏ జిల్లానందైనను లేక మరియొక్క చిన్ననియోజక ప్రదేశము నందైనను శాసనోల్లంఘనము అమలులో పెట్టవచ్చును. దానికి ముందుగా రాష్ట్రీయ సంఘమువారి ద్వారా అఖిల భారత కార్య నిర్వాహక సంఘము వారి అనుమతి పొంద వలయును. అంతవరకు కాంగ్రెసు తరఫున ఈ మండల సంఘమువారు పల్నాడు పుల్లరి విషయమై ఏమియు చెప్పజాలరు.

## బహిష్కార సమస్య

పల్నాటి విషయములో ఒక సంగతి మట్టుకు మండలకార్య నిర్వాహక వర్గము వారు గట్టిగా చెప్పగలరు. మీ సౌఖ్యము కొరకును, మీ పశువుల సౌఖ్యము కొరకును శత్రువులుగా వున్న వారిని మీరు బహిష్కరించవచ్చును. అట్టివారికి చోటుయివ్వ నవసరములేదు, తిండి పెట్ట నవసరములేదు. బహిష్కారమనగా కొందరు బూటకపునీతులు చెప్పెదరు. ఆగస్టు 11వ తేదీన 'జన్మభూమి' పత్రికలో పల్నాటిలో జరిగే సంఘ బహిష్కారమునకు మనుష్యులను ఖూనీచేయుటకును భేదము లేదని నీతులు వ్రాసిరి. కొన్ని పట్టణములలో కొందరికి కలుగు సౌఖ్యము వల్ల పుట్టుచవుక నీతులను మీరు లక్ష్యపెట్టనవసరములేదు......

బియ్యము, పాలు, కోడిగ్రుడ్లు మొదలగు వస్తువులేమీ అట్టి ఉద్యోగులకు దొరకవని తెలిసినప్పుడు వారు పల్నాడులో ఎందుకు ఉండవలయును? ఇట్టి విషయములో బహిష్కారమును ఖూనీచేయుటతో పోల్చుట తెలివో, మానుషమో తెలియకున్నది.

శ్రీయుత కొండా వెంకటప్పయ్య పంతులుగారు పల్నాడు చూచి వెళ్ళిన తరువాత గాంధీ గారికి బహిష్కార విషయమై వ్రాసియుండిరి. కొన్ని స్థలములలో ఉన్న ప్రత్యేక



గద్దె రంగయ్య నాయుడు

కష్టములను బట్టి బహిష్కారమును పెట్టవచ్చును అని వారు జవాబిచ్చిరి. అయితే అట్టి బహిష్కారము 'దౌర్జన్యరహితముగా' నుండవలెననిరి.

ఈ సందర్భములో దౌర్జన్యరహితమనగా ఇంతకన్న వేరు అర్థముండదు. బహిష్కరింప బడిన వానికి బియ్యము అమ్మక పోవచ్చును, పూటకూళ్ళ పెట్టక పోవచ్చును, అయితే భోజనము లేక అడిగిన అన్నదానము చేయవలెను. అట్టివాని భార్య కడుపుతో నుండిన మంత్రసాని పోకుండా వుండ కూడదు. బహిష్కారము చేయుటలో మీ ఉద్దేశ్యం బహిష్కరింప బడిన వాడు తన దుర్మార్గమును తెలిసి కొని చేయకుండుటకు గాని, వానిని హింసించుటకుగాదు."

కారెంపూడి 16-8-21 } పొత్తిశెట్టి హనుమయ్యగుప్త (అధ్యక్షులు, ద్వితీయ పల్నాటి మహాజనసభ.

## వెల్దుర్తి గ్రామం

పల్నాడులో జరిగిన కొన్ని సంఘటనలను ఈ సందర్భంలో తెలుసుకొనడం అవసరం.

వెల్దుర్తిలో పోలీసులు పశువులను బందెకు తోలుకొని పోతుండగా ప్రజలు అటకాయించారు. ప్రజల కోపాగ్నికి తాళలేక అధికార్లు వెల్దుర్తి బంగళాలో తలదాచుకోవలసి వచ్చింది. కాల్పులు చేస్తామని పోలీసులు బెదిరించినప్పటికీ, ప్రజలు

వెనుకంజ వేయ లేదు. తుపాకులు గాలిలో ప్రేల్చారు. కాని ప్రజలు జంకలేదు. చివరకు పశువులను విడిపించుకొన్నారు. విచ్చలవిడిగా కాల్పులు చేయనందున ఇట్టి అవమానానికి గురి అయినట్లు పై అధికార్లకు నివేదిక పంపుకొన్నారు. ఆ కసి తీర్చుకోడానికి తర్వాత ఆ గ్రామంపై బడి పోలీసులు నానా భీభత్సం చేశారు.

## జెట్టిపాలెం గ్రామం

జెట్టిపాలెం గ్రామంలో పర్మిట్లు లేకుండా మేపుతున్నారని వంద పశువులను అటవీ శాఖాధికార్లు నిర్బంధించారు. వాటికిమేత, నీరుగూడ లేకుండా చేశారు. ఇది చూచి ప్రజలు అటకాయించి తమ పశువులను విడిపించుకొని పోయినారు. అక్కడున్న హెడ్ కానిస్టేబులు గూడా ప్రజలతో షరీకైనాడని, కావలా పోలీసులు గూడా ఏమీ చర్య తీసుకోలేదని, అధికార్లు భావించి హెచ్చు రిజర్వు, సైనిక బలగంతో జిల్లా కలెక్టరు, పోలీసు సూపరింటెండెంటు అక్కడకు వచ్చి మూకుమ్మడిగా అరెస్టులు చేశారు, కరణం సోదరుని సైతం బంధించారు. తన ఇంటినుండి రూ. 200లు పోలీసులు కాజేశారని ఆయన ఫిర్యాదు చేసినప్పటికీ వినిపించుకోలేదు.

## జంగమేశ్వరపురం

ఈ గ్రామం గురజాలకు 2 మైళ్ళ సమీపాన వుంది. 108 సెక్షను క్రింద ఒక రైతును అరెస్టుచేసి, పోలీసులు తీసుకొని పోతుండగా, ప్రజలు వెంటాడి అతనిని విడిపించు కొన్నారు. ఇది విని జిల్లా కలెక్టరు హెచ్చు రిజర్వు బలగంతో అక్కడ మకాం చేసి తనను కలుసుకోమని గ్రామస్థులకు కబురు పంపారు. కాని ఆయన మాటనెవరూ ఖాతరు చేయలేదు. ఆ కసితో గ్రామాన్నంతా రిజర్వు బలగంతో అర్ధరాత్రి వేళ చుట్టు ముట్టారు. ప్రజల నందరిని ప్రోగుచేసి అనేక మందిని నిర్బంధంలోకి తీసుకొని, వారి ఆస్తులు జప్తు చేసి నానాబాధలు పెట్టారు.

## రామాపురం గ్రామం

దాచేపల్లి నుండి పొందుగలకు పోయే రోడ్డుకు సమీపంలో కృష్ణానది ఒడ్డున ఈ రామాపురం గ్రామం వుంది. గ్రామస్థులు మొదటి కిస్తు చెల్లించలేదు. సుమారు 3 వేల రూపాయలు శిస్తులు గ్రామంలో వసూలు కావలసివుంది.

రెవిన్యూ ఇనస్పెక్టరును, 20 మంది రిజర్వు పోలీసులను వెంటతీసుకొని తాలూకా తహశీలుదారు శిస్తు వసూలుకు బయలు దేరాడు. ఒక ధనవంతుడైన కోమటి గృహంలోకి ప్రవేశించి, ఇష్ట మొచ్చినట్లు చిందర వందర చేస్తూ, ఆస్తి జప్తు చేయ నారంభించారు. ఈ సమాచారం గ్రామంలోని వారికి తెలిసింది. ప్రజలంతా కలసి అక్కడికి వెళ్ళారు. జనసమూహాన్ని చూచి అధికార్లు హడలిపోయినారు. అంతట 'మమ్మపొందు గల పోనివ్వండని' అధికార్లు బ్రతిమిలాడు కొని ఎలాగో గ్రామంనుండి బయటపడినారు. ప్రజలుగూడా వారి వెంటనంటారు, పొందు గల దాకావచ్చి ఉద్యోగులను బహిష్కరించం డని ఉద్బోధించారు. ఇది ప్రభుత్వాధికార్లకు ఎక్కడలేని తలవంపులైంది.



మాచర్ల ముస్లిం సోదరులు

రామాపురం రైతులు 'మమ్మ ఇంట్లో నిర్బంధించి తాళంవేశారని, తహశీలుదారు పై అధికార్లకు తప్పుడు ఫిర్యాదుచేసుకొన్నాడు.

రామాపురం గ్రామ ప్రజలపై కక్షతీర్చు కోడానికి 20 వ తేదీ జిల్లా కలెక్టరు, జిల్లా అటవీశాఖాధికారి, జిల్లా పోలీసు సూపరిం టెండెంటు బయలుదేరారు. కెప్టెన్ మాఖో

నోచి నాయకత్వాన 20 మంది సైనికులను 25 మంది రిజర్వును తోడుచేసుకొని, తెల్ల వారే సరికి గ్రామాన్ని చుట్టుముట్టారు. గ్రామస్తులంతా నిద్ర మంచాల మీద నే వున్నారు. వారిపైన నానాభీభత్సం చేశారు. అందరిని ఒకచోటచేర్చి 18 మంది ముఖ్యులను అరెస్టుచేసి కఠిన శిక్షలు విధించారు. ఆ మధ్యాహ్నానికల్లా మొత్తం బకాయి రూ. 3,000ల లోను రూ. 300 తప్ప మిగతా శిస్తు వసూలయ్యే పర్యంతం, గ్రామస్థులను అనేక ఇబ్బందుల పాలుచేశారు.

రామాపురంలో అరెస్టు చేసిన వారందరినీ పొందుగల గ్రామందాకా నడిపించుతూ అవమాన పరుస్తూ, మధ్య గ్రామాల వారిని గూడా భయపింపిచుట్లు చేశారు.

ఈ విధంగా మాచర్ల సమీప గ్రామాల్లో గూడా అటవీశాఖాధికారులపైన ప్రజలు దౌర్జన్యం చేయసమకట్టారని నేరం మోపి, పోలీసులు ఆచుట్టు గ్రామస్థుల నందరినీ నానాబాధలు పెట్టడం జరిగింది.

ఈ పోలీసు దాడులన్నింటికీ కారణం ప్రజలపై కక్షతీర్చుకొని ఉద్యమాన్ని అణచివేయడానికే నని స్పష్టం. పల్నాటి సీమ ప్రజల్లో పెంపొందుతున్న జాతీయ చైతన్యాన్ని అణచివేయడానికి వారి వీరోత్సాహాలను నీరసింపచేయడానికి సైన్యాన్ని గూడా దించి ఎట్టిదురంతాలు చేసేందుకైనా అధికార్లు వెనుకాడలేదు. అంతేగాని ప్రజలు దౌర్జన్యాలు సాగించారని అందుకు పోలీసులు ఆత్మరక్షణకు పూనుకున్నారనడం పోలీసుల కల్పితగాథ. అదిసత్య దూరమైన విషయం.

## మించాలపాడు సంఘటన

పోలీసుల దురంతాలు మించాలపాడులో పరాకాష్ఠకు చేరుకొన్నవి. గ్రామస్థులందరపున తానేపుల్లరి చెల్లిస్తానని కోరుతున్న కన్నెగంటి హనుమంతుని, అతని పాలేరును కర్కశత్వంతో పోలీసులు తుపాకీ కాల్పులకు ఎర చేశారు. పైగా అధికార్లపై ప్రజలు దౌర్జన్యం చేశారనే తప్పుడు నేరాలు ఆరోపించి, నిష్కారణంగా అనేకమందిని జైలుఖానాలలో నిర్బంధించినారు. ప్రజలను భయభ్రాంతులను చేయడానికి పోలీసులను, రిజర్వు దళాలను ప్రజలపై ఉసిగొల్పి విచ్చలవిడిగా దాడులు సాగించారు.

గ్రామస్థులు ప్రజాబలాన్ని ప్రదర్శించారు గాని ఎచ్చటా దౌర్జన్య, ప్రతీకార చర్యలకు పూనుకొన్నట్లుగాని, అధికార్లపై హింసాత్మక చర్యలు జరిపినట్లుగాని, ప్రజాసేవకుల నివేదికలనుబట్టి కనుపించదు.

ప్రజల ఉద్యమాన్ని అణచివేయుటకు గురజాల, మాచర్ల మున్నగు కేంద్రాలకు తోడు రామాపురం, జెట్టిపాలెం, మించాలపాడు మొదలగు అనేక ప్రాంతాలలో పోలీసు కేంద్రాలనేర్పరచి గ్రామాలపై ప్రభుత్వం విచ్చలవిడిగా దాడులుసాగించింది. ఈసందర్భంలో మించాలపాడు గ్రామరైతుపెద్ద శ్రీకన్నెగంటి హనుమంతు రిజర్వు పోలీసుకాల్పులకు బలియైనాడు. శ్రీహనుమంతుపాలేరుగూడ వీరమరణం చెందాడు. ఆ మరుసటి రోజే జిల్లా కలెక్టరు సైనిక సిబ్బందితో వెళ్ళి మించాలపాడు గ్రామరైతులను, పలువురిని అరెస్టు చేశాడు. 9 మందిరైతు స్త్రీలను గూడా నిర్బంధించినతర్వాత జైలుశిక్షలు విధించారు. మించాలపాడు సంఘటన గురించి ఇలా పేర్కొనబడుచున్నది. దుర్గికి 14 మైళ్ళ దూరంలోనున్న అడవి ప్రాంతంలో మించాలపాడు గ్రామం ఉంది. 1922 ఫిబ్రవరి 26 వ తేదీ అసిస్టెంటు కన్సర్వేటరు, రేంజరు, 14 మంది గార్డులు, పోలీసులు సబ్ఇన్స్పెక్టర్లు, 20 మంది రిజర్వు పోలీసులతో సహా మించాలపాడు గ్రామం పైన దాడిచేశారు. మరో 20 మంది పోలీసులు ముటుకూరు గ్రామంలో మకాం చేశారు.

మించాలపాడు అడవిలో మేతకు వచ్చిన పశువులను పోలీసు బలగం పట్టుకొని తోలుకు పోతుండగా, గ్రామస్థులు ప్రోగై కొన్ని పశువులను, అరెస్టు చేసిన పశువుల కాపరిని విడిపించు కొన్నారని ఆరోపించబడింది.

ప్రజలు ప్రతీకార చర్యలకు పూనుకొన్నారని, పదునైన రాళ్ళతో పోలీసులపై తిరుగబడ్డారని అకారణ నేరం ఆరోపించి, జన సమూహంపైన 47 రౌండ్లు కాల్పులు చేశారు. కాల్పులలో గ్రామపెద్ద కన్నెగంటి హనుమంతు, అతని పాలేరు వీర మరణం చెందారు. కాల్పులలో పోలీసు సబ్ఇన్స్పెక్టరు గుర్రపురౌతు గూడా మరణించాడు. 28 మందికి తుపాకీ గాయాలు తగిలినవి. వారిలో 9 మంది స్త్రీలుకూడా ఉన్నారు. ముటుకూరులో కాపలాగా ఉన్న అదనపు రిజర్వు బలగం కూడా వచ్చిపడి, మించాలపాడు లోని రైతు ఇండ్లలో నానా భీభత్సం చేశారు. గ్రామాన్ని చుట్టుముట్టి స్త్రీ. పురుషులను విచక్షణారహితంగా అరెస్టు చేశారు. అమాయకులైన వారిపై తప్పుడు కేసులు పెట్టి తర్వాత శిక్షలు విధించారు. "పోలీసులకు ఎదురు తిరిగిన గ్రామస్థులు సారా త్రాగి ఉన్నారని కన్నెగంటి హనుమంతు త్రాగుబోతు అని అల్లరి వ్యక్తియని" ఏవో తప్పుడు దూషణలతో రాష్ట్ర ప్రభుత్వానికి జిల్లా కలెక్టరు నివేదిక పంపు కొన్నాడు. పోలీసుల కాల్పులను సమర్థించు కొనేందుకు ప్రజలు పోరాడినట్లు కథలల్లడం తప్ప ఆంధ్ర కాంగ్రెస్ విచారణ సంఘం నివేదికలను చూస్తే, జలియన్‌వాలాబాగ్‌లో ఘోర దురంతాల వంటివి మించాల పాడులో జరిగినట్లు కనుపిస్తుంది. శ్రీ గద్దె రంగయ్యనాయుడు గారి నివేదిక గ్రామస్థుల వాఙ్మూలాలు హనుమంతు సతీమణి వాఙ్మూలం ఇందుకు ప్రబల నిదర్శనాలు.

జాతీయ భావోద్రేక పూరితులైన పల్నాటి ప్రజలు అహింసాయుతంగానే సంవత్సరకాలం ఉద్యమం కొన సాగించారు. తీవ్ర నిర్బంధాలకు, పోలీసుల కాల్పులకు జంక లేదు. తుదకు కాంగ్రెస్ తీర్మానం ప్రకారం శాసనోల్లంఘన విరమణతో, స్థానికోత్సాహ, ఉద్వేగాలు కొంతవరకు సన్నగిల్లినవి. పల్నాటి పుల్లరి సత్యాగ్రహం స్వాతంత్ర్యోద్యమంలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన ఘట్టం. శ్రీ కన్నెగంటి హనుమంతు వీరమరణం చిరస్మరణీయం. రాబోవు జాతీయ సంరంభానికి యీ ప్రజా ఉద్యమం అంకురార్పణ గావించింది.

# ఆంధ్రోద్యమ వజ్రోత్సవం

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య



"అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాడు
ఓరుగల్లున రాజ వీరలాంఛనముగ
పలు శస్త్ర శాలలు నిలుపునాడు
విద్యానగర రాజవీధుల కవితకు
పెండ్లిపందిళ్లు కప్పించునాడు
పొట్నూరికి సమీపమున ఆంధ్ర సామ్రాజ్య
దిగ్జయ స్తంభమెత్తించునాడు
ఆంధ్ర సంతతికే మహితాభిమాన
దివ్యదీక్షా శుభస్ఫూర్తి తీవరించె
ఆ మహావేశ మర్థించి ఆంధ్రులార
చల్లు డాంధ్రలోకమున అక్షతలు నేడు !"

అది 1913వ సంవత్సరము. బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ జరిగింది. 1905లో కర్జన్ ప్రభువు బెంగాల్ రాష్ట్రాన్ని రెండుగా విభజించితే బెంగాల్ ప్రజలు బెబ్బులులవలె భారత ప్రజానీకం వీర సింహాలవలె గర్జించి 1912 లో విభజన రద్దు చేయించుకున్నారు. ఆ విధముగా భాషా ప్రాతిపదికపై స్వీయ రాష్ట్రం కావలెనని ఆంధ్రులు ఆ నాడు ఆ ప్రథమ మహాసభలో 1913 లో ప్రథమంగా కోరడం జరిగింది. ఆ నాటినుండి ఆంధ్రోద్యమం భారత రాజకీయ రంగంలో జాతీయోద్యమంలో భాషా ప్రయుక్త రాష్ట్రాలు కావలెనని ఆందోళన చేసి 1921 లో ఆంధ్ర కాంగ్రెసు సంఘం సాధించుకొని స్వాతంత్ర్య పోరాటంలో ఒక వ్యక్తిత్వాన్ని సాధించారు. ఆ తృప్తితో జాతీయోద్యమంలో దుమికి మహోన్నత త్యాగాలు చేసి 1947 లో స్వాతంత్ర్యం సాధించుటలో భాగస్వాములైనారు. 1921 లో నైజాం సంస్థానంలో తెలంగాణా ప్రాంతంలో వున్న ఆంధ్రులు ఆంధ్ర జనసంఘం ప్రారంభించి, ఆంధ్రజన కేంద్ర సంఘంగా పరిణతిచెంది నిజాం ఆంధ్ర మహాసభగా పరివర్తన పొంది తెలంగాణా ప్రజానీకాన్ని జాగరితం చేశారు. నైజాం నిరంకుశత్వాన్నెదుర్కొని 1948 లో స్వతంత్ర భారతంలో తెలంగాణా విలీనం అయింది.

## రాష్ట్రావతరణ

మద్రాసు రాష్ట్రం నుండి 1953 లో శ్రీ అమరజీవి పొట్టి శ్రీరాములు ఆత్మాహుతితో ఆంధ్రరాష్ట్రం సాధించుకుని కర్నూలు రాజధానిగా తమ వ్యక్తిత్వాన్ని ప్రకటించుకున్నారు ఆంధ్రులు. 1956 లో నైజాంగిరిని, సంస్థానాన్ని తుదముట్టించి విశాలాంధ్రగా అవతరించి హైదరాబాదు రాజధానిగా అప్పటికున్న మూడుకోట్ల ఆంధ్రులు ఒక ఛత్రం క్రింద ఒక రాష్ట్రంగా నిర్మించుకొని తమ పూర్తి వ్యక్తిత్వాన్ని ప్రదర్శించుటకు, సాధించుకొనుటకు, ఋజువు చేసికొనుటకు జాతిగా రూపొందాడు. భారత దేశంలో రాష్ట్రాలు (రాజ్యాలు) భాషా ప్రయుక్తంగా నిర్మింపబడుటకు నాయకులుగా గుర్తింప బడ్డారు.

ఇది 1973 వ సంవత్సరం. అరువది సంవత్సరాలు గడిచినవి భారత దేశంలో భాషా రాష్ట్రాల నిర్మాణానికి అగ్రగామిగా ఉన్న. ఆంధ్రోద్యమానికి షష్టిపూర్తి అయింది, వజ్రోత్సవాలు చేసికోవలసి వుంది. ఈ అదనులో ఆలోచనలలో నిమగ్నం కావలసిన, అయిదు కోట్ల ఆంధ్రులు ఆనంద కోలాహలంలో ఉండవలసిన దానికి బదులు దురదృష్టంవల్ల విశాలాంధ్రను విడదీయ వలెననీ, ఒక భాష కలిగి రాష్ట్రంగా వున్నదానిని విడదీయవలెననీ 1905 నాటి ఆలోచనకు దోహదం కలిగించే వేర్పాటు ఉద్యమం సాగటం చరిత్ర యొక్క విచిత్ర గతిని సూచిస్తున్నది.

## నైజామాంధ్రులు : రాయలసీమ ఆవిర్భావం

కాకతీయ సామ్రాజ్యంవరకు ముఖ్యంగా ఆ రోజులలో 1323 న ప్రతాప రుద్రుని పాలన నుండి మహాంధ్రమండలాన్ని ఏకచ్ఛత్రం క్రింద రాజ్యమేలిన తెలుగు భాష, తెలుగు ప్రజలు వీరులుగా మహోన్నత పథాల నందించింది. 1518 లో కుతుబ్ సాహి నైజాం పదవి నధిష్ఠించడంతో మరో రూపం దాల్చింది. అందులో మల్కిభరాము పాలనలో ఆంధ్రసంస్కృతి తలయెత్త

స్థాపించింది. అంతవరకు ఒకే పాలనలో ఉండిపోయింది. 1724 లో నైజాం ఉల్‌ముల్కు నైజాం కావడంతో 1753 న ఫ్రెంచి దొర బుస్సీకి లొంగి 1766 లో సర్కారు జిల్లాలు, 1788 లో గుంటూరు జిల్లా బ్రిటిషువారికి స్వాధీనం చేశారు. అటుపై ఫ్రెంచి ప్రభుత్వపు పోటుతో ఇంగ్లాండు ప్రభుత్వం వశం అవడంతో ఈ భాగం ముక్కగా విడిపోయింది. మరొక ముక్క కడప, కర్నూలు అనంతపురం జిల్లాలు 1800 సంవత్సరంలో అక్టోబరు 20 వ తేదీన నవాబు ఇంగ్లీషు ప్రభుత్వం వారికి దత్తం చేయడం జరిగింది. ఆ దత్త మండలాలనే ఆపేరు యెవరికెవరు దత్తం చేశారనేది గ్రహింపలేక, సహించలేక, మనం రాయలసీమగా నామకరణం చేసుకొని పిలుచుకుంటున్నాం. మిగిలిన తెలుగు ప్రాంతం నైజాం క్రింద తెలంగాణాగా మిగిలి పోయింది. ఆ విధంగా తెలుగు ప్రజలు ఛిన్నాభిన్నం అయి ఒక తల్లి ఒడిలోనుండి తప్పిపోయిన తనయులవలె తలకొక పంచలో పడివుండి వ్యక్తిత్వాన్ని కోలుపోయారు. ఒకరి కొకరు పరులయ్యారు. పాలకులుగా వున్న పైవారికి వచ్చిన ద్వేషాలన్నీ వీరి విద్వేషాలుగా పరిణమించినవి. అవి అన్నదమ్ముల ద్వేషాలు కాక శాశ్వత యెడబాటుకు, వైమనస్యాలకు పునాదులు వేశాయి, ఆ పాలకుల విధానాలు, సంస్కృతులు, భాష, వేషం, తమవిగా భావించి తమ వ్యక్తిత్వాన్ని మరచిపోవడమే గాక, కోలుపోవడం వరకు సాగింది. ఆంధ్ర వ్యక్తిత్వంతోబాటు ఆంధ్ర భాషయొక్క వ్యక్తిత్వాన్ని కూడా కోల్పోయారు. ఆంగ్లేయపాలన క్రింద ఇంగ్లీషు, నైజాం పాలనక్రింద ఉర్దూ ఆరాధ్య భాషలుగా నెత్తిన పెట్టుకోవలసి వచ్చింది. నిజంగా ఇంగ్లీషు భాషమీద, ఉర్దూ భాషమీద ద్వేషం యెవరికీ లేదు. పైవారు నెత్తిన రుద్దడంతో నిజానికి ఉర్దూ, ఇంగ్లీషు, భాషలు తమవి అనుకొనేదానికన్నా తెలుగు మనదికానట్లు తెలుగు పనికిమాలిన వారి భాషగా అసహ్య దృష్టితో చూడడంతో ఆంధ్ర వ్యక్తిత్వంను రూపుమాపటానికి అధికారంలో వున్నవారు చేతనైనంత చేశారు. కాని సామాన్య ప్రజానీకం వారి అండతో పండితులు, కవులు, తెలుగు వేష భాషలను, సంస్కృతిని చావనీయకుండా సజీవంగా నిలుపలేక పోయినా జీవచ్ఛవాలు గానైనా ఉంచగలిగారు. అంతవరకు ధన్యులం. అందుచేతనే అపుడపుడు ప్రజల మాతృ భాషలకు ప్రోత్సాహం యిస్తున్నామంటూ ప్రభుత్వాధి నేతలు సవతి తల్లి ప్రేమను చూపించుతూ వచ్చారు.

## భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన

1947 లో స్వాతంత్ర్యం, 1953 లో ఆంధ్ర రాష్ట్రం, 1956 లో విశాలాంధ్ర దానితోబాటు భారతదేశం వివిధ రాష్ట్రాలు భాషా ప్రయుక్తంగా నిర్మాణం అయినవి. అనేకమందివీర యోధులు బలి అయ్యారు. ఆ వీర యోధులను స్మరించుకుంటూ ఆంధ్రజాతి వజ్రోత్సవం జరుపుకోవటంలో కోలాహలంగా వుండవలసింది. చీలిపోయిన ఆంధ్రులు 1953 లో ఒక వ్యక్తిత్వం సాధించుకోగల అవకాశం స్వాతంత్ర్యానంతరం లభించింది. తరతరాల ఆంధ్ర ప్రజలకు ఆశాజ్యోతిగా శాతవాహనుల నాటినుండి అంతకుముందు ఐతరేయ బ్రాహ్మణ కాలం నుండి మనగలిగి నేడు అయిదుకోట్ల ఆంధ్రులుగా ఆంధ్రజాతి భవిష్యత్తును స్వర్గమయం అయిన భవిష్యత్తును నిర్మించుకోగల అదను వచ్చింది. ముందు పురోగమించుటకు వజ్రోత్సవం జరుపుకోవలసి వుంది. అందరు ఆలోచించండి.

భాషారాష్ట్ర ఉద్యమం నడిపిన ఆంధ్రులు భాషారాష్ట్ర ఉద్యమ వజ్రోత్సవం జరుపుకొనుటకు బదులు వేర్పాటు ధోరణితో విడివడవలెననే ఆలోచనలో పడడం ఆంధ్రుల దురదృష్టం కాదా! ఆనాడు కర్ణాటక మహా పరిషత్తు అధ్యక్షులుగ ఉన్న కీ॥ శే॥ దాదారు ఆంధ్రనాయకులే తమ భాషాధార రాష్ట్ర నిర్మాణ నాయకులని ప్రశంసించారు, విశాలాంధ్ర ఏర్పడడంతో బృహన్మహారాష్ట్ర ఏర్పడుతుందని ఆనాడు శ్రీ స్వామి రామానందతీర్థ ఉద్ఘాటించారు. సాధించారు. విశాలాంధ్ర నిర్మాణంతో ఈ రెండు ఏర్పడినవి. ఆనాడు ఆ గౌరవం ఆంధ్రులు దక్కించుకో గలిగారు. ఈనాడు ఒక భాషకు రెండు రాష్ట్రాలుండకూడదా ? అంటున్నారు. అప్పటికే ఏర్పడిన హిందీ రాష్ట్రాలు ఉన్నవి. ఏర్పడిన రాష్ట్రం చీల్చడం సబబా అంటే పంజాబ్ రెండు రాష్ట్రాలుగా చీల్చలేదా అంటున్నారు. పంజాబ్‌లో హిందీ ప్రాంతం పంజాబీ ప్రాంతం అంటూ రెండు భాషాప్రాంతాలున్నవి. ఉర్దూ మహమ్మదీయుల భాషగా తలంచినట్లే పంజాబీ (గురుముఖి) సిక్కుల భాషగా తలంచి చాలా రోజులు ప్రతిఘటించారు. అది పరిశీలన జరిగిన తర్వాత పంజాబీ సుబా, హరియానాలుగా గురుముఖి హిందీభాషా ప్రాంతాలను రెండింటిని వేరువేరు రాష్ట్రాలుగా విభజించారు. ఒక రాష్ట్రాన్ని ఒక భాషా రాష్ట్రాన్ని రెండు చేయడం కాదుకదా అది, అస్సాంను మూడుచేసి చిన్న చిన్న రాష్ట్రాలుగా చేయలేదా అంటున్నారు. అస్సాంలోని ఆటవిక ప్రాంతపు వారి వారి. భాషలను బట్టి మేఘాలయ, అరుణాచలం, నాగాలాండులుగా విభజించటం జరిగింది. ఈనాడు అస్సాంలో వివాదం కూడా కచార్‌లో బెంగాలీలు ఎక్కువ. మిగతాప్రాంతం అస్సాం. అవి ఆటవిక ప్రాంతాలు. భాషలు. వాటికి మనకు పోలిక ఉండజాలదు కదా! సమగ్ర రాష్ట్రంగా గౌరవ స్థాయిలో వుండగల పెద్ద రాష్ట్రం చిన్న రాష్ట్రాలుగా చీల్చడానికి ఏదో ఒక ప్రాతిపదిక ఉండాలి కదా! ఇంతవరకు భాషా రాష్ట్ర నాయకులుగా వుండి నేడు అది కాదందామా ? ఉన్నదాన్ని రెండు రాష్ట్రాలు చేద్దామంటే అది ఎంతవరకు పోతుంది? ఏదైనా ఫరవాలేదంటే అది ఆలోచన చేయవలసినదిగా వినయపూర్వకంగా విన్నవించుకుంటున్నాను. ఇంత పెద్దరాష్ట్రం వుంటేనే కేంద్రం నుండి యితర రాష్ట్రాలవలె ఆర్థిక వనరులు సాధించలేక పోతున్నాం. అందుకు కారణం యింతవరకు అధికారంలో ఉన్న పెత్తందారుల ప్రభావమో, అసమర్థతో అనుకుంటున్నాం. రాష్ట్ర ప్రజలు రాష్ట్ర వ్యక్తిత్వం, రాష్ట్ర నాయకత్వం, రాష్ట్రంలో వీరందరి మధ్య అన్యోన్య సమరసం వీటన్నింటికి మించి ప్రజాస్వామిక శక్తుల ప్రభావం. ప్రజా వుద్యమాలు వీటి అన్నింటి ప్రభావంపై ఆధారపడి వుందని మనకందరకు తెలిసిందే. ఈ అన్నింటిని దక్షతతో నడపకపోవడంతో అన్ని ప్రాంతాల సమున్నతాభివృద్ధిని నిర్మాణాత్మకంగా, సమ దృష్టితో పరిశీలన చేయడం లోపించడం వల్లనే కదా, దానిని సర్దేదెట్లాగో ఆలోచించవలసి వచ్చింది. హైదరాబాదు నగరం అందరికి సమాన నగరంగా వుండలేదనే

మానసిక బాధ అవమానంగా భావించడంవల్లనే యింత ఆందోళనతో యువతరం కదిలింది సర్కారు, రాయలసీమ, తెలంగాణాలతో ఎవరి దృక్పథంనుండి వారు విడివడిపోతామనడం భవిష్యత్తు, సుదూర భవిష్యత్తును ఉదారంగా ఆలోచించవలెనని విన్నవిస్తున్నాను. సర్కారు, రాయలసీమవారు ఆగ్రహావేశాలతో ఉన్నమాట నిజమే. ఎవరు కాదనగలరు. జీవితంలో కొన్ని పగటి కలలు, కొన్ని పీడ కలలు, కొన్ని ఆశలతో వున్న తీయటి కలలు వుంటవి కదా. నాయకులు నిర్మాణయుతంగా ఆలోచించి, ఆచరించి వుంటే ఇంత బాధ పడవలసిన పని వుండేది కాదు. అది లేనందుననే ఆంధ్ర జీవితంలో, ఆంధ్రప్రదేశ్ జీవితంలో యిన్ని యిక్కట్లకు పాలవుతున్నారు. ఒకసారి చీలిపోతే మళ్ళీ కలియడం అంత సాధ్యమా, ఆలోచించండి. ఆంధ్ర నాయకత్వం చేసిన నేరాల ఫలితం అందరం అనుభవిస్తున్నాం. అనుభవించవలసి వచ్చింది. ఉదార హృదయంతో భవిష్యత్తు దృష్టితో, ఆంధ్ర సంస్కృతిని సమున్నత పథాల కందించవలెననే భావనతో ఆలోచించలేమా?

## ప్రజా నాయకులు : జాతి వైతాళికులు

"కారే రాజులు రాజ్యముల్ కలుగవే గర్వోన్నతిన్ బొందరే? వారేరీ" ఆనాడు రాజులు అయితే ఈనాడు ప్రజా రాజ్యం గనుక మంత్రులూ—అంతేగా. ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రులుగా పాలన చేసిన శ్రీ సంజీవరెడ్డి, శ్రీ గోపాలరెడ్డి, శ్రీ సంజీవయ్య శ్రీ బ్రహ్మానందరెడ్డి, శ్రీ నరసింహారావులను మాత్రమే మన స్మృతి పథంలో వుంచుకోవడం తప్పడంలేదు. కాని అంతకు ముందున్న ఆంధ్రకేసరి ప్రకాశం, బూర్గులలను కూడా మరువలేం కదా. మరి అంతకు ముందున్న మంత్రి యుగంధరుడు, మంత్రి భాస్కరుడు మంత్రి తిమ్మరుసు, తిక్కన మంత్రులు ఆంధ్రుల కారాధ్యులు కారా? అట్టివారు వచ్చేందుకు ఆశించుదాం. ఆంధ్రభూమి నేలిన ప్రతాప రుద్రుడు, రుద్రమదేవి, రాజ రాజ నరేంద్రుడు, శ్రీ కృష్ణ దేవరాయలు చేసిన పాలనా విధానం, వారి సంస్కృతి ఆంధ్ర జీవన ప్రవంతికి, ఆంధ్ర ప్రజల సమైక్యతకు, భావావేశం కలిగించదా? మన నన్నయలు, పోతనలు, తిక్కనలు, పెద్దన్నలు, వేములవాడ భీమన్నలు మున్నగు మహా కవులు మన భాషా వాఙ్మయ నిర్మాతలు మనకు ఆంధ్రోజ్జీవనానికి ఆరాధ్యులుగా వుండి కార్యోన్ముఖులను చేయలేరా? గుంటూరులో పుట్టి, నెల్లూరు మెట్టి, ఖడ్గతిక్కనగా, కావ్యతిక్కనగా కలం కత్తులు సాగించి కాకతీయ సామ్రాజ్య రక్షణకు కదన పాండితి, ఆంధ్ర సంస్కృతీ రక్షణకు కవన పాండితిని చూపి, నేర్చుకొని కలిగించిన వీరావేశం నేటి ఆంధ్ర సమైక్య రక్షణకు శ్రీరామ రక్షగా ప్రబోధించలేదా?

నిన్న గాక మొన్న మరపు తగలని నైజాం ప్రజానీకం ముష్కర రాజరికం నుండి రజాకార్ల అమానుష హత్యాకాండ బారి నుండి బయటపడి స్వతంత్ర భారత దేశంలో భాగస్వాములుగా అంతర్లీనమగుటకు తెలంగాణా, సర్కారు, రాయలసీమ ఆంధ్రులంతా కలసి మెలసి పరస్పర అండ దండలతో సాగించిన పోరాటం వీరోచిత గాథలు చేసిన త్యాగాలు ఆ సౌభ్రాతృత్వం యీనాడు ప్రదేశ్ ప్రజల జీవన సముద్ధరణకు అన్నదమ్ముల వలె కలసి పోవుటకు కార్యావేశాన్ని కలిగించలేదా !

## విశాలాంధ్రను చీల్చవద్దు

ఎన్ని వేల సంవత్సరాలో కలిసివుండి నైజాం నిరంకుశ పాలనవల్ల యెడబాటుచెంది, ప్రజాపోరాట ఫలితంగా, స్వాతంత్ర్య సముపార్జన ఫలితంగా స్వీయరాష్ట్రాన్ని సాధించుకొని నైజాం నవాబును గద్దె దింపి యావద్భారత దేశంలో నవాబులు, రాజులు, మహారాజులు వారి వారి పాలనను తుదముట్టించి, ప్రజాస్వామికంలో విశాలాంధ్ర సాధించి, సోషలిస్టు పురోగమనంలో పరువులెత్తవలెననే ఉత్సాహంతో పయనిస్తున్నాం మనం. ఇందిరాగాంధీ మీద కోపంతో, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిచేసిన అవకతవకల అసమర్థతల వల్ల ఆగ్రహావేశులై విశాలాంధ్రను విచ్ఛిన్నం చేసుకుందామా! వీరంతా వస్తారు. పోతారు. విశాలాంధ్ర ఒకసారి చీలితే మరలా వస్తుందా! వీరు, వీరి కోపాలకు విశాలాంధ్రను బలిచేద్దామా! మనకు అప్పుడప్పుడు కలిగే ఆవేశాలకు చిన్నతగవుల కోపకారణాలకు విశాలాంధ్రను ఆహుతి చేద్దామా!

ఇంగ్లీషు ప్రభుత్వం పోయినా వారి శాసనాలు, వారికామన్వెల్తు, వారి టౌటన్ హాంసిస్టం పరిపాలనా విధానం, వారి సివిల్ సర్వెంట్సు పద్ధతి, వారు ప్రవేశపెట్టిన బానిసలను తయారుచేసే విద్యావిధానం, భాష, వేషాలు, కొన్నిరాజ్యాంగ విశేషాలు వదిలించికోలేక పోన్నాం. ఛాయలవలె వెంటాడుతున్నవి. అవి అన్నీ మన అభివృద్ధికి సంకెళ్ళు అయికూర్చున్నవి. అల్లే నైజాం పోయినా అతని ఫర్మానాలు, పరిపాలనా విధానపు అవశేషాలు గస్తీనిషానీలు, ముల్కీనిబంధనలు యింకా అమలులో వుండడం, వాటినే కోర్టులు, ప్రభుత్వాలు అమలు జరుపుటకు అంగీకరించడం అవమానకరమే. వాటిని వదిలించుకొనుటలో జరిగినప్రయత్నాలలో ఆంధ్రప్రదేశ్ ప్రజలతో సమైక్యతసాధించడంలో నాయకత్వం క్షమించరాని తప్పిదం చేసింది. ఇంగ్లీషు ప్రభుత్వ అవశేషాలు వదలలేదు, నైజాంపాలనా ఛాయలు మనలను వదలలేదు. దేశాన్ని సంక్షోభంలో ముంచెత్తినవి. ఆందోళన ఫలితంగా ముల్కీనిబంధనలకు తుదిఘడియలు దాపురించినవి. అయితే మూడేండ్ల అదనపు గడువు హైదరాబాదు నగరంలో వుండిపోయింది. అందుకు నివారణోపాయం వాటిని రద్దుచేయించే ప్రభుత్వమా— అందులో విఫలం అయినామని తరతరాలుగా వుండి ఆంధ్రసంస్కృతిని అయిదుకోట్ల ప్రజలు అభ్యుదయ పరుచుకోగల రాజ్యవ్యవస్థను ముక్కలు చేద్దామని ప్రయత్నించడమా, ముందుతరాలవారు సహిస్తారా, చరిత్ర క్షమిస్తుందా? రోగానికన్నా చికిత్సవల్ల బాధలు ఎక్కువవుతవేమో ఆలోచించామా, ఆగ్రహంలో ఆలోచించలేదంటారా. అందుకు విభజనమే నివారణోపాయం అంటారా, దురదృష్టం. ఆంధ్ర సంస్కృతి, ఆంధ్రభాష, ఆంధ్రప్రదేశ్ సమగ్రాభివృద్ధి యింతవరకు ఇన్నాళ్ళు ఎందుకు ముందుకు పోలేకపోయామో ఒక్కసారి మరల ఆలోచించండి.

## సమైక్యత చేకూర్చిన సత్ఫలితాలు

సర్కారు రాయలసీమ, తెలంగాణా ప్రజల సమైక్య ఆందోళన ఉద్యమ ఫలితంగానేకదా నాగార్జునసాగర్ సాధించుకున్నాం. ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణ నిర్ణయాన్ని సాధించుకున్నాం. తుంగభద్ర ప్రాజెక్టు ఎగువ కాలువ, శ్రీశైలం ప్రాజెక్టు సాధించుకున్నాం. పోచంపాడు ప్రాజెక్టు సాధించుకున్నాం. వంశధార ప్రాజెక్టు ప్రారంభించడమే జరిగింది కాని తగిన ఆందోళన లేనందున నత్తనడక నడుస్తున్నది కదా! అందరి ఆందోళన ఫలితమేకదా కొత్తగూడెం థర్మల్ కేంద్రం, రామగుండం ఎరువుల ఫ్యాక్టరీ నిర్మించుకొనుచున్నాం. కావలసినంత ఐక్యత లేకనే కేంద్ర ప్రభుత్వంనుండి ఇంకా ప్రాజెక్టులు సాధించుకోలేకపోయాం ఐక్యతలేకనేకదా రామపాదసాగర్ సాధించుకోలేకపోయాం. పోగొట్టుకున్నాం. ఇప్పటికయినా పోలవరము బ్యారేజి స్కీము సాధించవలెనంటే అందరి సమష్టి కృషి లేకపోతే సాధ్యమా, మనలో అరమరల వల్లనేకాదా విశాఖలో మెరైన్ ప్రాజెక్టు తురుచునాపల్లి పోతుంటే కదలలేకపోయాం. తగిన ఆందోళన చాలనందుననే కదా సోమశిల వద్ద అణుకేంద్రం వేయ్యకోలేకుండా వున్నాం. కృష్ణ, గోదావరి జలాల వివాదం నుండి బయటపడలేకుండా వున్నాం. ఒకనాడు కేంద్రప్రభుత్వం యిస్తానంటేకూడా కేంద్ర విశ్వవిద్యాలయాన్ని పోగొట్టుకున్నాం. కేంద్ర ప్రభుత్వ రంగంలో 2000 కోట్ల పెట్టుబడులు పెడితే ఆంధ్రప్రదేశ్‌లో 30 కోట్లయినా రాలేదు కదా! జాబితా వ్రాస్తే ఎన్నో కనిపిస్తవి. విడిపడిపోతే ఆకు అంది అగపడకుండా పోయేవి మరెన్నో!

## భావసమైక్యత ఆవశ్యకం

విశాలాంధ్ర సాధించాంగాని విశాలాంధ్రోద్యమం మరచిపోయాం. ఆంధ్రప్రదేశ్ సాధించాంగాని ఆంధ్రభాషను గౌరవించలేకపోయాం. ఆంగ్ల సామ్రాజ్యాన్ని తుదముట్టించాముగాని ఆంగ్లమోజు పోగొట్టుకోలేకుండా ఉన్నాం. నైజాంను రద్దుచేసుకున్నాం కాని వారి అవశిష్టాల మీద భ్రమలు పోగొట్టుకోలేకుండా వున్నాం. 1913 నుండి 1953 వరకు సాగించిన ఆంధ్రోద్యమం, ఆంధ్ర మహాసభ, వాటితోపాటు సాంస్కృతిక అభ్యుదయోద్యమాలు, భావసమైక్యతను బలపరిచేందుకు సాగనేలేదు. అల్లే విశాలాంధ్ర ఏర్పడగానే అంత వరకు అనధికారంగా సాగిన ఉద్యమాలనన్నింటిని కట్టిపెట్టి, ఒక ప్రభుత్వంలో అన్నీ సాగిస్తామని తలంచి ప్రతి చిన్నపనికీ, పెద్ద పనికీ భావసమైక్యతకు సహా ప్రభుత్వంలోనే, ప్రభుత్వపరంగానే సాధించుదామని, మిగతా రంగాలను మూలపెట్టి బూజుపట్టిస్తే బూజు పట్టిన అభిప్రాయాలతో నున్నవారు అధికారంలో వుండడంతో అభ్యుదయం మసుపు తగిలింది. స్వార్థం పెరిగింది. ఉద్యోగులను పిల్చాం. ప్రజలను ఉద్రేకపరిచాం. అధికారాన్ని అహంకారంతో స్వార్థ చింతనతో సాధించాం. మిగిలింది భావసమైక్యత బదులు పరస్పర ద్వేషం సౌభ్రాతృత్వం బదులు ముఠాతత్వాలు, సన్నిహితత్వం బదులు పరస్పర దూషణ, ఆచారవ్యవహారాలతో సమిష్టితత్వం సాధించడం బదులు మానసికంగా గోడలు కట్టుకొని వ్యక్తిగత అహంకారాల మధ్య కొట్టుమిట్టాడుకుంటూ అధికారంవున్నవారు ఆడించినట్లల్లా ఆడి ఒక అగాధాన్ని తయారుచేసి రానున్న తరంకూడా మరవడానికి వీలులేనంత ద్వేషం సృష్టించాం. భావసమైక్యత సాధించేందుకు బదులు ద్వేషపూరితమైన మైకంను కలిగించాం. అధికారంలో వున్నవారికి అవసరమైనప్పుడల్లా ద్వేషం పెంచితే ఆ మైకంలో ఆగ్రహోదగ్రులం అయి మానవత్వాన్ని కూడ మరచిపోయేంత విద్వేషాన్ని ప్రజ్వలింపజేసి, విశాలాంధ్రను అందులో ఆహుతిచేయటానికి పూనుకునేందుకు తగురంగాన్ని సృష్టిస్తున్నాం. ఈ ద్వేషం ఎపుడు ప్రేమగా మారుతుందో కదా! అట్టి స్వర్ణ ఘడియలు ఎప్పుడు వస్తవో కదా! ఇట్టి తియ్యని కలలు జీవితంలో ఆంధ్రుల జీవితంలో మృగ్యమైనా, ప్రభుత్వాధినేతలు ద్రోహము చేసినా, మంచి చేసినా మంచి చేయడం ఎన్నడూ కన్పించడంలేదు. కావున ద్రోహం చేసినప్పుడల్లా, ఉద్రేక పరచినప్పుడల్లా మనం ఉద్రేకాలలోపడి అయిదుకోట్ల ఆంధ్రుల ప్రయోజనాలకన్నా తరతరాల అభ్యుదయ ప్రయోజనాలకన్నా మనలను ఆవేశ పరచిన అధికార కాంక్షా పరుల ఆవేశోత్సాహాలకు ఆహుతి కావడంతోపాటు విశాలాంధ్రను సంక్రాంతి భోగి మంటలలో కలిపి వేయడమేనా? దీనిని నిరోధించాలి. మంత్రులు రావచ్చు. ముఖ్యమంత్రులు రావచ్చు. ప్రధాన మంత్రులు రావచ్చు, పోవచ్చు. విశాలాంధ్ర విచ్ఛిన్నం కారాదు.

## విన్నపం

తరతరాల ఆంధ్రుల చరిత్రలో ఆంధ్రయువకులు చూపిన చొరవ, దేశభక్తి, ఆదర్శ త్యాగాలతో చేసిన ఘనకీర్తి ప్రతిష్ఠలు ఆంధ్రప్రదేశ్ సమైక్యతను పరిరక్షించటాని కుపయోగించండి అని విన్నవించుకుంటున్నాం. భవిష్యత్తు నాయకత్వానికి పునాదులు వేయండి. కేంద్రప్రభుత్వాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని పెద్దలను అందరిని సరైన మార్గంలో పెట్టగల నాయకులుగా సాగండి. ఆంధ్రసంస్కృతి పరిరక్షణకు బద్ధకంకణులుగా తయారు అవండి. అరవై సంవత్సరాల ఆంధ్రోద్యమాన్ని మూడు పువ్వులు, ఆరు కాయలుగా పరిపుష్టంగా విశాలాంధ్ర సుస్థిరతకు దీక్షా దక్షులుకండి. చరిత్రలో శాశ్వతంగా వుండిపోగల పనులు చేయండి. చరిత్రను వెనుకకు మళ్ళించకండి. జాతీయ ఉద్యమంలోఉన్నత స్థాయి ఆశయము భాషాప్రాతిపదికరాష్ట్రాలు. జాతి నిర్మాణానికి పునాదిగావుంటుందనే అభ్యుదయసిద్ధాంతాన్ని ఆశయంగా పెట్టుకొని, మీ వెనుక గతించిన తరం త్యాగాలతో సాధించినదాన్ని పరిపుష్టం చేయండి. ముందుకు సాగిపోండి. ఉన్నత సాంప్రదాయాన్ని మీ తర్వాత తరంవారికి అందించండి. ఆంధ్రప్రజల సాధనంగా విశాలాంధ్ర రాష్ట్రాన్ని సుస్థిరం చేసి ఆంధ్రోద్యమ వజ్రోత్సవం జరిపి ఆంధ్రభారతావనికి ఉరకలువేసి ముందుకు మునుముందుకు సాగిపడవండి.

జారిన దేశ గౌరవము చక్కగ దిద్ది మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగ పాలనచేసి సమానరాష్ట్రమున్
కూరిమి నాసజేయ తెలుగుం బుడమిం గడిపెయ్యరయ్యదీ
భారతి నాంధ్రపుత్రులు జగజ్జనధర్మమెదృష్టి నిల్పుచున్. ★

# మన రాజ్యాంగము—వెనుకబడిన వర్గాలు

శ్రీ జె. వీరాస్వామి

వెనుకబడిన వర్గాలు, వెనుకబడిన కులాలు అనే రెండు పదాలు ఒకటి కాదు. కులాలు, హిందూమత సాంప్రదాయానికి సంబంధించిన, వైత్యాస ముద్రికలు. హిందూ సమాజాన్ని, ఐకమత్యము లేకుండా చేస్తూఉన్న విషసర్పము ఈ కులవ్యవస్థ. మొదట వృత్తిని బట్టి ఏర్పాటైన వర్ణవ్యవస్థ, రానురాను వృత్తులు అంతరించినా, కొన్నికొన్ని తెగలవారు అనుసరించే వృత్తులలో మార్పులు వచ్చినా, వారివారి కులాలు మాత్రం పుట్టుమచ్చల్లాగా వారిని వెంటాడుతూనే ఉన్నాయి. కులాన్నిబట్టి గౌరవము, సాంఘిక ప్రతిపత్తి ఈనాటికీ చెలామణి అవుతూనే ఉన్నాయి. పెద్ద పట్టణాలలోను, నగరాల్లోనూ కులబంధనాలు కొద్దిగా సడలింపబడుతూ ఉన్నాయి. కాని కుల వ్యవస్థలోని మార్పు తాబేలు నడకలాగానే ఉంది. ఇక "వర్గం" అనే దానికి ఇంగ్లీషులో క్లాస్ అనే పదం భారత రాజ్యాంగంలో వాడబడింది. 15, 16 అనుచ్ఛేదాలలో, సందర్భాను సారంగా వర్గం, వర్గాలు అనే పదాలు వాడబడ్డాయి. ఇవిగాక బలహీన వరగతులు అనే పదం 46వ అనుచ్ఛేదంలో కన బడుతుంది. ఈ పదజాలం వాడిన సందర్భాలు నిశితంగా పరిశీలిస్తే భారత దేశంలో అనాదినుంచి కొన్ని బలహీనమైన వర్గాలు, కులాలు, జాతులవారు ఉంటూ వచ్చారని, వారిని సమాజంలో ప్రగతిసాధించిన వర్గాలవారితో కలిసిపోయేలా అభివృద్ధిపరిస్తేగాని, భారతదేశం ఒకే ఒకజాతిగా మనుగడ సాధించలేదని, రాజ్యాంగ నిర్మాతలు భావించి నట్లు స్పష్టమౌతుంది. మన రాజ్యాంగ ఉపోద్ఘాతంలో, రాజ్యాంగ లక్ష్యం విపులంగా చెప్పబడింది. నాలుగు ముఖ్య లక్ష్యాలు ఉపోద్ఘాతంలో ఉదహరింప బడ్డాయి. ఇందులో ముఖ్యమైనవి, సాంఘిక న్యాయం చేకూర్చుకోవడం; ఆర్థిక, రాజకీయ రంగాలలో అంతస్తు, అవకాశాలలో సమానత్వం సాధించడం. వర్గ, వర్ణ వ్యవస్థలచేత విభజి పబడ భారత సమాజం పురోభివృద్ధి సాధించాలంటే, సమాన అవకాశాలు కల్పిస్తే సరిపోదు. సాంఘిక న్యాయం కలుగ జేస్తూ, సమాన అంతస్తులను రూపొందించాలి. అప్పుడే సమాన అవకాశాలకు అర్థం ఉంటుంది, జాతి అంతా ప్రగతి సాధించడానికి వీలుపడుతుంది. సాంఘిక అసమానతలతో, సతమత మౌతున్న హిందూ సమాజానికి, సమాన అవకాశాలు కల్పించి విడిచిపెడితే, అనాదినుండి సాంఘిక వ్యవస్థలో బలసంపదలు కలిగిన వారు, ముందుకు చొచ్చుకపోయి బలహీన వర్గాల వారిని, నికృష్టమైన స్థితిలో ఉంచవలసి వస్తుంది. అట్టి పరిస్థితులలో, మన స్వాతంత్ర్యము, ప్రజాస్వామిక గణతంత్రి రాజ్య నిర్మాణము, కాగితాలపైన నిలిచిపోయే ఆదర్శసూత్రాలుగా ఉండిపోతాయి. ఇది మనం ముఖ్యంగా గమనించాల్సిన విషయం.

వెనుకబడిన వర్గాలు అంటే ఎవరు? అనేది ఇప్పుడు తెలుసు కోవాలి. భారత రాజ్యాంగంలో ఈ పదజాలాన్ని నిర్వచించ లేదు. కాని సుప్రీమ్ కోర్టువారు చిత్రలేఖ అనబడే మైసూరుకేసులో కులం—వర్గం అనే పదాలకు ఉన్న వ్యత్యాసాలను విశదీకరించారు. మన రాజ్యాంగములోని, పదిహేనవ అనుచ్ఛేదంలో కులాలను గురించి ప్రస్తావన లేదు. వర్గాలను గురించి మాత్రమే ప్రస్తావిస్తున్నది. రాజ్యాంగ రచయితలు కులాలను సాంఘికంగా, విద్యావిషయికంగా వెనుకబడిన తెగలుగా కూడా భావించినట్లయితే షెడ్యూలు కులాలు షెడ్యూలు తెగల విషయంలో చెప్పినట్లే వారు చెప్పి ఉండేవారు. కొన్ని కులాలు లేని వర్గాలు ఉన్నాయి. కులవ్యవస్థతో సంబంధములేని క్రైస్తవ మతస్థులు, మహమ్మదీయ మతస్థులు, తదితర మతస్థులు ఉన్నారు. వారిలో వెనుకబడి ఉన్న ప్రజలు ఉన్నారనేది కాదనలేని సత్యం. కాబట్టి వర్గాలు అనే విస్తృత పదం అనుచ్ఛేదం యొక్క నాలుగవ క్లాజులో వాడారు, 15వ అనుచ్ఛేదం నాలుగవ క్లాజులోనే ఒకదాని ప్రక్క ఒకటిగా వెనుకబడిన వర్గాలు షెడ్యూలు అనే పదజాలం వాడబడింది. కాబట్టి, వర్గాలు అనేవి కులాలే అనడానికి ఆస్కారము లేదు. ఒక పౌరుని యొక్క, లేదా కొందరు పౌరుల తెగ యొక్క, వెనుకబడినతనము నిర్ణయించడానికి కులం ఉన్న పక్షంలో, వారి కులం కొద్ది సంబంధం కలిగి ఉంటుందే కాని, కులంలేని వ్యక్తి, వ్యక్తుల విషయంలో వెనుకబడిన తనం నిర్ణయించడానికి, కుల ప్రసక్తి రావడానికే వీలులేదు.

పైన ఉదాహరించిన విషయాలను విమర్శనాత్మకంగా పరిశీలిస్తే, సుప్రీమ్ కోర్టు వారి తీర్పు లక్ష్యం, మనకు బాగా బోధపడుతుంది. భారతీయ పౌరులలో, కొందరు కొన్ని కొన్ని అసమానతలచేత బాధపడుతున్నారు కాబట్టి, ఆ అసమానతలేమిటో క్రోడీకరించి వాటికి లోనైన వారిని వెనుకడిన వర్గాలుగా వర్గీకరించడం సరియైన పద్ధతిగా మనకు తోస్తుంది. ఇందులో, కులం అనేది ఉన్న వ్యక్తులలో, ఆ కులానికి సంఘములో ఉన్న మర్యాద, పలుకుబడి ఒక కారణంగా తీసుకొనడంలో ఎంతమాత్రం తప్పులేదు, ఒకవ్యక్తి హీనముగా చూడబడే కులములో పుట్టినా, సిరిసంపదలు కలిగిఉంటే, సంఘములో—అంటే పట్టణాలలో—గౌరవ మర్యాదలు పొందే అవకాశముంది. అదేవ్యక్తి పల్లెటూళ్లో ఉంటే గౌరవం, మర్యాద లభిస్తుందా అంటే సందేహమే. వెనుకబడిన తనం నిర్ణయించడమనేది చాలా గడ్డు సమస్య. ప్రభుత్వమునుండి ఏదైనా సహాయం వస్తుందని తెలిసిన మరుక్షణం, కొందరు పౌరులు,

తాము వెనుకబడిన వర్గములోని వారమే అని ముందుకు వచ్చి న్యాయంగా పేదవారికి రావలసిన అవకాశాలు వారు అన్యాయంగా వినియోగించుకోవాలని చూస్తుంటారు. ఇది అరికట్టాలి అంటే ప్రభుత్వం వెనుకబడిన వర్గాలను స్పష్టీకరించే ముందు నిర్దిష్టమైన లక్షణాలు ఏమిటో బహిర్గతం చెయ్యాలి. అలా చేయడంవల్లనే, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు 1970 వ సంవత్సరంలో ప్రకటించిన వెనుకబడిన వర్గాల జాబితాను సుప్రీముకోర్టు పూర్తిగా ఆమోదించారు.

## బినామీ దత్తు

అగ్రజాతి వర్ణస్థులు అనబడే వారు కొందరు షెడ్యూలు కులాలకు, షెడ్యూలు తెగలకు ఇతర వెనుకబడిన వర్గాలకు రాజ్యాంగరీత్యా రావలసిన సదుపాయాలను కుతంత్రంతో తాము దోచుకోడానికి ప్రయత్నం చేస్తూ ఉంటారు. నేను ఈ మధ్య చూచిన సంఘటన ఇక్కడ ఉదహరించడం అప్రస్తుతం కాదనుకుంటాను. ఒక ఉన్నత కులంలో పుట్టిన అబ్బాయిని, అతని తల్లిదండ్రులు ఒక బీద హరిజనునికి దత్తత చేసినట్లు పత్రం పుట్టించి ఆ దత్తత స్వీకార పత్రాన్ని ఆధారంగా చేసుకొని, ఆ పిల్లవానికి షెడ్యూలు కులాల రక్షణల క్రింద మెడికల్ కాలేజీలో సీటు సంపాదించారు. నిజం వాకబు చేస్తే, దత్తత స్వీకార పత్రం మినహాయిస్తే, అందులో సత్యం కనబడలేదు. పిల్లవాడు, దత్తు తండ్రి కుటుంబంలో భాగస్వామి కాలేదు. దత్తత కుటుంబం వారితో అతడు నివసించడం లేదు. కన్న జనక తండ్రి ఇంట్లోనే ఉంటూ, షెడ్యూలు కులాల వారికి చెందవలసిన రక్షణను మాత్రం స్వాహా చేస్తున్నాడు. ఇది ఆ పిల్లవానికి పుట్టిన బుద్ధికాదు. పెద్దలైన వారు ఒక పథకం ప్రకారం చేసే ద్రోహం. పాపం, ఆ బీద హరిజనుడు దత్తతకు ఎందుకు అంగీకరించాడో, మనం ఊహించడం కష్టం కాదు. షెడ్యూలు జాతులలో, ఈ జాడ్యం మరీ ముమ్మరంగా ఉంది. తూర్పుగోదావరి, విశాఖ, శ్రీకాకుళం, ఖమ్మం, కర్నూలు జిల్లాలలో షెడ్యూల్డు తెగల వారు ఉన్నారు. అంటే ముఖ్యంగా కొండ జాతులన్న మాట. షెడ్యూలు ప్రాంతాలలో ఉన్న గ్రామాధికారుల వద్దనుండి కొందరు ప్రగతి సాధించిన అగ్రవర్ణస్థులు, తమ తమ నిజ కుల సాంకేతాలకు, "కొండ" అనే పదాన్ని చేర్పించుకొని—ఉదాహరణకు "కొండరెడ్డి" "కొండకాపు" అని చేర్చుకొని—కేంద్ర ప్రభుత్వంలోనూ, రాష్ట్రప్రభుత్వంలోనూ ఉద్యోగాలను కాజేస్తున్నట్లు, కొందరు చెబుతున్నారు. ఇది కంచెయే చేను మేసిన గతికంటె హీనమైంది. ఈ విషయంలో ప్రభుత్వం అప్రమత్తతతో మెలగాలి. దొంగ సర్టిఫికట్లు ఇచ్చే ఉద్యోగులపైన వాటిని మధ్యపెట్టి తీసుకొనే వారిపైన తీవ్రమైన చర్యలు తీసుకొని, ఈ సాంఘిక దురన్యాయాన్ని రూపుమాపవలసి ఉంటుంది.

వెనుకబడిన వర్గాల రక్షణలు పరిశీలించేటప్పుడు, రాజ్యాంగంయొక్క మొదటి సవరణ చట్టంలో పేర్కొనబడ్డ ఆశయాలు తెలుసుకోవడం ముఖ్యం. 1951 వ సంవత్సరంలో, మొదటి రాజ్యాంగ సవరణ బిల్లు శాసన రూపందాల్చింది. ఆ బిల్లును పార్లమెంటులో ప్రతిపాదించిన వారు స్వర్గీయ జవహర్‌లాల్ నెహ్రూ గారు. సవరణ బిల్లు ఆశయాలు, కారణాలలో ఒక భాగం ఈ క్రింది విధంగా ఉంది.

"ప్రభుత్వ ధ్యేయ నిర్వహణకు సూచించిన సిద్ధాంతాలకు, సంబంధించిన 46 వ అనుచ్ఛేదముతో, బలహీన తరగతులవారి అభివృద్ధికిగాను, ప్రభుత్వం విద్య మరియు ఆర్థిక స్థితిగతులను పెంపొందించడానికై ప్రత్యేక శ్రద్ధ తీసుకొని సాంఘిక దురన్యాయం జరుగకుండా, రక్షణలు కల్పించాలని చెప్పబడింది. వెనుకబడిన వర్గాలకు చెందిన పౌరులకు, విద్యలోనూ, ఆర్థిక, లేక సాంఘిక రంగాలలోనూ, పురోగతి కలిగించడానికి ప్రత్యేక రక్షణలు కల్పించినట్లయితే, దానిని పక్షపాత దృష్టితో చేసిన ఏర్పాట్లని సవాలు చేయడానికి వీలులేకుండా ఉండేనిమిత్తం 15 వ అనుచ్ఛేదాన్ని, తగు రీతిగా సవరించుటకు ఈ బిల్లు ఉద్దేశింపబడింది" అని చెప్పారు.

పై ఆశయాలను గమనించినపుడు ఒక సత్యం బయటపడుతుంది. బలహీన తరగతులకు ప్రత్యేక సహాయంచేసే ప్రయత్నానికి, రాజ్యాంగంలో ప్రాథమిక హక్కులు అడ్డగిలినట్లయితే, రాజ్యాంగాన్ని సహితం తగురీతిగా సవరించడానికి కూడా వెనుకాడకూడదని తాత్పర్యం. ఇది మొదటి రాజ్యాంగ సవరణ యొక్క లక్ష్యం. పవిత్ర కార్యంగా దీనిని భావించడంవలననే, 15 వ అనుచ్ఛేదంలో వెనుకబడిన వర్గాలకు సహాయం చేయడానికి అడ్డువస్తున్న ప్రాథమిక సూత్రాల్ని మొదటిసారిగా రాజ్యాంగ సవరణ చేసి, అట్టి సదుపాయం రాజ్యాంగబద్ధం చేశారు.

15, 16 అనుచ్ఛేదాలలో నాలుగవ క్లాజు వెనుకబడిన వర్గాలకు, షెడ్యూలు తెగల ప్రజలకు ప్రత్యేక సదుపాయాలు కలుగజేయడానికి ఉద్దేశింపబడినప్పటికీ, ప్రభుత్వం తప్పనిసరిగా ఆ సదుపాయాలు చేయక తప్పదనే గట్టి ఆదేశం, రాజ్యాంగంలో పొందుపరచబడలేదు. దీనివల్ల రెండు అంశాలు ఉద్భవిస్తున్నాయి. ఒకటి, ఏదైనా ప్రభుత్వం తనకు ఇష్టంలేని పక్షంలో వెనుకబడిన వర్గాల వారికి ప్రత్యేక సదుపాయాలు కల్పించకుండా నిర్లక్ష్యం చెయ్యవచ్చు. రెండవది, తమకు రాజ్యాంగంలో పేర్కొన్న సదుపాయాలు ప్రభుత్వాలు చేయని పక్షంలో, న్యాయస్థానాల ద్వారా హక్కులను సాధించుకొనే వీలు వెనుకబడిన వర్గాలవారికి లేదు. అందుచేత 15, 16 అనుచ్ఛేదాలలో ఏర్పాటు చేయబడినవి ప్రత్యేక సదుపాయాలే గాని, ప్రత్యేక ప్రాథమిక హక్కులని భ్రమపడరాదు. ప్రభుత్వంలో ఉన్న పార్టీయొక్క సిద్ధాంతాలనుబట్టి, వారు బాధ్యతలు తెలుసుకొనే తీరుతెన్నులను బట్టి, వెనుకబడిన వర్గాలవారికి సహాయం లభిస్తుంది. లేకపోతే లేదు. మరొక ముఖ్య విషయంకూడా ఇక్కడ పరిగణనలోనికి తీసుకోవాలి. వెనుకబడిన వర్గాలవారు, లేదా బలహీన తరగతులవారు ప్రగతి సాధించినట్లు దాఖలా కనుపించినట్లయితే, ప్రభుత్వం ఇచ్చిన ప్రత్యేక సదుపాయాలను ఆ వర్గాలవారికి రద్దుపరచవచ్చు. కాబట్టి, ఈ రక్షణలు లేదా సదుపాయాలు శాశ్వతమైనవిగా రాజ్యాంగంలో పొందుపరచడానికి వీలులేదు. కనుక ఆ రక్షణలు, తాత్కాలికమైనట్టివే. వెనుకబడిన వర్గాలను ఎంత తొందరగా వృద్ధిలోనికి తెస్తే, అంత తొందరగా ప్రభుత్వం, ఈ

(మిగతా 53వ పేజీలో)



# హైదరాబాదుకు రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి ఆగమనం





రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి హైదరాబాదులో 5 వారాలపాటు మకాం చేయడానికి
అగస్టు 25 వ తేదీన నగరానికి విచ్చేశారు.




అగస్టు 26 వ తేదీన సికిందరాబాదు జింఖానా మైదానంలో క్రీడా నిర్మాణాలకు శంఖుస్థాపనచేశారు.

ఒక దశాబ్ద కాలంలో

# మన రాష్ట్రంలో విద్యాభివృద్ధి

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 1951 లో 12.3 శాతం మంది అక్షరాస్యులు వుండేవారు. 1961 నాటికి వీరిసంఖ్య 21.20 శాతానికి పెరిగింది. 1971 నాటికి యిది మరింత పెరిగి 24.56 శాతం అయ్యింది. 1971 నాటి జనాభా లెక్కలప్రకారం దేశంలోని వివిధ రాష్ట్రాల అక్షరాస్యుల వరుసక్రమంలో మన రాష్ట్రం 13వ స్థానాన్ని ఆక్రమిస్తుంది. దీనినిబట్టి చూస్తే మనరాష్ట్రం అక్షరాస్యుల విషయంలో చాలా వెనుక బడివుందనే చెప్పాలి. దీనికి కారణం రాష్ట్రప్రభుత్వం తగువిధమైన కృషి జరపడం లేదని ఎంతమాత్రం చెప్పడానికి వీల్లేదు. నిజానికి, రాష్ట్రంలో విద్యాసౌకర్యాలను విస్తృత పరచడానికి పంచవర్ష ప్రణాళికలో ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకోడం జరిగింది. అందువల్లనే ఒక పంచవర్ష ప్రణాళికలో కన్న మరో పంచవర్ష ప్రణాళికలో చెప్పుకోదగినంతగా విద్యా సంస్థలు వెలిసాయి, వాటిలో చదువుకొనే వారి సంఖ్యసైతం చాలా వరకు పెరిగింది.

## ప్రాథమిక విద్య

భారత రాజ్యాంగం అమల్లోకి వచ్చిన పదేళ్ళలోగా బాలబాలికలందరికీ వారికి 14 ఏళ్ళు వచ్చేవరకు ఉచిత, నిర్బంధ విద్యా సౌకర్యాన్ని ప్రభుత్వం కల్పించేందుకు కృషిచేయాలని మన రాజ్యాంగంలోని 45వ అంశంలో పేర్కొబడింది. ఆ ప్రకారం గానే పంచవర్ష ప్రణాళికలద్వారా మన రాష్ట్రంలో ప్రాథమిక విద్య విషయంలో చెప్పుకోదగిన అభివృద్ధిని సాధించడం జరిగింది ఆ విషయం క్రింద ప్రకటించిన పట్టికను చూస్తే తెలియగలదు.

ప్రాథమిక పాఠశాలల్లో నమోదైన బాలబాలికల సంఖ్య 1955_56 లో 55.5 శాతం నుంచి 1971_72 లో 74.5 శాతానికి పెరిగింది. అదేవిధంగా అప్పర్ ప్రైమరీ పాఠశాలల్లో నమోదైన బాలబాలికల సంఖ్య 1970_71 నాటికి 14.8 శాతం నుంచి 36 శాతానికి పెరిగింది. ప్రాథమిక పాఠశాలల్లో నమోదైన విద్యార్థుల శాతంతో పోల్చితే అప్పర్ ప్రైమరీ పాఠశాలల్లో నమోదైన విద్యార్థుల శాతం చాలా తక్కువగావుంది. దీనికి ప్రధాన కారణం చాలామంది విద్యార్థులు ప్రాథమిక విద్యను పూర్తిచేయకుండా మధ్యలో మాని వేయడమే. స్థూలంగా యీ పరిస్థితికి మన ఆర్థిక దుస్థితే కారణం అనవచ్చు. మన పల్లెల్లో బాలికల చదువు విషయంలో తల్లిదండ్రులు సంకుచిత ధోరణిని అనుసరిస్తుండడం వల్ల కూడా మధ్యలో వారు చదువు ఆపివేయ వలసివచ్చి, తద్వారా అప్పర్ ప్రైమరీ పాఠశాల విద్యార్థుల సంఖ్య పెరుగుదల శాతం తగ్గిపోవడానికి కారణం కావచ్చు. 1965_66 లో 6_11 సంవత్సరాల మధ్య వయస్కులైన బాలురలో 92 శాతం మంది ప్రాథమిక పాఠశాలల్లో నమోదయ్యారు. బాలికల్లో మాత్రం 63 శాతం మందే నమోదయ్యారు. 1965_66లో 11_14 సంవత్సరాలమధ్య వయస్కులైన బాలురలో 38 శాతం మంది, బాలికల్లో 12 శాతం మంది మాత్రమే అప్పర్ ప్రైమరీ పాఠశాలల్లో నమోదయ్యారు.

## సెకండరీ విద్య

మన రాష్ట్రంలో 1955_56 లో 719 సెకండరీ పాఠశాలలు వుండేవి. 1960_61 నాటికి యివి 1,224 పెరిగాయి. 1965_66లో యీ సంఖ్య 2,297కు 1969_70 లో 2,925కు పెరిగింది. సెకండరీ పాఠశాలల్లో చేరిన బాలబాలికల సంఖ్య యీ యిరవై ఏళ్ళలోనూ 3.47 లక్షల నుంచి 10.49 లక్షలకు పెరిగింది.

| | వివరాలు | 1955_56 | 1960_61 | 1965_66 | 1969_70 |
|---|---|---|---|---|---|
| I | ప్రాథమిక విద్య : | | | | |
| 1. | ప్రాథమిక పాఠశాలల సంఖ్య | 28,783 | 34,623 | 37,320 | 39,757 |
| 2. | నమోదైన విద్యార్థులు (లక్షలలో) | 23.73 | 28.17 | 31.84 | 31.51 |
| II | అప్పర్ ప్రైమరీ విద్య : | | | | |
| 1. | అప్పర్ ప్రైమరీ పాఠశాలల సంఖ్య | 230 | 983 | 2,578 | 2,900 |
| 2, | నమోదైన విద్యార్థులు (లక్షలలో) | 0.77 | 2.13 | 6.11 | 7.80 |

## కళాశాల విద్య

రాష్ట్రంలో కళాశాలల సంఖ్య కూడా క్రమక్రమంగా ఎక్కువవుతున్నది. 1956-57 లో మన రాష్ట్రంలో 53 కళాశాలలు మాత్రమే వుండేవి. 1960-61 లో 67కు పెరిగాయి, 1965-66లో యీ సంఖ్య యింకా పెరిగి 102 అయింది. 1969-70 నాటికి 332 కళాశాలలు వున్నాయి. 1965-66 లో కన్న 1969-70 లో అకస్మాత్తుగా కళాశాలల సంఖ్య పెరగడానికి కారణం 1969-70లో మన రాష్ట్రంలో జూనియర్ కళాశాలలను స్థాపించడమే. ఈనాడు ఒక్క కళాశాల అయినా లేకుండా మన రాష్ట్రంలో ఏ జిల్లా కూడా లేదు. కళాశాలల్లో 1956-57 లో 16,770 మంది మాత్రమే చదువు తుండేవారు. 1969-70 లో వీరిసంఖ్య 1,51,080 కు పెరిగింది.

అనేక సాంకేతిక కళాశాలలు వచ్చాయి. సాంకేతిక కళాశాలల సంఖ్య పెరిగింది. వాటిలో సీట్ల సంఖ్య కూడా పెరిగింది. ఏటా తయారవుతున్న సాంకేతిక వేత్తలు కూడా ఎక్కువయ్యారు. తొలి పంచవర్ష ప్రణాళికా కాలంలోనూ, రెండో పంచవర్ష ప్రణాళికాకాలం లోనూ సాంకేతిక వేత్తల కొరత మనకు అనుభవైకవేద్య మయ్యింది. ఇప్పుడా కొరతను మనం అధిగమించగలిగాం. నిజానికి యీనాడు సాంకేతిక వేత్తలు కావలసినంతగా వున్నారు. ఈ పేజీలో క్రింది భాగంలోని పట్టికలో 1955-56 నుంచి 1970-71 వరకుగల మధ్యకాలంలో తయారయినసాంకేతికవేత్తల సంఖ్య పేర్కొబడింది.

## విశ్వ విద్యాలయ విద్య

రాష్ట్రంలో మూడు విశ్వవిద్యాలయాలు వున్నాయి. ఆంధ్ర ప్రాంతానికి ఆంధ్ర విశ్వవిద్యాలయం, రాయలసీమ ప్రాంతానికి

| | వివరాలు | 1950-51 | 1955-56 | 1960-61 | 1965-66 | 1971-72 |
|---|---|---|---|---|---|---|
| 1. | ఇంజనీరింగు కళాశాలలు | 1 | 4 | 6 | 7 | 7 |
| 2. | పాలిటెక్నిక్ కళాశాలలు | 3 | 4 | 15 | 21 | 21 |
| 3. | వ్యవసాయ కళాశాలలు | 2 | 2 | 2 | 3 | 3 |
| 4. | పశువైద్య కళాశాలలు | 1 | 2 | 2 | 2 | 2 |
| 5. | వైద్య కళాశాలలు | 3 | 3 | 8 | 8 | 8 |

## వృత్తి విద్య

పైన పేర్కొన్న పట్టికలో ఆయా సంవత్సరాలలో మన రాష్ట్రంలో గల వృత్తి విద్య కళాశాలలను గూర్చి సంఖ్యా పరంగా తెలియ జేయబడింది.

పై పట్టికను చూస్తే 1955-56 నాటికన్న 1960-61 నాటికి వృత్తివిద్యా కళాశాలల్లో అకస్మాత్తుగా పెరుగుదల కనిపించినట్టు అర్థమౌతుంది. దేశంలోనూ, రాష్ట్రంలోనూ చేపట్టిన రకరకాల అభివృద్ధి కార్యక్రమాలనూ, ప్రాజెక్టులనూ అమలుపరచడానికి అవసరమయ్యే సాంకేతిక వేత్తల కొరతను తీర్చడానికిగాను యీ మధ్యకాలంలో సాంకేతిక విద్యకు ప్రభుత్వం అధిక ప్రాధాన్యత యిచ్చింది. అందువల్లనే పైన పేర్కొన్న కాలంలో ఒక్కసారిగా

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం, తెలంగాణా ప్రాంతానికి ఉస్మానియా విశ్వవిద్యాలయం వున్నాయి. తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో రాజేంద్రనగర్‌లో మరొక విశ్వవిద్యాలయం-వ్యవసాయ విశ్వవిద్యాలయం-నెలకొల్పబడింది. రాష్ట్రంలోని అన్ని వ్యవసాయ కళాశాలలు, పశువైద్య కళాశాలలు దీనికి అనుబంధం కావించబడ్డాయి. దీని అనుబంధ కళాశాలల్లో పరిశోధనా కార్యక్రమాలను యీ విశ్వవిద్యాలయం చేపట్టుతుంది.

ఈ విశ్వవిద్యాలయానికి తోడు దేశంలోకెల్లా మొట్టమొదటిదిగా పేర్కొబడే మరొక సాంకేతిక విశ్వవిద్యాలయాన్ని కూడా 1972-73 లో వరంగల్లులో ఏర్పాటుచేయాలని ఉద్దేశించబడింది.

| | వివరాలు | 1955-56 | 1960-61 | 1965-66 | 1970-71 |
|---|---|---|---|---|---|
| 1. | బి. ఇ. మరియు బి. ఎస్.సి. (ఇంజినీరింగ్) | 260 | 394 | 584 | 1203 |
| 2. | బి. టెక్. | 11 | 12 | 51 | 58 |
| 3. | ఎం. బి. బి. ఎస్. | 179 | 333 | 546 | 1463 |
| 4. | బి. ఎస్. సి. (వెటర్నరీ) | 24 | 75 | 90 | 128 |
| 5. | బి. ఎస్. సి. (అగ్రి) | 98 | 170 | 249 | 340 |




## పనివారికి కనీస వేతనం

ఆంధ్ర ప్రాంతంలోని విశాఖ, శ్రీకాకుళం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాల్లోని ఏజన్సీ ప్రాంతాలలో ఇంతవరకు కార్మికునికి యిచ్చే కనిష్ఠ వేతనం యజమాని రెండు పూటల భోజనం పెడుతున్నట్లయితే నెలకు రూ 30 లు, భోజనం పెట్టనప్పుడు రూ 45 లు చొప్పునవుంది. ఈ రేట్లు చాల తక్కువగా వున్నట్లు ప్రభుత్వం భావించి వీటిని పెంచుతూ ఉత్తర్వులు జారీచేసింది. దీని ప్రకారం, యజమాని పనివానికి భోజనం పెట్టనప్పుడు నెలకు రూ 75 చొప్పున, భోజనం పెడుతున్నట్టయితే రూ. 50 లు చొప్పున చెల్లించవలసి వుంటుంది.

## హైదరాబాదు జిల్లాలో ఉర్దూవాడకం

ఆయా ప్రాంతాలలో ఆయా భాషల మాట్లాడేవారి ప్రయోజనార్థం తెలుగులోపాటు ఉర్దూ, యితర భాషలను కూడా అధికార భాషలుగా వాడాలని 1966 సం॥ ఆంధ్రప్రదేశ్ అధికారభాషా చట్టం క్రింద రాష్ట్ర ప్రభుత్వం ఆదేశించవచ్చు.

హైదరాబాదు జిల్లాలో ఉర్దూభాష మాట్లాడేవారి సంఖ్య 15 శాతం పైగా ఉన్న దృష్ట్యా హైదరాబాదు జిల్లా అంతటా అధికార ప్రయోజనాల నిమిత్తం తెలుగుతోపాటు ఉర్దూభాషను కూడా వాడాలని ప్రభుత్వం ఇప్పుడు ఆదేశించింది. ఇంతవరకు హైదరాబాదు నగరం, హైదరాబాదు జిల్లాలోని తాలుకాలలో మాత్రమే అధికార ప్రయోజనాలకు ఉర్దూను ఉపయోగిస్తున్నారు.

రోడ్ల, భవనాల శాఖ జారీచేసే టెండరు నోటీసులు, వేలం నోటీసులు మొదలైనవి; ఎక్సైజ్ ఇన్స్పెక్టర్ల, సర్కిల్ ఇన్స్పెక్టర్ల కార్యాలయాలు జారీచేసే వేలం నోటీసులు; మత్స్య విషయాల ఇన్స్పెక్టరు కార్యాలయం, దాని అనుబంధ కార్యాలయాలు ప్రజల ప్రయోజనార్థం, లేక ప్రజలకు సంబంధించి జారీచేసే వేలం నోటీసులు, యితర సాధారణ ఉత్తర్వులు; తాలూకాస్థాయి అంతకు తక్కువ స్థాయిలో అటవీ శాఖకు చెందిన రేంజి అధికారులు జారీచేసే నోటీసులు; పంచాయతీ సమితులు, గ్రామపంచాయితీలు జారీచేసే టెండరునోటీసులు; తాలూకా స్థాయిలో పి.డబ్లు డి. శాఖకు చెందిన సెక్షన్ కార్యాలయాలు రూ 10,000/–ల వరకు గల చిన్న పనుల నిమిత్తం జారీచేసే పిట్ టెండరు నోటీసులు; తాలూకాస్థాయి అంతకు తక్కువ స్థాయిలో తహసిల్దారు కార్యాలయాలు, రెవెన్యూ శాఖకు చెందిన యితర కార్యాలయాలు ప్రజల నుండి అభ్యంతరాలు స్వీకరించడానికి గ్రామాలలో జారీచేసే ప్రకటనలు, టెండరు నోటీసుల విషయంలో యీ ప్రాంతాలలో అధికార ప్రయోజనాల నిమిత్తం ఉర్దూభాషను ఉపయోగిస్తారు.

## డిప్లొమా పొందిన వారికి ఉన్నతవిద్య

డిప్లొమాపొందిన వారి ప్రయోజనార్థం, 1973–74 సంవత్సరంలో తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయానికి చెందిన ఇంజనీరింగ్ కళాశాలలోని సివిల్, ఎలక్ట్రికల్, మెకానికల్ విభాగాలలో పార్ట్‌టైమ్ బి.ఇ. డిగ్రీకోర్సులను ప్రారంభించాలనే తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రతిపాదనను రాష్ట్రప్రభుత్వం ఆమోదించింది. ప్రారంభంలో ప్రతివిభాగంలో 10 మంది విద్యార్థుల చొప్పున ప్రవేశం కల్పిస్తారు. ఐదు సంవత్సరాల వరకు లోటు పంతు భాగాన్ని అంటే 50 శాతం ఖర్చును భరించడానికీ, విశ్వవిద్యాలయం గ్రాంట్ల సంఘం సహాయం అప్పుచేసిన పిమ్మట పూర్తి ఖర్చుమొత్తాన్ని భరించడానికీ ప్రభుత్వం అంగీకరించింది.

ఈ కోర్సులవల్ల డిప్లొమాపొందినవారికి వృత్తి రీత్యాస్థాయి అభివృద్ధి చెందడమేగాక భవిష్యత్తు అవకాశాలు కూడా బాగా ఉంటాయి.

## కేంద్ర నమూనాల సంస్థ

పరిశోధన, నమూనా, ప్రయోగాలు ఏ అభివృద్ధి కార్యక్రమాలలోనైనా ప్రముఖపాత్ర వహిస్తాయి. ముఖ్యంగా నీటిపారుదల ప్రాజెక్టుల్ని నిర్మించడంలో యివి మరింతగా అక్కరకు వస్తాయి. అందువల్ల పి డబ్ల్యు డి నిమిత్తం ఒక కేంద్ర నమూనాలసంస్థను ఏర్పాటు చేయాలని నిశ్చయించబడింది. దీనిని ఏర్పాటు చేయడం వల్ల అవసరమైన నైపుణ్యం లభించడమేకాక, ఆయారంగాలలో కృషిచేస్తున్న ప్రత్యేకతరహా సంస్థలు కేంద్ర విద్యుచ్ఛక్తి, నీటిపారుదల కమిషన్ వంటి వాటిని మరీ అవసరమైనప్పుడు తప్ప మామూలు పరిస్థితుల్లో సంప్రదించ వలసిన అవసరం ఏర్పడకుండా చేయడానికి కూడా వీలవుతుంది.

ఈ కేంద్ర నమూనాల సంస్థ అన్ని ఆనకట్టలు, భారీప్రాజెక్టులు, ముఖ్యమైన ప్రాజెక్టుల తాలూకు కాలువల ముఖ్య నిర్మాణాలు, అన్ని మధ్యతరహా నీటిపారుదల ప్రాజెక్టులకు చెందిన నమూనాలను చూస్తుంది. నాగార్జునసాగర్, పోచంపాడు వంటి ముఖ్యమైన ప్రాజెక్టులకు వాటి స్వంత నమూనా విభాగాలు వున్నాయి. ఇవి కేవలం వాటి కాలువల నమూనాలను మాత్రమే చూస్తాయి. కాలువల ప్రధాన నిర్మాణాల నమూనాలను ఈ కేంద్ర సంస్థ చూస్తుంది. మధ్యతరహానీటిపారుదల చీఫ్ఇంజనీరు అధ్యక్షంలోయీ కేంద్ర నమూనాల సంస్థ పనిచేస్తుంది. మధ్యతరహా నీటిపారుదల, నమూనాల చీఫ్ ఇంజనీరు అని యీయన పిలువబడురారు. అదనంగా చీఫ్ఇంజనీరు పోస్టు ఏర్పాటు చేయబడదు. చీఫ్ ఇంజనీర్ల పనుల వత్తిడి అందరికీ సమానంగావుండేట్టుగా వారివారి పనులను పునర్వ్యవస్థీకరించడం జరుగుతుంది.

## శాసనసభ సచివాలయ సెక్షన్ ఆఫీసర్లకు జిల్లా మున్సిఫ్ పదవులకు అర్హత

జిల్లా మున్సిఫ్ ఉద్యోగాలకు యిప్పుడు నేరుగా జరిగే నియామకాల ద్వారానూ, కొన్ని వర్గాల ఉద్యోగాల నుంచి బదిలీ చేయడం ద్వారానూ ప్రమోషను ద్వారానూ చేయడం జరుగుతోంది. మొత్తం 20 ఖాళీలలోనూ 11 ఖాళీలు నేరుగా రిక్రూటు చేయడం 2 ఖాళీలు బదిలీ ద్వారా మిగిలిన 7 ఖాళీలు జూడీషియల్ సెకండ్‌క్లాస్ మేజిస్ట్రేటులకు ప్రమోషను యివ్వడంద్వారా భర్తీ చేయబడుతున్నాయి.

బదిలీద్వారా భర్తీ చేయడానికి అర్హమైన 6 వర్గాలలోనూ సచివాలయంలోని న్యాయశాఖ సెక్షన్ ఆఫీసర్లు ఒకరు. శాసనసభ సచివాలయంలోని సెక్షన్ ఆఫీసర్లుకూడా విధులలోగాని అనుభవంలోగాని పైన పేర్కొన్న వారితో సమానంగా వుంటున్న కారణంచేత జిల్లా మున్సిఫ్ పదవులకు బదిలీద్వారా ఎంపిక చేయడానికి పరిశీలించదగిన వర్గాలలో శాసనసభ సచివాలయంలోని సెక్షన్ ఆఫీసర్లను కూడా చేర్చాలని ప్రభుత్వం నిశ్చయించింది.

## బియ్యం, ధాన్యం తరలింపుపై నిర్బంధం సడలింపు

ఆంధ్రప్రదేశ్ బియ్యం, ధాన్యం (తరలింపుపై నిర్బంధం) ఉత్తర్వు క్రింద ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఒక బ్లాకునుండి మరో బ్లాకుకు పర్మిట్ మీద తప్ప ధాన్యాన్ని, బియ్యాన్ని తరలించడం అనుమతించబడదు. ఇందుకుగాను ఇప్పుడు రాష్ట్రాన్ని ఎనిమిది బ్లాకులుగా విభజించడం జరిగింది.

1. శ్రీకాకుళం విశాఖపట్టణం, 2. తూర్పుగోదావరి, 3. పశ్చిమగోదావరి, కృష్ణ, 4. గుంటూరు 5. ప్రకాశం, నెల్లూరు 6. రాయలసీమ 7. ఖమ్మం, నల్గొండ 8. తెలంగాణాలో మిగిలిన ప్రాంతం.

ఇప్పుడు పశ్చిమ తూర్పు గోదావరినుంచి విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలకు ఖమ్మం;నెల్లూరు జిల్లాలనుంచి తెలంగాణాలో యితర ప్రాంతాలకు ధాన్యం, బియ్యంను తరలించడానికి అనుమతించాలని నిశ్చయించబడింది. ఇందువల్ల ప్రస్తుతం బ్లాకులు 8 నుంచి 6 కు తగ్గించబడ్డాయి.

## రైలు మార్గాల నిర్మాణానికి అనుమతి

బీబీనగర్–నడికూడి మధ్య 150 కిలోమీటర్ల పొడవు బ్రాడ్ గేజ్ రైలు మార్గం నిర్మించడానికీ, గుంటూరు–మాచెర్ల మధ్యగల మీటర్‌గేజ్‌ను బ్రాడ్‌గేజ్‌గా మార్చడానికీ కేంద్ర ప్రభుత్వం అనుమతించింది. బీబీనగర్–నడికుడి రైలు మార్గం నిర్మాణానికి రు. $12\frac{1}{2}$ కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని నాలుగు సంవత్సరాలలో నిర్మాణం పూర్తి అవుతుంది. అంచనా 130 కిలో మీటర్ల పొడవుగల గుంటూరు–మాచెర్ల మీటర్‌గేజ్ రైలు మార్గాన్ని బ్రాడ్‌గేజ్‌గా మార్చడానికి దాదాపు రు. 8 కోట్లు ఖర్చు అవుతుంది. ఇది దాదాపు మూడు సంవత్సరాలలో పూర్తిఅవుతుంది. ఈ రెండు పథకాల ద్వారా నిర్మాణసమయంలో 30,000 ల మందికి పైగా ఉపాధి లభిస్తుంది.

వాటికితోడు, ఓవర్ బ్రిడ్జిల పనిచురుకుగా కొనసాగుతున్నది. వాటిలో ఒక దానికి రాజమండ్రి– కాకినాడ రోడ్డు పై సామర్లకోట– అనపర్తిల మధ్య లెవల్ క్రాసింగ్‌పై నిర్మించబడుతున్నది. కోడూరు నల్లజెర్ల రోడ్డుపై నవాబుపేట–తాడేపల్లిగూడెం స్టేషనుల మధ్య మరొకటి నిర్మించబడుతున్నది. ఈ రెండు ఓవర్ బ్రిడ్జిల నిర్మాణానికి దాదాపు రు 65 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మంజూరు చేసిన ఓవర్ బ్రిడ్జిలలో రెండింటి విషయంలో సూత్ర ప్రాయంగా ఆమోదించబడి పని ప్రారంభమైంది. వాటిలో ఒకటి హైదరాబాదు.–హన్మకొండ రోడ్డుపై రఘునాథ పల్లి జనగామ మధ్య ఒక లెవల్ క్రాసింగ్ పై నిర్మించబడుతున్నది. రెండవది, హన్మకొండ రోడ్డుపై ఖాజీపేట బల్హార్షా సెక్షన్‌లో నిర్మించబడుతుంది.

రు. 53 కోట్ల ఖర్చుతో కూడిన మద్రాసు–విజయవాడ రైలు మార్గం విద్యుదీకరణ పని 1976 ఆఖరునాటికి పూర్తి అవుతుందని అంచనా. ఫీల్డు పనిముమ్మరంగా కొనసాగుతున్నది. ఎలక్ట్రికల్ లోకోషెడ్డు విజయవాడలోను, ఓవర్ హెడ్ ఎలక్ట్రిక్ మరమ్మతుల షెడ్ బిట్రగుంటలోను ఏర్పాటు చేస్తున్నారు.

వ్యాగనుల మరమ్మతు వర్కుషాపు (బ్రాడ్‌గేజ్) విజయవాడలో ఏర్పాటు చేయడానికి పథకాన్ని సిద్ధంచేస్తున్నారు. ఈ పథకం అమలుకు రు.18 కోట్లు ఖర్చు అవుతాయని అంచనా.




1968వ సంవత్సరంలో మల్లాం గ్రామప్రజలు సర్పంచ్ శ్రీ కొప్పన వెంకట కొండలరావుగారి నాయకత్వంలో 16 వేల రూపాయల విలువగల శ్రమదానంచేసి చిరవ-చిరివాడలను కలిపే సుమారు ఐదుమైళ్ళ పొడవైన మట్టిరోడ్డును వేసుకొని అప్పటి పంచాయతీ రాజ్య శాఖామాత్యులు శ్రీ కోట రామస్వామి గారి ప్రశంసలు అందుకొన్నారు.

1968-69 వ సంవత్సరానికి రావలసిన అన్నిరకాల పన్నులను బకాయిలు లేకుండా పూర్తిగా 1968 జూలై నెలాఖరుకు వసూలు చేసి ఆంధ్రప్రదేశ్‌లోని గ్రామపంచాయతీలకు మార్గదర్శకమైంది మల్లాం గ్రామపంచాయతీ. గత ఆరు సంవత్సరాలనుంచి పన్నుల వసూళ్ళలో తూర్పుగోదావరి జిల్లాలో మల్లాం పంచాయతీదే అగ్రతాంబూలం. సర్పంచ్ శ్రీ కొండలరావు స్వచ్ఛంద సేవకులు. ఆదర్శరైతు. శ్రీ కొండలరావు గారిని ఆ గ్రామ ప్రజలేగాక, పిఠాపురంసమితిలోని ప్రజలు "నాయనగారు" అని పిలుస్తుంటారు. మల్లాం గ్రామప్రజల శ్రేయస్సుకై ఆయన నిర్విరామంగా కృషిచేస్తున్నారు. కుటుంబ వ్యవహారం నుంచి పొలాలు సాగుచేసుకొనే విషయం వరకు "నాయనగారి" సలహా తీసుకొనని రైతుగాని పౌరుడుగాని ఉండడు. శ్రీ కొండలరావుగారి నాయకత్వంలో ఆ గ్రామప్రజలు ఒక్కత్రాటిమీద నిలబడి పనిచేస్తున్నారు.

## వ్యవసాయంలో ముందంజ

"మీ గ్రామ పంచాయతీ ఏ ఏ విషయాల్లో ఎక్కువశ్రద్ధ చూపించిందో చెప్పండి" అని నేను అడిగాను.

"వ్యవసాయ విషయంలో ఎక్కువశ్రద్ధ చూపించిందని సమాధానమిస్తూ ఆయన ఇలా వివరించారు. "మా గ్రామ పంచాయతీ రైతుల అవసరాలను తెలుసుకొని ఆ అవసరాలను తీర్చే బృహత్కార్యంలో కృతకృత్యమైంది. వ్యవసాయదారులకు కావలసిన విత్తనాలను, పురుగునివారక, క్రిమిసంహారక మందులను, పచ్చిరొట్ట ఎరువులను లాభం నష్టం లేని పద్ధతిపై రైతులకు అందజేసింది.

"1963-64 సంవత్సరంలో 775 రూపాయల విలువగల క్రిమిసంహారక మందులను కొంది. 1964-65 సంవత్సరంలో 2,230 రూపాయల విలువగల విత్తనాలను, 336 రూపాయల విలువగల క్రిమిసంహారక ఔషధాలను కొంది. మా గ్రామపంచాయతీ 1966-67 సంవత్సరంలో 3,200 రూపాయల విలువగల విత్తనాలను, 908 రూపాయల విలువగల పురుగునివారక మందులను కొని రైతులకు పంచిపెట్టింది. ఈ గ్రామపంచాయతీకి మూడు స్ప్రేయర్లు, ఒక ఫుట్ స్ప్రేయరు, ఒక పవర్ స్ప్రేయరు ఉన్నాయి.

"ఇప్పుడు ఈ గ్రామంలో 64 బోరింగు నూతులు, 4 ఆయిలు ఇంజనులు ఉన్నాయి. ఈ గ్రామానికి విద్యుచ్ఛక్తిని తీసుకొని వచ్చే విషయంలో గ్రామపంచాయతీ భగీరథ ప్రయత్నం చేసింది. నిజంగా విద్యుచ్ఛక్తి సదుపాయం రావడం మా గ్రామప్రజల అదృష్టమనే చెప్పాలి. ఈ గ్రామంలో ఈనాడు 22 ఎలక్ట్రిక్ మోటార్లు పని చేస్తున్నాయి. ఇళ్ళకుకూడా విద్యుచ్ఛక్తి ఏర్పాటు చేసుకొన్నారు కొంతమంది గ్రామప్రజలు. గ్రామపంచాయతీ కూడా వీధులలో 23 విద్యుత్ దీపాలు వేయించింది.

"పొలాలకు బోదెలు తవ్వించడంలాంటి వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాల నిర్వహణలో పంచాయతీ సర్పంచ్ కృషి నిజంగా ప్రశంసనీయం, ప్రతి సంవత్సరం ఈ గ్రామప్రజలు రైతులు

## మధుర శ్రీ

ఎకరానికి ఒక రూపాయి నుంచి మూడు రూపాయల వరకు విరాళాలు యిస్తారు. ఆ సొమ్ము వ్యవసాయపు చెరువులలో మేటలు తీయించడానికి, పంట కాలువలు, బోదెలు తీయించడానికి ఖర్చుచేయడం జరుగుతుందని" సర్పంచ్ అన్నారు.

## పశు సంపద

వ్యవసాయంతోపాటు పశు సంపద అభివృద్ధికై మల్లాం గ్రామ పంచాయతీ గణనీయమైన కృషి చేసింది. ఈ గ్రామంలో ప్రాథమిక పశువైద్య కేంద్రం ఉంది. పశువైద్యానికిగాను మల్లాం పంచాయతి ప్రతీ సంవత్సరం 125 రూపాయలు వెచ్చిస్తున్నది. ప్రతిసంవత్సరం తొలకరిపస్తున్నదనగా పంచాయతీ పశువులకు టీకాలు విధిగా వేస్తున్నది. గత ఐదు సంవత్సరాల నుంచి ఈ గ్రామంలో పశువులకు వ్యాధులు సోకిన జాడలేదు. రైతులలో మేలుజాతి పశువుల పెంపకాన్ని ప్రోత్సహించే ఉద్దేశంతో ముర్రాజాతి దున్నపోతులను, రెండు ఒంగోలుజాతి ఎద్దులను కొనిపించింది. పంచాయతీ కూడా ఒంగోలు జాతి ఆబోతులను పోషించింది. వీటి ద్వారా

మేలురకం పశుసంతతి వృద్ధిచెందుతోంది. పులిమేరు, జల్లూరు, విరవ గ్రామాలలోని రైతులు కూడా పశుపోషణ విషయంలోనూ, వ్యవసాయం విషయంలోనూ మల్లాం గ్రామ పంచాయతీ సర్పంచ్ సలహాలు తీసుకొంటూ ఉంటారు.

## సహకారం ద్వారా పురోగతి

"మా గ్రామానికి, గ్రామ ప్రజలకు సహకార సంఘం ఎంతో మేలు చేసింది" అన్నారు, ఆ గ్రామంలో ఒక రైతు. అది ముమ్మాటికీ నిజం. 1918 సంవత్సరంలో 18 మంది సభ్యులతో, 200 రూపాయల వాటా ధనంతో శ్రీ సోమేశ్వర సహకార సంఘం ప్రారంభించబడింది. 1952వసంవత్సరంలో ఈ సహకార సంఘానికి జరిగిన ఎన్నికల్లో శ్రీ వెన్నా సూర్యారావుగారు అధ్యక్షులుగా ఎన్నిక అయ్యారు. మల్లాం గ్రామంలో ఉన్న కుటుంబాలన్నీ ఈ సంఘంలో సభ్యత్వం స్వీకరించడం సహకార ఉద్యమంపై ఆగ్రామ ప్రజలకు గల విశ్వాసానికి ప్రబల నిదర్శనం. 1956 నుంచి ఈ సహకార సంఘం రైతులకు ఎరువులను సరసమైన ధరలకు అందజేస్తున్నది. ఇప్పుడు ఈ సంఘంలో 518 మంది సభ్యులు ఉన్నారు. వాటా ధనం 3,256 రూపాయలు. ప్రభుత్వం ఇచ్చిన ఆర్థిక సహాయంతో 12,500 రూపాయలు ఖరీదుచేసే గిడ్డంగిని ఈ సహకార సంఘం నిర్మించింది.

## ఆరోగ్య, విద్యారంగాలలో ప్రగతి

కలరా, మశూచి, ఇంకా ఇతర భయంకర వ్యాధుల నిరోధానికిగాను మందులను కొని ప్రజలకు పంచాయతీ అందజేస్తున్నది. ప్రతి సంవత్సరం వంద రూపాయల నుంచి 150 రూపాయల వరకు మందులను మల్లాం గ్రామ పంచాయతీ కొంటున్నది. 60 వేల రూపాయలు ఖర్చుచేసి సురక్షిత మంచినీటి పథకాన్ని అమలు జరిపింది. ఇప్పటి వరకు మల్లాం పంచాయతీ నాలుగువేల అడుగుల పొడవుగల మురికి కాలువలను నిర్మించింది. ఈ చిన్న గ్రామంలో ఇప్పటి వరకు 180 కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు జరిగాయి.

ఈ గ్రామంలో మూడు ప్రాథమిక పాఠశాలలు ఉన్నాయి. ఇందులో ఒక పాఠశాల హరిజనవాడలో ఉంది. ప్రాథమిక పాఠశాలలకు శాశ్వత భవన నిర్మాణం జరిగింది కూడా. ఈ గ్రామంలోగల 340 మంది బడి ఈడు పిల్లలలో 220 మంది పాఠశాలలకు హాజరయి విద్యనభ్యసిస్తున్నారు. 175 మంది పిల్లలకు మధ్యాహ్న భోజన సదుపాయం కల్పించారు. ఇంకా ఈ గ్రామంలో ఒక ఉన్నత పాఠశాల ఉంది. ఉన్నత పాఠశాలలో చదువుకొనే పొరుగూరి బీద విద్యార్థులకు శ్రీ బుర్రా అప్పలరాజు, శ్రీరామన్న దొరల ట్రస్టు నిధులమీద వచ్చే వడ్డీతో మధ్యాహ్న భోజనసదుపాయం కల్పించబడింది. తన తండ్రిగారిపేర శ్రీ తుమ్మల శ్రీరామమూర్తి గారు పాఠశాలకు 20 వేల రూపాయలు విరాళం యిచ్చారు. ప్రాథమిక పాఠశాలల నిర్మాణానికి హరిజనులు రెండువేల రూపాయల విరాళం యిచ్చారు.

## సాంఘికవిద్యా కార్యక్రమాలు

సాంఘిక విద్యా ప్రయోజనాన్ని ఈ గ్రామ ప్రజలు పొందుతున్నారని చెప్పటానికి ఆ గ్రామంలో నిర్వహించబడుతున్న కార్యక్రమాలే చక్కని ఉదాహరణలు. మల్లాం గ్రామంలో నవయువక కర్షక సంఘం; మహిళా మండలి ఉన్నాయి. ఈ గ్రామంలో ఒక పఠన మందిరం, గ్రంథాలయం కూడా ఉన్నాయి. ఈ గ్రంథాలయంలో పదిహేను వందల రూపాయల విలువగల పుస్తకాలు ఉన్నాయి. పంచాయతీయే ఈ గ్రంథాలయాన్ని నిర్వహిస్తున్నది. మల్లాం గ్రామంలో పంచాయతీ రెండు రేడియోలను నిర్వహిస్తున్నది.

## గ్రామ ప్రజల విరాళాలు

పంచాయతీకి నిధులు తక్కువగా ఉన్నరోజుల్లో శ్రీతుమ్మల శ్రీరామమూర్తిగారు ఒక రేడియోను గ్రామానికి విరాళంగా యిచ్చి ఆరేడియోను ఈనాటి వరకు వారి ఖర్చుమీదే ప్రజల ఉపయోగార్థం నిర్వహిస్తున్నారు. ఇదివరలో "శాంతికళాసమితి" ఒకటి ఉండేది. ఆ సమితిలో పంచాయతీ సభ్యులుకూడా సభ్యులే. ఆ సభ్యులు నాటకాలు ప్రదర్శించి ఒక రేడియోను కొన్నారు. సర్పంచి శ్రీ కొప్పన కొండలరావుగారు ఒకరేడియోను గ్రామానికి విరాళంగా యిచ్చి వారే నిర్వహిస్తున్నారు. ఈ రెండు రేడియోల నిర్వహణకు గ్రామ పంచాయతీ ఏవిధమైన ఖర్చు చేయలేదు. మల్లాం గ్రామ ప్రజలు విరాళాలు యివ్వడంలో పేరొందారు. ఈ గ్రామంలో నిర్వహించిన ప్రతి అభివృద్ధి కార్యక్రమంలో ప్రజల విరాళం ఉంది. ఇంత అభివృద్ధిని సాధించిన ఈ గ్రామం తూర్పుగోదావరి జిల్లాలోని పిఠాపురం సమితిలో సామర్లకోటకు ఐదు మైళ్ళదూరంలో ఉంది. జనాభా 3500. ఆయకట్టు 1300 ఎకరాలు.

పన్నుల వసూళ్ళలో జిల్లాలో ఈ గ్రామ పంచాయతీదే పైచేయి. 1962–63 సంవత్సరం నుంచి మల్లాం గ్రామపంచాయతీ నూటికినూరుపాళ్ళు పన్నులను వసూలు చేస్తున్నది. పన్నులు పెంచే విషయంలో ఈ గ్రామపంచాయతీ సర్పంచి మంచి సాహసం చూపించారు. మొదట్లో పన్నుల రూపంలో 1000 రూపాయలు ఆదాయం వచ్చేది. పన్నులను పెంచి యిప్పుడు గ్రామపంచాయతీ రెండువేల రూపాయల నుంచి 2,500 రూపాయల ఆదాయం సంపాదిస్తున్నది.

పంచాయతీ కృషి ఫలించింది. 1963–64, 1964–65 సంవత్సరాలలో పిఠాపురం సమితిలో ఉత్తమ పంచాయతీగా ఎన్నిక అయి, ఒక్కొక్క సంవత్సరం వెయ్యేసి రూపాయల చొప్పున బహుమతి అందుకొంది మల్లాం. 1970 సంవత్సరంలో జరిగిన ఎన్నికల్లో గ్రామ పంచాయతీ సభ్యులను ప్రజలు ఏకగ్రీవంగా ఎన్నుకోవడం, ఎన్నిక అయిన పంచాయతీ సభ్యులు శ్రీ కొప్పన వెంకట కొండలరావును సర్పంచిగా ఏకగ్రీవంగా ఎన్నుకోడం, ఈగ్రామప్రజలకు శ్రీకొండలరావు నాయకత్వంపై విశ్వాసానికి మరొక నిదర్శనం. శ్రీ కొప్పన వెంకట కొండలరావుగారు ప్రస్తుతం తూర్పు గోదావరి జిల్లా గ్రంథాలయ సంస్థ అధ్యక్షులు కూడా.

సాహిత్యగవేషణలో, సాంస్కృతిక, రాజకీయ పునరుద్భవనంలో ప్రముఖపాత్ర వహించి, యుగనిర్దేశకులైన పెద్దలు నేడు మిక్కిలి అరుదుగా గోచరిస్తున్నారు. అట్టివారిలో అగ్రగణ్యులు శ్రీ తాపీ ధర్మారావుగారు. మన జాతి, జీవనము, సంస్కృతి పరతంత్రమై క్రుంగినప్పుడు, జాతిని జాగృతం చేసిన వైతాళికుడు ఆయన.

## జననం

క్రీ. శ. 1887 వ సంవత్సరం, సెప్టెంబరు 19 వ తేదీన బరంపురంలో ఆగర్భ శ్రీమంతులైన కుటుంబంలో శ్రీ తాపీ ధర్మారావుగారు జన్మించారు. వీరి తండ్రి అప్పన్ననాయుడుగారు గవర్నమెంటు డాక్టరు. ధర్మారావుగారి బాల్యం శ్రీకాకుళంలో

# సాహితీ తపస్వి

# తాతాజీ



శ్రీ త్రిపురనేని సుబ్బారావు

గడిచింది. చిన్నతనంలో చదరంగం ఆడేవారు. గుఱ్ఱపు స్వారీ చేసేవారు. శ్రీకాకుళంలో ప్రాథమిక విద్య పూర్తి కాగానే విజయనగరంలో మెట్రిక్యులేషన్ చదివారు. పర్లాకిమిడిలో యఫ్.ఎ. చదివేటప్పుడు వీరికి తెలుగు గురువు బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు. మద్రాసు పచ్చయ్యప్ప కళాశాలలో బి. ఏ. పట్టభద్రులయ్యారు. అప్పుడు తెలుగుభాషాధ్యాపకులు చెన్ని రంగయ్యగారు.

తాపీవారికి బాల్యంనుండీ ఆంధ్రసాహిత్యంపై అభిరుచి ఉండేది. కాని వారి పితృపాదులైన అప్పన్ననాయుడుగారికి ఆంగ్ల భాష అంటే అభిమానం. అందుచేత, ధర్మారావుగారికి ఇంగ్లీషు చెప్పించి, పెద్ద ప్రభుత్వోద్యోగములో పెట్టాలని అభిలషించేవారు. కాబట్టి తాపీవారు తెలుగుచదివినా, కవిత్వం వ్రాసినా తండ్రిగారి ఆగ్రహానికి గురికావలసివచ్చేది.

తాపీవారు తలచుకొంటే వారి తండ్రిగారి పలుకుబడినిబట్టి, వారికి పెద్ద పదవి లభించి ఉండేది. కాని గవర్నమెంటు నౌకరీలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మృగ్యమని భావించిన ధర్మారావుగారికి, ఉపాధ్యాయ వృత్తి ఉత్తమమనిపించింది. బరంపురంలోని కళ్ళికోట రాజా కళాశాలలో గణితశాస్త్రాధ్యాపకులుగా చేరారు.

## తొలి వచన రచన

1911 వ సంవత్సరములో 'ఆంధ్రులకొక మనవి' అనే వ్యాసం ప్రకటించారు. అదే తాపీవారి తొలి వచన రచన. ధర్మారావుగారిపై ఆంగ్లభాషా ప్రభావం ప్రసరించక పోలేదు. ఆంగ్ల భాషలో ఎలిజీ (elegy) అనే సాహిత్య ప్రక్రియ ఉంది. దానిని తెలుగుభాషలో ప్రవేశపెట్టాలని తలంచారు తాపీవారు. అదే సమయంలో కాకతాళీయంగా ఒక చిన్న సంఘటన జరిగింది.

ఒకరోజు తాపీవారు ప్రక్కమీద పరుండి, తాపీగా పుస్తకం చదువుకొంటున్నారు. కొంత సేపటికి పొత్తికడుపు మీద ఏదో కుట్టినట్లనిపించింది. వెంటనే దాన్ని నలిపివేశారు. తీరాచూస్తే అది నల్లి. చేతివ్రేళ్ళు రక్తసిక్తమయ్యాయి. తాపీవారి హృదయంలో కారుణ్యం పెల్లుబికింది. అయ్యో! నల్లిని అన్యాయంగా చంపివేశానే అనే బాధ కలిగింది. వెంటనే 'నల్లిపై కారుణ్యము' అనే శీర్షికతో 'ఎలిజీ' వ్రాశారు. పరికించండి.

"నల్లిరో! నిన్ను జేకొని ఘనంబగు నాతపమందు వైచి, నీ వల్లల నాడు చుండ, దరహాసముచేయుచు జూచుచుండు నీ

కల్లరి వాని దూరవు; ముఖంబున గోపము జూప; వెంటయో
చల్లగ నోర్చి తౌర! ఘన సౌఖ్యము నాకము నందు గాంచవే"

## పత్రికల సంపాదకత్వం

1911వ సంవత్సరంలో కొందరి స్నేహితులతో కలసి 'వేగుచుక్క' గ్రంథమాలను స్థాపించారు. విజ్ఞాన దాయకమైన గ్రంథాలను ప్రచురించడమే ఈ సంస్థ లక్ష్యం. 'తెలుంగనెడుకాంత' పేరుతో ఆంధ్రవాఙ్మయ చరిత్రను, 'ఉషఃకాలము' 'క్రొవ్వరాళ్ళు' మొదలైన నవలలు వ్రాశారు. 'అన్నాకెరీనా' ను అనువదించారు.

తన తండ్రిగారు దివంగతులైనందున, తాపీవారు విశాఖ పట్టణం తిరిగి రావలసివచ్చింది. అప్పుడు 'కొండెగాడు' అనే పత్రికను స్థాపించారు. దానివెల మూడుపైసలు మాత్రమే. ఈ పత్రికద్వారా తాపీవారు అనేకమంది రచనలను విమర్శించారు. దానితో కలెక్టరు వెర్నాన్ దృష్టిలో పడ్డారు. న్యూ యింగ్‌టన్ కళాశాలలో ట్యూటర్ పదవికి తాపీవారి పేరు సిఫార్సు చేయబడింది. 1918వ సంవత్సరంనుండీ పదహారు సంవత్సరాలపాటు అనేకమంది సంస్థానాధీశులకు ట్యూటరుగా ఉన్నారు. విజయనగరంలో సంవత్సరంపాటు ట్యూటోరియల్ కాలేజీ నడిపారు. బొబ్బిలిదివాన్‌గిరి చేశారు. అప్పుడే జస్టిస్ పార్టీ పత్రిక 'సమదర్శిని' కి సంపాదకులయ్యారు. ఈ పత్రిక జస్టిస్‌పార్టీదైనా దానిద్వారా నాయుడుగారు జాతీయ భావాలు ప్రచారం చేశారు.

ఆ రోజుల్లోనే భాషా విషయంలోకూడా తాపీవారి భావాల్లో మార్పు కలిగింది. మార్పు మానవుని సహజగుణం. మొదట్లో తాపీవారు శుద్ధ గ్రాంథికవాది. గ్రాంథిక భాషావాదిగా గణుతికెక్కిన తాపీవారు, గిడుగు రామమూర్తిగారి వ్యావహారిక భాషావాదాన్ని ఎదుర్కొన్నారు. తదుపరి వ్యావహారిక భాషావాదిగా మారి, 'పాతపాళీ'ని విసర్జించి, 'కొత్తపాళీ' పేరుతో భాషావిషయిక వ్యాసాలు రచించారు.

1936వ సం. లో ఎన్నికలువచ్చాయి. పిఠాపురం రాజావారు తమపార్టీ ప్రాపకంకోసం ఆంగ్ల, తమిళ, తెలుగు భాషలలో పత్రికలు పెట్టారు. తెలుగుపత్రిక 'జనవాణి' కి తాపీవారు సంపాదకత్వం వహించారు. 1940వ సం. లో స్వతంత్రంగా 'కాగడా' పత్రికను వెలువరించి, కొన్నేళ్ళపాటు నడిపారు. ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామం జరుగుతున్న రోజులవి. మద్రాసుపై బాంబులు పడగానే, ఆ పత్రిక ఆపివేసి, అసిస్టెంటు రిక్రూటింగ్ ఆఫీసరుగా నియమితులయ్యారు.

## ఆంధ్ర విశారద బిరుదు

తాపీవారి సాహిత్యసేవ బహుముఖమైనది. 'పాతపాళీ' 'రాగిడబ్బా', 'ద్యోయానము', 'ఆంధ్రతేజము', 'మబ్బుతెరలు' మొదలైన ఖండకావ్యాలు, 'విలాసార్జునీయము' 'తప్తాశ్రుకణము', 'అవన్నీ నీ కళ్ళేనా?' మొదలైన నాటకాలు, 'కొత్తపాళీ' అలిండియా అడుక్కుతినే వాళ్ళ మహాసభ, 'సాహిత్య మొర్మరాలు,' మొదలైన వ్యాసాలు, 'దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు?', 'పెళ్ళి-దాని పుట్టుపూర్వోత్తరాలు' మొదలైన పరిశోధనా గ్రంథాలు, 'పారిజాతాపహరణ భావప్రకాశిక', 'విజయవిలాసము, హృదయోల్లాసము' వ్యాఖ్యలు రచించారు. వారి స్వీయచరిత్ర 'రాలు రప్పలు' అముద్రితంగానే మిగిలిపోయింది.

తాపీవారు ఆంధ్రభాషాభివృద్ధికి చేసిన అవిరళ కృషిని గుర్తించిన శృంగేరి పీఠాధిపతులు 'ఆంధ్ర విశారద' బిరుదముతో తాపీవారిని ఘనంగా సత్కరించారు.

## సినిమా రంగంలో

తాపీ వారికి 'సారంగధర' చిత్రంతో తొలి సారిగా సినిమాతో సంబంధం గలిగింది. తెలుగు సినిమా స్క్రిప్టుకు రూపకల్పన చేసిన వారిలో అగ్రగణ్యులు తాపీ ధర్మారావుగారు. సాంఘిక, పౌరాణిక, జానపద చిత్రాలెన్నింటికో సంభాషణలు వ్రాశారు. మాలపిల్ల' 'రైతుబిడ్డ' 'ఇల్లాలు' 'ద్రోహి' 'దీక్ష' పల్లెటూరి పిల్ల'' 'కీలుగుర్రం' 'మాయలమారి' మొదలైనవి రమారమి నలభై చిత్రాలకు స్క్రిప్టు వ్రాశారు.

## ఆంధ్ర వాల్మీకి

మద్రాసు నగరంలో ఒకసారి 'లవకుశ' చిత్రం ప్రివ్యూ ఇస్తున్నారు. హాలు కిక్కిరిసి రభస జరుగుతుందనే భయంతో నిర్మాతలు ఆహ్వాన పత్రిక చూపించిన వారినే లోనికి విడిచి పెట్టమని ఆదేశించారు. ఈ ప్రదర్శన వుందని తెలిసిన తాపీవారు, పుల్లయ్యగారికీ వారికీ గల ఆత్మీయతను పురస్కరించుకొని, హాలు వద్దకు వెళ్ళారు.

'ఇన్విటేషన్ కార్డులేనిదే హాలులోకి ప్రవేశం లేదు'' అన్నాడు ద్వారపాలకుడు.

వెంటనే నాయుడుగారు ''నాకు కూడా కార్డు ఎందుకయ్యా నాయనా! నే నింతకు ఎవరిననుకుంటున్నావ్? ''అని ఆప్యాయంగా అడిగారు.

''ఎవరైనా సరేసార్ ఆహ్వాన పత్రిక లేనిదే ప్రవేశంలేదు'' అన్నాడు గేటు కీపరు.

తాపీవారు ''జాగ్రత్త సుమా! ఈ లవకుశ వ్రాసింది ఎవ్వరనుకున్నావ్? మహాకవి వాల్మీకిని, నాకే ప్రవేశం లేదంటావా?'' అని గర్జించారు గడ్డంనిమురుతూ.

దాంతో ఆ ద్వారపాలకుడు కంగారుతో ''క్షమించాలిసార్, మీరా! అలా వెళ్ళి బాల్కనీలో కూర్చోండి'' అంటూ స్వాగతం పలికాడు.

నిజంగా తాపీ వారి నెరిసిపోయిన గడ్డం, జుల పాలూచూస్తే ఎవరైనా ఆయనను వాల్మీకి మహర్షి అనుకొంటారు. అధునికాంధ్ర సాహితీరంగంలో ఆయనకు ఆ గౌరవం వుంది కదామరి.

(మిగతా 38 వ పేజీలో)

# సంవత్సరానికి మూడు పంటలు: నా అనుభవాలు

శ్రీ తక్కెలపాటి సుబ్రమణి

నాకు 5 ఎకరముల పొలము గలదు. మంచి నీటి వసతి గలదు. సంవత్సరమునకు మూడు పంటలు పండించుచున్నాను. 1971-72 వ సంవత్సరమున్న కూడ, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వ విద్యాలయం, తిరుపతి వారి ఆధ్వర్యమున 12 మాసములలో మూడు పంటలు వేసి మంచి లాభమును పొందినాను. ఈ మూడు పంటలు పండించుటలో నేను మొదటిరైతుగా రాష్ట్ర ప్రభుత్వంచే ఎన్నుకోబడ్డాను.

మూడు పంటలు ఈ క్రింది విధముగా పైరు చేశాను.

1. మొదటి పంట :— ఐ. ఆర్. 20 వరి.

(ఒక ఎకరమునకు)

కాలము 1-4-71 నుంచి 15-8-71 = $4\frac{1}{2}$ మాసములు నారు మడి ప్రత్యేకముగా పెంచాను. పెరామార్ మందు నారు పోసిన 15 వరోజున 25 వ రోజున, చల్లాను. నారు 30 రోజులకు తీశాను.

పొలము బాగా తయారు చేశాను. కడపటి దుక్కిలో 125 కిలోల అమోనియం ఫాస్ఫేట్ (20కి 20), పొటాష్ 30 కిలోలు జింక్ సల్ఫేట్ 15 కిలోలు వేసి రెండు సార్లు దున్ని నారు దగ్గరగా ( 4" నుంచి 6" దూరంలో ) చిక్కగా నాటాను. నీరు సక్రమముగా సరఫరా చేయడం జరిగింది.

| | | | | |
|---|---|---|---|---|
| నారు నాటిన | 25 వ రోజున | యూరియా | 35 | కిలోలు |
| | + | పొటాష్ | 10 | ,, |
| ,, | 40 వ రోజున్న | యూరియా | 15 | ,, |
| ,, | 60 ,, | సల్ఫేట్ | 50 | ,, |

చొప్పున ఎరువులు వేశాను.

క్రిమి కీటక సంహరణ కొరకు

| | | | |
|---|---|---|---|
| నాటిన | 15 వ రోజున | పెరామార్ | 250 మి.లీ. |
| ,, | 30 ,, | బి. హెచ్. సి. | 10 ,, |
| ,, | 50 ,, | పెరామార్ | 300 ,, |

చొప్పున పంటకు చికిత్స చేయడం జరిగింది. పంట 135 రోజులకు కోతకు వచ్చింది. నూర్చాను. 2625 కిలోలు దిగుబడి దిగింది. ( 35 బస్తాలు 75 కిలోలది ). ధాన్యం ద్వారా రూ. 2100 లు గడ్డి ద్వారా రూ. 100 లు రాబడి వచ్చింది. ఖర్చులు రూ. 800 లు అయింది. నికరాదాయం ఎకరాకు రూ. 1400 లు వచ్చింది.

ii. రెండవ పంట- మనిలా వరి రకము.

కాలము 16-8-71 నుండి 31-12-71 = $4\frac{1}{2}$ మాసము. సేద్యముపై పంటకు చేసిన విధంగానే చేయడం జరిగింది. కానీ ఎకరాకు 140 కిలోలు వేరుశెనగ పిండి, 10 బండ్ల పశువుల ఎరువు అదనంగా వేశాను. ఎకరాకు ధాన్యం దిగుబడి 2250 కిలోలు దిగింది. ( 30 బస్తాలు 75 కిలోలది.) ధాన్యం, గడ్డితో సహా ఆదాయం రూ. 2000/లు. ఖర్చులు రూ. 1000/ నికరాదాయం రూ. 1000 లు వచ్చింది.

iii. మూడవ పంట—హైబ్రీడ్ సజ్జ

కాలము 1-1-72 నుండి 5-4-72 = 3 మాసములు. మంచి దుక్కిగా తయారు అయిన తర్వాత కడపటి దుక్కిలో ఈ క్రింది ఎరువులు వేసి రెండు సార్లు కలియదున్నాను.

(i) 20:20 అమోనియం ఫాస్ఫేట్ 150 కిలోలు

(ii) పొటాష్ 40 కిలోలు

వరుసకు వరుసకు ఉంచిన దూరం 16"

మొక్కకు మొక్కకు ఉంచిన దూరం 6"

15 రోజుల నారు నాటాను. నీరు సక్రమంగా కట్టాను. రెండు సార్లు కలుపులు తీశాను. 30 వ రోజున పాళ్ళలో ఒక బస్తా యూరియా వేసి బోదెలు తయారుచేసి, నీరు పెట్టాను. తర్వాత 20 రోజులకు సల్ఫేట్ 25 కిలోలు పాళ్ళ వెంబడి వేశాను. బాగా పండింది.

ధాన్యం ఎకరాకు 2000 కిలోలు చొప్పున దిగింది.

ఖర్చులతో ఆదాయం ఎకరాకు రూ. 600 లు.

నికరాదాయం ఎకరాకు రూ. 700 లు

మొత్తంపైన మూడు పంటల మీద ఎకరాకు ఖర్చులుపోను రూ.2100/లు నికరాదాయం వచ్చింది. ఖర్చుల క్రింద (1) భూమిపన్ను (2) పంటకు పెట్టుబడి మీద వడ్డీ (3) నీటి ఖర్చు (4) వ్యవసాయము పర్యవేక్షణ చేసిన వారికి జీతం, చేర్చలేదు. ఇవన్నీ అందరి రైతులకు వుండేవే. సోదర రైతులు పై విధంగా ఒక యేడాదికి 3 పంటలువేసి ( నీటి వసతియున్న ) అధిక దిగుబడి పొందాలని మనవి చేయుచున్నాను.





ఫోటో. శ్రీ ఎస్ మానిక్‌రావు

# గోల్కొండ కోట

శ్రీ కె. వి. హనుమంత రావు

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన 'కోహినూరు' వజ్రపు ధగద్ధగలతో వెల్లివిరిసిన కోట గోల్కొండకోట. నెమలి సింహాసనపు వైభవమునకు మూలకారణమగు కోహినూరు వజ్రము షాజహాను కాలమునందు ప్రపంచ ప్రసిద్ధిగాంచి యుండుట తెలిసిన విషయమే.

రత్న రాసులతో, అష్టైశ్వర్యములతో తేలియాడెడి ఈ గోల్కొండలో ఒకప్పుడు బజారులలో వజ్రములను రాసులుగాపోసి అమ్ముటయేగాక, వజ్రములను పెట్టడం కూడ జరుగుతుండెడిది. కాబట్టి విదేశీవ్యాపారమునకు కూడలిగా వెలుగొందినదని చరిత్రాధారము.

ఈ కోట రాజధానీ నగరమయిన హైదరాబాదులో అనేక శతాబ్దములుగా వాస్తునైపుణ్యమునకు ప్రతీకగా ప్రాతినిధ్యం వహించెడి చారిత్రాత్మక చిహ్నమయిన 'చార్‌మినార్'కు అయిదు మైళ్ల దూరములో ఒక ఎత్తయిన కొండమీద నిర్మింపబడివుంది.

కుతుబ్‌షాహి రాజులు ఈ కోటను 1518 నుండి 1687 వరకు పరిపాలించియుండిరి.

ఈ కోటను కులీషా సుల్తాను కట్టించెను. కులీషా ఇరాన్ దేశస్థుడు ఈతని అసలుపేరు కుతూబ్-ఉల్-ముల్క్. ఈతని వంశములో ఈతడే మొదటిరాజగుటచే ఈ వంశమునకు కుతూబ్‌షాహి అని పేరు వచ్చుటయేగాక, ప్రతి సుల్తాన్ నూ కుతుబ్‌షాహి అని కూడ అనుట జరుగుచున్నది.

ఆ లెక్కను కుతూబ్‌షాహి వంశమునకు మొదటివాడైన సుల్తాన్ కులీ కుతూబ్‌షాహి 1518 నుండి 1543 వరకు, జమ్‌షిద్ కులీ కుతూబ్‌షాహి 1543 నుండి 1550 వరకు, ఇబ్రహీం కులీ కుతూబ్‌షాహి 1550 నుండి 1580 వరకు, మహమ్మద్ కులీ కుతూబ్‌షాహి 1580 నుండి 1611 వరకు సుల్తాన్ మహమ్మద్ కులీకుతూబ్‌షాహి 1611 నుండి 1626 వరకు, సుల్తాన్ అబ్దుల్లా కులీకుతూబ్‌షాహి 1626 నుండి 1672 వరకు, కుతూబ్‌షాహి వంశంలో ఆఖరువాడైన సుల్తాన్ అబ్దుల్ హసన్ 'తానీషా' 1672 నుండి 1687 వరకు ఈ కోటను పరిపాలించియుండిరి.

ఈ కోట జన్మ వృత్తాంతము గూర్చిన ప్రాంతీయ గాథ అత్యంత కుతూహల దాయకమై యున్నది. కులీషా పరిపాలించు కాలమునందు అతనికి దక్షిణదేశమునన్నియు జయించవలెనని ప్రబలమైన కోరిక కలుగగా, అందు నిమిత్తమై దృఢమైన కోటను నిర్మింపజేయాలనుకొనెను అనువైన ప్రదేశమునకై గాలించుచుండగా, ఒకనాడు ఒక పశులకాపరి సుల్తాన్‌కు ఒక ఎత్తయిన కొండను చూపించి అచ్చటనే కోటను కట్టించుమని సలహాఇచ్చి, కొన్ని నిదర్శనములను కూడా చూపించినాడట.

సుల్తాన్ తను తలంచినది సాధించుటకై అటువంటి కొండపై కోటను నిర్మింపజేయటమే అనువని తలంచి, ఆ విధముగానే నిర్మింపజేసెను. పశులకాపరిచూపించిన కొండ మీద కట్టించిన కారణముగా ఈ కోట 'గొల్ల-కొండ' అని పిలువబడి, చివరికి వాడుకలో గోల్కొండగా మారినది.

కానీ, 'మోతీహైర్ ఆలిమ్‌గిరి' ప్రకారముగా ఈ కోటను గూర్చి మరొక రకమైన వృత్తాంతము తెలియుచున్నది. ఈ కోట మొదట 'మాంకాలి' అని పిలువబడుతుండెదిదట. అందుకు నిదర్శనముగా ఇప్పటికినీ ఈ కోటపై 'మహాకాలి' దేవాలయము కలదు. ప్రతి 'బోనాల' పండుగకు చుట్టు ప్రాంతముల నుండి బోనాలు తేబడి మహా వేడుకగా జాతర జరుగుచుండును.

ఓరుగల్లు రాజైన దేవరాజు ఈ కోటను ప్రప్రథమమున మట్టి గోడలతో నిర్మింపజేసియున్నాడు కాని పరిస్థితుల ప్రభావమున ఈ కోట బహమనీ రాజుల హస్తగతమయినది. 1518లో బహమనీ రాజుల కోటలలో ఈ కోట ప్రధానమైనదిగా నిలచియున్నది.

అదే కాలమున బహమనీరాజైన సుల్తాన్ మహమ్మద్‌షా బహమనీ మరణానంతరము అప్పటి తెలంగాణా ప్రాంతపు గవర్నరయిన కులీకుతూబ్‌షా స్వాతంత్ర్యం ప్రకటించుకొని ఈ కోటను ముఖ్యపట్టణముగా చేసుకొని పరిపాలించసాగినాడు.

కులీషా కోట ప్రాకారములతోబాటు జుమ్మా మస్జిద్ మరియు రాజ ప్రాసాదం కట్టించిన పిదప ఈ కోట 'మహమ్మద్ నగరం'గా పిలువబడింది.

ఏది ఏమైనప్పటికినీ ఈ కోటను దుర్భేద్యం చేయవలెననెడి తలంపుతో కులీషా కొన్ని లక్షలు ఖర్చుచేసియున్నాడు కోట

గోడలు దృఢమైన గట్టి రాళ్లతో సున్నం ఉపయోగించి కట్టబడినవి. ఒక టన్ను బరువుగల రాళ్లుకూడ ఈ కోట నిర్మాణమునకు ఉపయోగపడినవని తెలిసినపుడు కులీషా పట్టుదల, సామర్థ్యం తన ధ్యేయ సాధనకై చేసియున్నకృషి తేటతెల్లమగును. నాలుగు వందల ఎత్తునగల ఈ కోట 87 పెద్దవైన అర్ధ చంద్రాకారపు బురుజులతో పరివేష్టితమై యున్నది.

ఎత్తయిన బురుజులపై ఫిరంగులుకూడ అమర్చబడినవి. కోటకు పడమరగా అమర్చబడిన ఆధునికమైన ఫిరంగి ముప్పై అడుగులకు పైగా పొడవును కలిగియున్నది. ఏనుగులకు సైతము దుర్భేద్యమై, లోహపు రేకులతో కప్పబడిన ధారీ కవాటములు అమర్చబడినవి. ఇనుపమొనలతో అందమునకు అందం, రక్షణకు రక్షణపొందియున్న, పెద్దవైన ఫతేదర్వాజ, బాంబేదర్వాజ, పఠాన్ కోట దర్వాజ, బహమనీ దర్వాజ, జమేయి దర్వాజ, మోతీ దర్వాజ, మక్కా దర్వాజ మరియు కొత్తకోటదర్వాజ అనబడు ఎనిమిది ద్వారములు ఈ కోటకు కలవు.

ప్రస్తుతము ఫతే దర్వాజ, బాంబేదర్వాజ, బహమనీ దర్వాజ మరియు మోతీ దర్వాజాలు మాత్రమే కోటను దర్శించుటకై తెరువబడి యున్నవి.

50 అడుగుల వెడల్పు గల కందకము కోట వెలుపలి భాగమున కలదు. కోట లోపలి భాగమున రాజ ప్రాసాదములు, మసీదులు ఆనాటి బురుజులు, మాదన్నగుడి మొదలగునవి నేటికనీ శిదిలావస్థలో కానవగును.

సాగుచేయబడిన భూములు, చెఱువులు కూడ కోట అంతర్భాగమున కానవగును. యుద్ధ సమయమునగానీ, మరియే ఇతర అసౌకర్యముల వల్లగానీ కోటలోపలి వారికి బయటి నుండి సంబంధములు తెగి పోయినచో ఇట్టవి వారికెంతో ఉపకరించెడివి.

కోట యొక్క ఉత్తరభాగపు వెలుపలి ప్రాకారములు షోలాపూరికు వెళ్లే రోడ్డుకు పావు మైలు దూరమున కలదు.

మహమ్మద్ ఆజమ్ నాయకత్వమున దక్కనీపై దాడి నడిచినపుడు ఈ కోటకు ఉత్తర దిక్కున 'మూసాబుర్' అనబడు బురుజు అత్యంత నిపుణతలతో శత్రువుల నుండి కోటను అజేయం చేయాలనెడి దృక్పథంతో కట్టబడింది.

శత్రువుల పాలిట 'యమపురి' యా అన్నట్లు కోట దుర్భేద్యముగానేకాక అత్యంత చతురతతో నిర్మించబడినది ముఖ్యద్వారం వద్ద ఏ శబ్దం చేసినసూ ఎంతోలోపలగల రంగమహల్ లోకి ఆ శబ్దం వినిపించేట్లుగా ఏర్పాటు గావించబడినది.

ఎల్లప్పుడూ నృత్యగాన విలాసములలో తేలియాడెడి సుల్తానులకు కోటపై శత్రు రాజులు ఆకస్మికముగా దండెత్తి వచ్చినను తెలియ బడేందులకై ఈ ఏర్పాటు చేయబడినది

కోటకు వాయవ్య భాగమున మైలు దూరములో విశాలమైన పెద్ద ముంగిలిలో ఇబ్రహీం కుతుబ్‌షాహి యొక్క హిందురాణులైన భాగమతి, తారామతుల అందమైన రెండు పెద్ద సమాధులు నిర్మింప బడియున్నవి.

కులీకుతూబ్ షాహి వంశమున చివరివాడైన అబ్దుల్ హసన్ గొప్ప రసికుడు, విలాస ప్రియుడు, చిత్తానుసారము ప్రవర్తించే గర్విష్టి కావుననే అతనిని తానీషా అంగా 'నియంత' అన్నారు

అతని పరిపాలనా కాలమున భాగమతి, తారామతుల సమాధులున్న ముంగిలి నుండి రాజదర్బారు వరకు తీగలతో బంధించి వేశారు. ఆ భవనాలలో జరిగే నృత్య సంగీత మధుర తరంగాలు ఆ తీగల ద్వారా దర్బారు లోనికి ప్రవేశించి వీనుల విందు చేసెడివాడట.

తానీషా, రామదాసుగా ప్రఖ్యాతి గాంచిన గోపన్నల గాథ ఆంధ్రులకు సుపరిచితమే. ఇదే కోటలో రాజద్రవ్యమును అపహరించెనన్న నేరముపై చీకటి గదిలో చిన్నరంధ్రం గుండా వచ్చే వెలుగును చూస్తూ పన్నెండు సంవత్సరములు గోపన్న ఖైదీగా మ్రగ్గినాడు. దారుణమగు రామదాసు గాథ నేడీ కోట శిదిలావస్థలో గూడ మనకు కన్నీటితో వినిపిస్తున్నట్లనిపిస్తుంది

కుతుబ్‌షాహి రాజుల సమాధులు కోటకు ఆగ్నేయ దిశన గల మైదానములో ఆకర్షణీయముగా నిర్మింపబడినవి

వైభవోపేతమైన ఈ కోట మొగల్ పాదుషాల ముట్టడి నుండి మాత్రం తప్పుకోలేక పోయింది ఈ కోటను కొల్లగొట్టటానికి భయంకరమైన ఎన్నో దండయాత్రలు జరిగినవి 1596లో అక్బరు పాదుషా ఈ కోటను వశపరుచుకోవడానికి ఎన్నో విఫల ప్రయత్నములు చేసియున్నాడు. కానీ ఆ కోరికలోనే చివరకు పరలోకగతుడయ్యాడు. అయినా ఢిల్లీ పాదుషాలకు గొల్కొండ సుల్తాన్‌లకు మధ్య గల వైరుధ్యం అంతరించలేదు 1636లో గోల్కొండ సుల్తానులు షాజహానుచక్రవర్తికి లొంగి పోయి నష్టపరిహారాన్నెంతో మొగలులకు చెల్లించినా తమ సైనిక శక్తిని పెంచుకొంటూనే వచ్చారు.

1687లో ఔరంగజేబు ఎనిమిది నెలల పాటు నిర్విరామంగా గోల్కొండతో యుద్ధం చేసియున్నాడు అప్పటి గోల్కొండ సుల్తాను అబ్దుల్ హసన్ తానీషా కోటను రక్షించుకోవడానికి చేయగలిగినదంతా చేసాడు. దుర్భేద్యమైన కోట గోడలు, బురుజుల మీద వున్న ఫిరంగులు ఎప్పటి కప్పుడు శత్రువులను చీల్చి చెండాడేవి. కాని నమ్మక ద్రోహియైన అబ్దుల్ ఖాన్ పన్ని అనబడు ఒక సర్దారు కోటకు తూర్పున గల ప్రధాన ద్వారం తెరువగా మొగలులు లోనికి ప్రవేశించి కోటను ఆక్రమించు కొన్నారు ఏ ద్వారము నుండైతే మొగలు సైన్యము కోటలోకి ప్రవేశించి కోటను ఆక్రమించుకొన్నదో ఆ ద్వారము తన విజయమునకు కారణంగా ఔరంగజేబు దానిని 'విజయద్వారం' (ఫతేదర్వాజ) అని నామకరణం చేసియున్నాడు.

కోటలోపలి భాగమున రాజ ప్రాసాదములు, మసీదులు, మాదన్న గుడి, ఆ నాటి బురుజులు, ఔరంగజేబు నాశనం చేసిన ఆ నాటి ఫిరంగుల అవశేషాలు శిధిలావస్థలో నేటికీ కానవస్తాయి.

గోల్కొండ ఒకనాటి సకల సంపదలతో తులతూగిన రంగుల మేడ. నేటికీ చారిత్రాత్మకముగా మిగిలిన ఒక వలిగిననీడ.

# ఉత్తర కాకతీయ యుగ చరిత్రము

శ్రీ ఆదిరాజు వీరభద్రరావు

ఓరుగల్లు అను ఏకశిలానగరము రాజధానిగా కాకతీయ రాజులు కల్యాణి పశ్చిమ చాళుక్యులకు సామంతులుగా తమ రాజకీయ జీవితమును ప్రారంభించిరి. అనుమకొండ ప్రాంతమును కల్యాణి త్రైలోక్యమల్ల భూపాలుని యనుగ్రహమును పొంది సంపాదించుకొనిరి.

కల్యాణి చాళుక్యుల బలము క్షీణిస్తూవున్న సమయమున కాకతీయరాజులు సర్వస్వతంత్ర రాజ్యముగా ప్రకటించి పాలింపసాగిరి. కాకతీయులు అట్లు తమ రాజ్యమును బలపరుచుకొని, తమ పలుకుబడిని విస్తరింపచేయజూచుకొనుచుండిన సమయమున తెలుగుదేశమును రాజకీయముగా పెక్కుమంది రాజులు పరిపాలించుచుండిరి. సాగరతీర ప్రాంతమంతయు వీరి అధీనముననుండెను.

వీరు కాంచీ చాళుక్యచోళుల సామంతులయినను స్వతంత్ర రాజ్యములుగానే వ్యవహరించుచుండిరి. కాకతీయ రెండవ ప్రోలరాజు, ఈతని కుమారుడు రుద్రదేవుడు పరిపాలించుచున్న కాలములలో చాళుక్యచోళులు ఇతర కార్యనిమగ్నులై యున్నందున సాగర ప్రాంతాధిపతులపై వారి యాజమాన్యము నామమాత్రముగా ఉండెను.

స్థానికులైన ఈ రాజన్యులు ఒండొరులతో యుద్ధములు చేయుచు, తమతమ రాజ్యముల విస్తరణకు కడంగుచుండిరి. ఈ క్లిష్టపరిస్థితులను అవకాశముగాగొని కాకతీయరాజన్యులు సాగర తీరప్రాంతముపై తమ దృష్టిని సడలించి తమ అధికారమును తూర్పు భాగమున సముద్రము వరకు విస్తరిల్లునట్లు ప్రయత్నించిరి. ఈ ప్రయత్నములన్నియు కాకతీయ గణపతిదేవుని కాలములో జయప్రదములయ్యెను.

గణపతిదేవుడు ఉత్తరముననున్న కళింగము వరకును, తూర్పున బంగాళాఖాతమువరకును, దక్షిణమున కాంచీపురము వరకును దండయాత్రలు సాగించి రాజులనందరను లోబరచుకొనెను. ఈ విధముగా గణపతిదేవుడు ఆంధ్రదేశమునంతను ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందికి తేగలిగెను.

## నూతన భావోద్రేకం

పండ్రెండవ శతాబ్దపు అపరభాగమునందు ఆంధ్రదేశములో నూతన భావోద్రేకము మొలకెత్తెను. ఈ సమయముననే "ఆంధ్ర" శబ్దము బహుళ ప్రచారమునకు రాజొచ్చెను. తెలుగు మాటాడు జనులుండు దేశమును ఆంధ్రదేశముగా వ్యవహ... ఇంతకు ముందు ఈ ప్రాంతం వేగినాడు పలనాడు, పాకనాడు—ఇత్యాది వివిధ నామములతో విభజనవై యుండెను. ఏ ప్రాంతము అయితేనేమి అంతయు ఆంధ్రదేశ... యను భావము ఏర్పడెను. మొట్టమొదటిసారిగా ఆంధ్రులలో జాగృతి కలిగెను.

గణపతిదేవుని సమకాలికుడగు మహాకవి తిక్కన్న సోమయాజి కూడ ఆంధ్రభావమునకు వశుడయ్యెను. సంస్కృతము నుండి తాను తెనుగించుచున్న మహాభారతమును 'ఆంధ్రావళి మోదముం బొరయు' నట్టుగా పద్యములు గద్యములు రచించుచున్నానని విరాటపర్వ ప్రారంభములో నుడివియున్నాడు. విద్యానాథ మహాకవియు ప్రతాపరుద్ర యశోభూషణమునందు ఆంధ్రభావావేశమునే ప్రకటించినాడు. విద్యానాథుడు ప్రతాపరుద్రుని ఆంధ్ర క్షమాధీశ్వర, త్రిలింగదేశ పరమేశ్వర మొదలగు విశేషణములతో వర్ణించినాడు. కాకతీయుల ప్రారంభకాలమునుండియే యీ ఆంధ్రులు నూతన భావ సమన్వితులయిరి. దేశము ఆంధ్రదేశము, రాజు ఆంధ్రరాజు, జాతి ఆంధ్రజాతి, ప్రజలు ఆంధ్రులు, భాష ఆంధ్రభాష అను భావము ప్రబలినట్లు స్పష్టమగుచున్నది. గణపతిదేవుని విజయ పరంపరకు ఈ నూత్నభావమే ముఖ్యముగా తోడ్పడియుండును.

గణపతిదేవునికాలము మొదలుకొని చివరి రాజగు ప్రతాపరుద్రుని వరకు నూరు సంవత్సరముల పైకాలము ఒక్క కళింగము

తప్ప మిగతా ఆంధ్రదేశమంతయు కాకతీయులు తమ పరిపాలన క్రిందికి తీసికొనివచ్చి, అద్వితీయ విధముగా నిలుపుకొనగలిగిరి.

## ముస్లిముల దృష్టి

దక్షిణాపథమునవున్న ఈ స్వతంత్ర ఆంధ్రరాజ్యముపై పదమూడవశతాబ్దము అంత్యభాగమున ముస్లింలు తమ దృష్టిని కేంద్రీకరింపసాగిరి. ముస్లిం చరిత్రకారుల వ్రాతలనుబట్టి తెలంగాణముమీద అయిదు దాడులు జరిగినట్లు తెలియుచున్నది. ఢిల్లీలో అల్లాఉద్దీన్ ఖిల్జీ రాజ్యము చేయుచున్నకాలములో క్రీస్తు శకము 1302లో మొట్టమొదటిసారిగా ముస్లింలు తెలంగాణముపై దాడి సలిపినారు.

ముసల్మానులు ఓరుగల్లుపై ఐదుదాడులు సలిపినారనుట సరిగాదు. అనంతరకాలములో దొరికిన తామ్రశాసనాదులను బట్టి చూచినచో ఢిల్లీ చక్రవర్తులు ఎనిమిదిసార్లు, దాడులు సలిపినట్లు స్పష్టమగుచున్నది. ప్రతాపరుద్రదేవ మహారాజు యేడుసారులు మహమ్మదీయ సైన్యములను తరిమికొట్టి, ఢిల్లీచక్రవర్తి ఆశలు భగ్నము గావించినట్లు తెలుచున్నది.

ప్రతాపరుద్రునియొద్ద తొమ్మిదిలక్షల ధానుష్కసైన్యముండెనట. లయకాలరుద్రునివలె విరోధి ఖండమును ప్రతాపరుద్రుడు నాశనముచేసినాడట. ప్రతాపరుద్రుడు పరాక్రమవంతుడయ్యును, యుద్ధతంత్ర పారంగతుడయ్యును, విధివశమున ఎనిమిదవ యుద్ధమునందు పరాజితుడయి తురుష్కరాజుచే బంధితుడయ్యెను. కాకతీయ చక్రవర్తి బందీగా ఢిల్లీకి గొంపోబడుచుండగా సోమోద్భవమను నర్మదానదీతీరమున స్వర్గస్థుడయ్యెను. (విలస శాసనము.)

## ముస్లిముల దండయాత్రలకు ప్రతిఘటన

ముస్లిం దండయాత్రలను తిరుగగొట్టుటలో అన్నమంత్రి, అన్నశౌరి, కొలని రుద్రదేవుడు, ఏచనాయకుడు, సారంగపాణి దేవుడు, మొదలగు ఆంధ్రవీరసేనానులు అవక్రపరాక్రమము జూపినట్లు ఆంధ్ర కావ్య ప్రపంచమునందు దృష్టాంతములు గలవు.

అన్నయమంత్రి ''యవన సంహారవిలయకాలాగ్ని'' యనగ వినుతి కెక్కినట్టివాడు. సారంగపాణిదేవుడు ''తురుష్కోపప్లవ మేదినీ సముద్ధరణ మహావరాహ'' అని శాసనమునందు కీర్తింపబడినాడు.

1323లో ఏడవది, ఎనిమిదవది అగు దండయాత్ర జరిగినది. ఓరుగంటి పురవరమునకు కాలము మూడినదీసంవత్సరముననే. ముసల్మానులు అపారసేనాసముద్రముతో, ప్రబలసన్నాహముతో ఓరుగల్లును ముట్టడించిరి. పదేపదిగా జరిగిన గత ఏడు యుద్ధముల మూలమున రాజ్యమున కెంతో కష్టము కలిగెను.

హిందువులు భయవిహ్వల చిత్తులయిరి. ముసల్మానుల విజయమునకు దారి యేర్పడెను. తెలంగాణము ఢిల్లీరాజ్యములో కలిసిపోయెను. వైభవదినములలో ఆంధ్రనగరమని ఖ్యాతి వహించిన వరంగల్లు సుల్తానుపూరు అను నూతన నామమును ధరించెను. ఆంధ్రదేశమంతయు ముసల్మానురాజుల పాలనలోకి వచ్చెను.

ముసల్మానుల కాలములో హిందువుల అగచాట్లు దుర్భరమయ్యెను. తెలంగాణాస్థితిని ప్రోలయనాయకుని విలస శాసనము ఇట్లు వర్ణించుచున్నది.

ప్రోలయ విలాసగ్రామమునకు ప్రోలపురము అను పేరుపెట్టి బ్రాహ్మణులకు అగ్రహారముగా నొసగెను.

''భాగ్యవంతులు ధనముకొరకు నూరారు విధముల చిత్రవధ గావింపబడిరి. 1328–1332 మధ్య ముసల్మానులను జూడగనేవారు ప్రాణములను విడిచిరి. బ్రాహ్మణులు తమ నిత్య కర్మానుష్ఠానములను నెరవేర్చకుండ నిరోధింపబడిరి. దేవాలయములు నేలమట్టము జేయబడినవి. దేవతావిగ్రహములు అపవిత్రము చేయబడి పగులగొట్టబడెను. విద్వాంసుల కనుగ్రహింపబడిన అగ్రహారములు లాగుకొనబడెను. వ్యవసాయఫలములను అనుభవించుటకు వీలులేకుండ పంటలు స్వాధీనము జేసికొనుటతో రైతులు, భూస్వాములు సర్వనాశనము చెందిరి. ఈ విపద్దశయందు ప్రజలు తమ బిడ్డలను, గొడ్డుగోదలు మొదలగు ప్రావచిక సంపదను తమవని చెప్పుకొనుటకు వీలులేకపోయెను. ముష్కర తురుష్కులు త్రప్పత్రాగుచు గోమాంసభక్షణముచేయుచు, కామక్రీడాపరాయణులగుచు, బ్రాహ్మణులను చంపుచు విచ్చలవిడిగా చరించసాగిరి. ఇట్టి సందర్భములో ప్రాణికోటి బ్రతుకుట యెట్లు తటస్థించును? దేశస్థితి యిలావుండగా సంరక్షకుడొకడు దొరకునను భావనకుగూడ ఆస్కారము లేకుండెను. ముసల్మానులు చెలరేగి త్రిలింగదేశమును అవస్థలపాలు గావించిరి. ఈ యవనవీరులు ప్రత్యక్షరాక్షసులై త్రిలింగదేశము దావాగ్నిచే చుట్టుకొనబడిన అరణ్యము వలె నుండెను.

ప్రతాపరుద్రదేవుని సేనానులు, మంత్రులు, ఉన్నతాధికారులు యుద్ధరంగమున మడిసియుండుటయో యుద్ధఖైదీలుగా పట్టుబడియుండుటయో సంభవించెను. ఈ మహాప్రళయమునందు అసువులు గోల్పోవక ముగ్గురువీరులు మాత్రమే ప్రాణములతో నుండగలిగిరి. అమ్మనమంత్రి, కొలని రుద్రదేవుడు, రేచెర్ల సింగమనాయక అను నీమూర్తిత్రయము ప్రతాపరుద్రుని విశ్వాసమునకు పాత్రులై ప్రసిద్ధులైనవారు.

అమ్మనమంత్రి ప్రతాపరుద్రుని గజసాహిణి (గజసైన్యమున కధిపతి). ఇతడు యవన సంహార విలయకాలాగ్ని యనగ వినుతి కెక్కినవాడు, (భీమేశ్వర పురాణము) కొలని ప్రతాపరుద్రుడు మహావీర శిఖామణి. ఈతని పూర్వులు వంశ పరంపరగా కాకతీయ రాజుల కాలములో మంత్రులుగను సేనాపతులగను నుండిరి. వీరు గణపతిదేవుని జైత్రయాత్ర అందుండి ప్రభువునకు జయము చేకూర్చినవారు. వీరి ఇంటిపేరు మొదట ఇందులూరి వారు. అయితే ఇందులూరి వంశములోని సోమమంత్రి కాకతీయ గణపతిదేవుని మంత్రిగా నుండి కొలనువీడు లేక సరసీపుర మండలమును జయించి తూర్పు ప్రాంతములపై ప్రభుత్వము నెరపుచున్నందున

అతని వంశీయులకు ఇందులూరి గృహనామము మారి కొలనివారను పేరేర్పడెను. ఆ సోమమంత్రి మనుమడే యీ కొలని రుద్రదేవుడు. కొలని రుద్రదేవుడు ప్రతాపరుద్రుని రాజ్యములోని 72 దుర్గములకు అధిపతియైయుండెను ఇతడు చోళ, పాండ్యరాజ్యములపై సలిపిన దండయాత్రలలో పాల్గొని జయలక్ష్మిని వరించినవాడు. చేబ్రోలు, పద్మినీ పురము, దేవపురము, ఎనమదల, పొదిలి, పోలచెర్ల, ఆదూరు నూజిల్ల, సురవరము, రాజమహేంద్రవరము, సామర్లకోట, పిఠాపురం, బోడసకుర్రు, బెండపూడి మొదలగు దుర్గములు కొలని రుద్రదేవుని యధీనములో నుండెను. యవనుల దాడినుండి వరంగల్ కోటను కాపాడిన వాడితడే.

సింగమ నాయకుడు రేచెర్ల వంశీయుడు. ఇతని పూర్వులను కాకతీయుల కొలువులో నుండి శౌర్య పరాక్రమములు చూపిన వారే. ఇతని తండ్రి ఎరదాచానాయుడు పాండ్య రాజులను జయించుటచే "పంచపాండ్య విధాః" అను బిరుదు నొందెను. తండ్రితో వెళ్ళి సింగమ నాయకుడును యుద్ధములందు పరివిహారము గావించి యుండెను.

ఈ ముగ్గురు వీరాగ్రేసరులే మిగిలియుండిరి కొత్త నాయకులు బయలుదేరవలసిన సమయము వచ్చెను. హిందూ ధర్మము నన్ను కాపాడు వారెవరాయని ఎదురు చూచుచుండెను. అంతయు అంధకార బంధురముగా ఉండెను. దారి తెన్నులు తోచకుండెను.

కొలని రుద్రదేవుడు ఘన మహోద్యోగి అయిన అన్నమంత్రితో సమాలోచన చేసెను. ప్రాచీన మహాసామంత రాజుల వంశజులను, మాండలిక ప్రభువంశజులను వీరిద్దరు సమావేశ పరచిరి. ఈ సామంత ప్రభువులలో ముఖ్యంగా పేర్కొనదగినవారు ముసునూరి ప్రోలయ్య నాయకుడు, కొప్పుల ప్రోలయ్యనాయకుడు, అద్దంకి రెడ్డిప్రభువు వేమభూపాలుడు, రేచెర్ల సింగమ నాయకుడు, మంచికొండ గణపతి నాయకుడు. వీరందరు ఆంధ్రదేశము యొక్క విషమ పరిస్థితి లెస్సగా యోచించి, ముస్లింల యాధిపత్యమును పడద్రోచి హిందూధర్మ సంస్థాపనకు ఒక కూటమిగా చేరిరి. ముసునూరు వంశజుడయిన ప్రోలయ్య నాయకుని తమ నాయకునిగా ఎన్నుకొనిరి. కొలని రుద్రదేవుడు, అన్నమంత్రి వృద్ధులయి యుండుట చేత, ఈ నాయక (అధ్యక్ష) పదవి ముసునూరి ప్రోలయ్య నాయకునికిచ్చినట్లు కనబడుచున్నది. ఈ వృద్ధనాయకుల ఆదర్శమంతయు ముసల్మానుల ఇనుప పిడికిలినుండి ఆంధ్రప్రదేశమును విడిపించుటయే అయియుండెను. ఈ కార్యసాధనకు ముసునూరి ప్రోలయ్య నాయకుడు తగినవాడని తలంచిరి. నాయకవరణము జరిగిన తరువాత ఈ యిద్దరు శూరులు నాయకునికి తోడ్పడుచు, సలహాలిచ్చుచు మార్గదర్శకులుగా నుండిరి.

బెండపూడి అన్నమంత్రి 'ఆంధ్ర భూమండల అధ్యక్షర సింహాసన సుప్రతిష్ఠాపనాచార్య' అను బిరుదుతో వర్ణితమైనాడు. (భీ.పు) అన్నమంత్రి ప్రోలయ్యనాయకుని స్వాతంత్ర్య వీరులకు నాయకుడుగాచేసి ఆంధ్ర భూమండలమునకు ఒప్పచెప్పి నాడన్నమాట.

ప్రోలయ్య నాయకుడు 1323 పూర్వము అంత ప్రసిద్ధికెక్కినవాడు కాదు. దండనాధుడుగనో, మంత్రిగనో, మహాసామంతుడుగనో, మాండలిక ప్రభువుగనో, పేరు ప్రసిద్ధులు కలవాడు కాడు. ఐననేమి దండనాధుడుగా, మంత్రిగా ప్రసిద్ధికెక్కి ప్రతాపరుద్ర మహారాజుతో గల బాంధవ్యమును పురస్కరించుకుని కొలని రుద్రదేవుడు ఎక్కువ పలుకుబడి కలిగియుండెను. అతని మూలకముగనే ప్రోలయ్య నాయకుడు నాయకపదవి వహించిన వాడయ్యెను. విదేశీయ పరిపాలనాధికారులను తరిమివైచి, ఆంధ్రదేశమును దాస్య శృంఖలమునుండి తప్పించుటకు ప్రోలయ్య నాయకుడు బద్ధ కంకణుడయి కార్యక్రమమును ప్రారంభించెను.

ప్రోలయ్య నాయకుడు ఏ విధముగా కార్యజాలమును నడిపించెనో, ఎట్టి వ్యూహములు పన్నెనో సరిగా తెలియదు. ఈ కూటమిలోని పెక్కుమంది గోదావరి, కృష్ణ పరిసరముల యందలి దుర్గమారణ్యములలోని పర్వత దుర్గములను తమ సమావేశ కేంద్రములుగా చేసికొనినట్లు కనబడుచున్నది. ఇట్లు వీరు ముస్లిం అధికారులకు అందుబాటులో ఉండకపోవుటయేగాక, పదే పదే తురకలను పీడించుచు, తప్పించుకొని పోవుటకు అనువుగా నుండు పద్ధతి అవలంబించిరి. వీరికి ప్రజలనుండి రహస్యముగా అన్ని సహాయములు లభించుచుండెను ఈ సమరము ఆంధ్రదేశ చరిత్రలో మహోన్నతమైన ఘట్టముగా ఉండెను. సూర్యవంశజులు, చంద్రవంశజులు అయిన రాజుల ప్రమేయములేకుండ తమ దేశము కొరకు, తమ మతము కొరకు, తమధర్మ సంస్థాపనము కొరకు హిందువులయిన చిన్న పెద్ద దొరలందరు ఏకంగా డెబ్బది యైదుగురు నాయకుల సంతతివారు ధైర్యముతో ముందుకు వచ్చి ప్రోలయ నాయకునితో సహకరించిరి చివరకు వారి ప్రయత్నములన్నియు సఫలములయ్యెను. ప్రజలలో నూతనోత్సాహం ప్రబలెను, ముందు ముందు ఎట్టి యుద్ధములు ఎదుర్కొనవలసి వచ్చినను, వెనుదీయక ధైర్యసాహసములతో నిలుచుటకు సిద్ధముగా ఉండిరి.

విలస శాసనము ఈ విజయము గూర్చి ఇట్లు నుడువుచున్నది

ముసునూరి వంశజుడయిన ప్రోలరాజు తన బాహు బలాధిక్యతచే యవనుల దుర్భర యాధిపత్యమును పటాపంచలు గావించెను. ఆతని నామము మహామంత్రమై ముష్కర తురుష్కులను భీతావహుల చేసినదా యేమి ? ఆ పేరువినినంత మాత్రముననే యవనులు దుర్గములను వీడి ఎక్కడెక్కడికో పలాయనము చిత్తగించినారు. గ్రీష్మ ఋతువునందలి ఎండదెబ్బ తిన్నవారు తటాకమునందలి శీతలజల ప్రదేశమును చేరినట్లు, ఇదివరలో యవనులచే బాధపడ్డ జనులు వీర్యవంతుడయిన ప్రోలరాజు శరణుజొచ్చిరి. యవనులు పెట్టిన బాధలకు గురిఅయిన ఆ ప్రజలే ముసల్మానులను హతము గావింపసాగిరి. ఆశ్రయము లభించినప్పుడు జనించు బలము ప్రముఖమైనది గదా !

## తెలుగుప్రజల విజయము

మహాకూటమివారు అరణ్యక దుర్గములలోనే యుండి బయటకు వచ్చి, ముస్లిం సైన్యాలమీద దుముకుటకు సదవకాశము

కొటకు వేచుకొనివుండిరి. ఢిల్లీలో గయాసుద్దీన్ తుగ్లకు 1325లో మరణించెను. అతని కుమారుడు ఉలూఘ్‌ఖాన్ రాజయి, అచటి కార్యములను చక్కబెట్టుకొనుటలో నిమగ్నుడయ్యెను. అతనికి దక్షిణ ప్రాంత విషయమున శ్రద్ధతీసుకొనుటకు అవకాశము లేకుండా ఉండెను. ఇదియే మంచి యదనని ఆంధ్రవీరులు తటాలున విజృంభించి ముఖ్య కేంద్రములయందు నెలకొనియున్న తురక సైన్యాలపై దాడి సలిపి వారిని చిత్తుగా నోడించి, తీర ప్రాంతమును స్వాధీనము చేసుకుని అచట హిందూ ధర్మమును పునః ప్రతిష్ఠాపనము గావించిరి. కొలని రుద్రదేవుడును, అన్నయ మంత్రియు ప్రధాన పాత్రలు వహించి తమ తమ విధులను నెరవేర్చుచు ప్రశంసా పాత్రముగా వ్యవహరించిరి.

కొలని రుద్రదేవుని మరణానంతరము అధ్యక్ష పీఠము నధిష్ఠించియున్న ముసునూరి ప్రోలయ నాయకుడు సాగర తీరమున కంతయు స్వతంత్రాధికారముగల రాజయ్యెను. 1325లో అతనితో దేశవిముక్తి విషయమున సహకరించిన దొరలందరు అతనికి సామంతులయిరి. ప్రతాపరుద్ర మహారాజు తరువాత ప్రోలనాయకుడే ఆంధ్ర దేశాధిపతిగా పరిగణింపబడెను. అతని రాజ్యభాగము కృష్ణా గోదావరి నదుల మధ్యప్రదేశమైయుండెను. ప్రోలయ నాయకుడు గోదావరీ నదికి సమీపమున మాల్యవంత పర్వత(తూర్పు కనుమల) పరిసరములందలి రేకపల్లి తన రాజధానిగా చేసికొనెను. ఈ ప్రాంతమే ఆ యుద్ధ ప్రస్థాన సంరంభమునందు ప్రోలయనాయకుని నివాస భూమిగా నుండియుండెను కాబోలు.

"ప్రోలయ నాయకుని రాజ్యపాలనము ప్రజలకు హాయి గొల్పెను. ముస్లిముల అత్యాచారములు సమసి పోయినవి. పూర్వ రాజులు ప్రదానముచేసిన అగ్రహారములు బ్రాహ్మణులకు తిరిగి లభించెను. వేదమతము పునరుద్ధరింపబడెను, యజ్ఞ యాగాదులు ఎట్టి అవరోధము లేకుండా ఆచరింపబడుచుండెను. ఆంధ్రప్రదేశము మరియొకసారి పవిత్రభూమి అయ్యెను. తురుష్కుల పాదఘట్టనమున అంటుకొన్న పాపపంకిల మంతయు తుడుచుకొని పోయెను. కాపులు ధర్మశాస్త్రానుసారము పంటలలోని భాగమును కప్పముగా రాజునకుసమర్పించసాగిరి. తపస్వులు తమ తపో ఫలితములోని షష్ఠ భాగము రాజునకొసంగసాగిరి. పారసీకులు భూమిపయి చేయగలిగిన ధ్వంసకార్యములన్నియు తేజశ్శాలియయిన ప్రోలరాజు యథా పూర్వక్రమమునకు తెచ్చెను. (విలస శాసనము.)

ప్రోలరాజుకు సంతానము లేదు. అతడు కొద్దికాలమే పాలించెను అతడు పూనిన ఆంధ్రదేశవిముక్తి ఘనకార్యము ఇంకను పూర్తి కాలేదు. ఈ రాజ్య పాలన కాలములో కాపయ నాయకుడు ప్రోలనాయకుని కుడి భుజముగా ఉండెను. తన వాంఛ పూర్తిగావించుటకు ఆ కార్య భారమును కాపయనాయకునకు ఒప్పగించెను. 1332లో జీవిత శేషమున మోక్షార్థియై పుణ్య కార్యములు చేయసాగెను. ప్రోలయనాయకుడు 1340 ప్రాంతములో స్వర్గవాసి యయినట్లు తోచుచున్నది. కాపయ నాయకుడు రాజయ్యెను.(1332)

కాపయ నాయకుడు ముసునూరు వంశస్థుడే. ఇతడు ప్రోలయ నాయకుని పినతండ్రి కుమారుడు. కాపయ నాయకుడును ప్రోలయ నాయకునివలె ఉత్సాహశీలుడు, సాహసి, యుద్ధతంత్ర ప్రవీణుడు, రాజ్య పరిపాలనా దక్షుడు, కాపయ నాయకుడు తెలంగాణమును తురుష్కుల బారి నుండి తప్పించి, ఓరుగల్లు కోటపై హిందూధ్వజమును ఎగురవేయుటకు స్థిర సంకల్పుడయ్యెను.

కోస్తా ప్రాంతములందు హిందువులకు లభించిన పరిపూర్ణ జయము ముసల్మాను సామ్రాజ్యము నందలి వివిధ ప్రాంతముల వారికి ధైర్యోత్సాహములను పురికొల్పెను. అచ్చటచ్చట తిరుగుబాటులు ప్రారంభమయ్యెను. 1326-1327లో సాగర పురపాలకుడైన మాలిక్ బాహ్వుద్దీన్ గురుషాస్పు ఢిల్లీ చక్రవర్తిని ధిక్కరించి కప్పము కట్టుట మానివేసి యుద్ధమునకు సిద్ధమయ్యెను. తన రాష్ట్రములోని దొరలు పెక్కుమంది ఆయనకు సహాయముగా నిలిచిరి. చక్రవర్తి సైన్యముతో పోరాడి, గురుషాస్పు ఓడిపోయి సాగరుకు పరుగెత్తి పోయెను. అచ్చట నుండుట సురక్షితము కాదని కంపిలికి పారిపోయి ఆరాజు శరణుజొచ్చెను. చక్రవర్తి స్వయముగా సైన్యాధిపత్యము వహించి కంపిలి రాజుతో యుద్ధము సాగించెను. కంపిలి రాజు ముసల్మానులను రెండుసార్లు ఓడించెను. అయిననేమి? ఈ తిరుగుబాటు ఫలితముగా కంపిలి సర్వనాశనమయ్యెను. గురుషాస్పు చంపబడెను.

చక్రవర్తి తిరిగి ఢిల్లీకి వెళ్ళగానే మరల తిరుగుబాట్లు ప్రారంభమయ్యెను. చక్రవర్తి ప్రతినిధి విభ్రాంతుడై కత్తరలాడ జొచ్చెను. దేశము అంతయు ఒక్కుమ్మడి అతనికి విరోధముగా లేచెను. అతని ప్రక్క ఒక్కరూ లేరు. ప్రతి హిందూ నాయకుడు స్వతంత్రుడై అధికారము చెలాయించ సాగెను.

ఈ స్థానిక తిరుగు బాటు నాయకులందరు ఆంధ్రులే. ఈ నాయకులతో కాపయ నీడుకు ప్రత్యక్షముగనో, పరోక్షముగనో సంబంధముండి యుండెను. సోమదేవరాజను అరవీటి వంశీయుడు ముస్లిం పరిపాలకుడైన మహ్మదు అను వానిని ఓడించెను. ఈ సోమదేవరాజు ఒకరోజు ననే గంగినేని కొండ, కందనవోలు (కర్నూలు) కలువకొలను, రాయచూరు, మొసలిమడుగు, యాతగిరి, సాతానికోట, అను ఏడుకోటలను జయించినాడు. ఆకులపాడు, ముదుగల్లు, ఆనెగొంది, మొదలగు ప్రదేశములందు జరిగిన యుద్ధములందు జయప్రదుడయ్యెను. ఈ ప్రదేశము లన్నియు కృష్ణా తుంగభద్రల అంతర్వేది యందుండెను.

సోమదేవ రాజు సోదరుడు రాఘవరాజు హంపి, ఆనెగొంది ప్రాంతములను జయించెను. ఇతనికి అద్దంకి కోమటివేమారెడ్డి మద్దతుగా ఉండెను. ఈ వేమారెడ్డి ముసునూరి రాజన్యులకు సామంతుడు. కనుక ఈ యుద్ధముల సంబంధమున కాపయ నాయకుని పూర్ణ సహాయముండెను.

హోయసల రాజైన వీరబల్లాలదేవుడును ముసల్మానుల నెదిరించి నిలచెను. ఇతను ఆంధ్రదేశములోని హిందువుల పక్షము వహించెను.

( సశేషం )

# వెలుగు ఖడ్గం

శ్రీ గంధం జోయెల్

చీకట్లను నింపుకున్న గృహాల
వాకిళ్ళలోకి వేకువ తొంగి చూస్తున్నది
తెల్లవారుతోంది!
భళ్ళున తెల్లవారుతోంది !
ఖిల్లాల గోడలచుట్టూ
విల్లాల, మేడల చుట్టూ
కిటికీల ఊచల్లోనుంచి,
పటకటాల మధ్యలోనుంచి
చీకటి దొంతరల
చీల్చే కాంతి కిరణం!
ఆకాశ గవాక్షంలో నుంచి
బయల్దేరి, శరవేగాన
వస్తోంది! ఖబర్దార్!

గ్రామాలను నిద్రలేపుతూ,
నగరాలను పలకరిస్తూ
కూలీజనం కాళ్ళలో, కీళ్ళలో
క్రొత్తసత్తువను ప్రసాదించి
వాలివాలని జీతగాళ్ళ కళ్ళలో
కాంతిరేఖలు వెలిగించి
వెనుకబడిన సోదరులకు
వెలుగుఛత్రం పట్టడానికి,
ఆకాశహర్మ్యం నుండి
అమాంతంగా దిగుతోంది!

ఇళ్ళూ, వాకిళ్ళూ నలువైపుల
నూతన కాంతితో మెరిశాయి!
బళ్ళూ, గుళ్ళూ బంగారు
పూలతో విరిశాయి!!
కటికచీకట్లో దూరాన
గావుకేక! చావుకేక!

అరచే నక్కలు
మొరిగే కుక్కలు
గోడమీది గ డు పిల్లుల
గోలంతా విన్నాడు రాత్రి, మనిషి
చీకటి బెబ్బులి పంజా ఎత్తింది!
రక్తం కళ్ళచూడాలని మొత్తింది!
ఇనుపగోళ్ళతో రక్కింది
తన ఉత్తరువులు ధిక్కరించి మనిషి
పారిపోకూడదని శాసించింది!
గాండ్రించింది!

దెబ్బెబ్బ పడకుండా మనిషి
బెబ్బులిని ధైర్యంగా
'వెలుగుఖడ్గం'తో కూల్చాడు!
పక్షుల కిలకిలలు విని,
ఆపులిస్తూ కూర్చుంటే,
అసలుకే మోసమని గ్రహించాడు!

అబద్ధాల అద్దాలను బ్రద్దలుకొట్టి,
వేకువజాడ తెలుసుకున్నాడు
ఆనందం సరస్సు కనుగొన్నాడు
చిరునవ్వుల సిరుల్ని పంచుకొని,
ప్రభాతానికి స్వాగతం పలికాడు!
ప్రగతికి వారసుడై నిలిచాడు!!



జూలై 9వ తేదీన ఉస్మానియా విశ్వవిద్యాలయం టాగూరు ఆడిటోరియంలో 20 వ అఖిల భారత గ్రంథాలయ మహాసభకు గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.




ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయిదేశాయి జూలై 20వ తేదీన హైదరాబాదులోని గాంధీ ఆసుపత్రిలో "ఆరోగ్య సంస్థలలో ఆర్థిక విషయాల నిర్వహణ" పై జరిగిన గోష్ఠికి ప్రాశంభోత్సవం శేశాతు.

# నగరంలో వార్తా చిత్రాలు



గవర్నరు బహాదూరు శ్రీ హెచ్.సి. ఖరీన్ జూలై 17న హైదరాబాదులో జరిగిన వృత్తి విద్యా శిక్షణ రాష్ట్ర కౌన్సిలు ఆరవ సమావేశానికి అధ్యక్షత వహించారు



ఆహార, వ్యవసాయశాఖ కార్యదర్శి శ్రీ పి.వి. రత్నం, జూలై 9వ తేదీన హైదరాబాదు సమీపములోని అల్వాల్‌లో "పెరటి తోటల ప్రచారోద్యమా"నికి ప్రారంభోత్సవం చేశారు.

# నగరంలో వార్తా చిత్రాలు



ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. భగవాన్‌దాస్ రవీంద్ర భారతిలో జూలై 20వ తేదీన జరిగిన కథకళి నృత్య ప్రదర్శనలకు అధ్యక్షత వహించారు.



హైదరాబాదులో జూలై 19వ తేదీన జరిగిన సమావేశంలో రాష్ట్ర భద్రతా బహుమతులను ప్రధాన కార్యదర్శి పంచిపెట్టారు.

# సుప్రసిద్ధ శైవ క్షేత్రము

# ఆచంటేశ్వరాలయం

''నాగేంద్రహారాయ త్రిలోచనాయ
భస్మాంగరాగాయ మహేశ్వరాయ
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ
శ్రీనీలకంఠాయ నమశ్శివాయ''

జగద్విఖ్యాతములై వెలయుచున్న సుప్రసిద్ధ శైవక్షేత్రములు మన ఆంధ్ర ప్రదేశములో అనేకములున్నవి. అట్టి వానిలో ఐదవ శతాబ్దము నుండి ఉన్న అతి ప్రాచీనమైన పరమ పవిత్ర పుణ్య క్షేత్రము ఆచంట పుణ్యక్షేత్రము. ''ఆచంట'' గ్రామము పశ్చిమ గోదావరి జిల్లాలో నున్నది. ఇచటికి బస్సు ప్రయాణ సౌకర్యములు జిల్లాలో చాలా రైలు స్టేషన్లనుండి ఉన్నవి.

సాధారణముగా శైవక్షేత్రములన్నింటిలోనూ శివుడు లింగ రూపధారుడై ఉంటాడు. కాని ఈ ఆలయమందలి లింగము స్త్రీ యొక్క స్తనం ఆకారములో ఉన్నది. శంకరుడు స్తనాకృతి దాల్చి ఉద్భవించుటకు సంబంధించిన స్థలపురాణగాథ ఒకటి ఉన్నది.

## స్థల పురాణ గాథ

అచ్యుత ముని, అతని భార్య గంగ, ముక్తిసముపార్జించుటకు పురాణ దంపతులను దర్శించుటకువెళ్ళి పురాణ దంపతుల శాపమునకు గురియై తత్ఫలితముగా అచ్యుత ముని తిరుపహ్యారునందు ''ఒడయనంబి'' అనే నామధేయంతోనూ, అతని భార్య గంగ అదే ప్రాంతంలో ''పరమనాచి'' అనే పేరులో వేశ్యాపుత్రికగానూ జన్మించిరి. వారిరువురు నిత్య శృంగార జీవనం గడుపుచుండిరి. ఒడయనంబి రోజుకు కనీసం ఆరుసార్లయినా ఆత్మలింగాన్ని అర్చించేవాడు.

వారిరువురూ తీర్థయాత్రలకై బయలుదేరి అనేక పుణ్యక్షేత్రాలు దర్శించుచూ చివరకు మార్తాండపురంచేరి అచటనే నివాసమేర్పరచుకొని కాపురముండిరి. నాటి మార్తాండపురమే నేటి ''ఆచంట''గా రూపొందిందట. ప్రతి దినమూ పరమనాచి అచటి ఆలయములో దేవుని సమక్షంలో నృత్యగానాదులు చేయుచుండెడిది.

ఒకనాడు వారిరువురూ మన్మథ ప్రేరేపితులై శృంగార క్రీడలో సొమ్మసిల్లి శివుని ఆరాధించే వేళకు నిద్ర మేల్కొనలేక పోయారట. అహరహము శివధ్యానతత్పరుడైన ఒడయనంబికి శివార్చన జ్ఞప్తికి రాగానే వెంటనే మేల్కొని వేరొక గదిలోనున్న ఆత్మలింగాన్ని తెచ్చుటకు మరింత ఆలస్యమవుతుందని భావించి నిద్రించుచున్న పరమనాచి స్తనమును శివలింగంగా భావించుకొని, తన వెంట పుష్పములు లేకపోగా నాటిరాత్రి తాంబూల సేవనంలో పాలు చేసిన తమలపాకు తీగెలను పత్రిగాచేసి అర్చించినాడట. నాచి నిద్రనుండి లేచి దిగ్భ్రాంతి చెంది "ఇట్లేల చేసితివి?" అని ప్రశ్నించగా "భగవంతుడు సర్వాంతర్యామి, నీ కుచమునందు ఇపుడు నాకగుపించుటచే అర్చించితి" నని ఒడయనంబి సమాధానం చెప్పగానే శంకరుడు ఆమె స్తనమునుండి ఉద్భవించి వారికి సాక్షాత్కరించెనని పురాణగాథ.

ఈ పురాణ గాథ విశ్వసనీయముగా తోచుటలేదు. కాని యిచట స్థానికులు ఈ గాథయే ఆచంటేశ్వరోద్భవానికి మూలమని విశ్వసిస్తున్నారు. లింగంపై గీతలు కన్పించుచున్నవి. అవి తమలపాకు తీగెలని వారి విశ్వాసము. లింగాగ్రమున కన్పించు చిన్న బెజ్జములు శీకనాళికలుగా భావించబడుచున్నవి.

## క్షేత్ర మాహాత్మ్యము

రావణుని సంహరించిన పిదప బ్రహ్మహత్యాపాతక నివారణార్థము శ్రీరామచంద్రుడు ప్రతిష్ఠించిన అసంఖ్యాకములగు లింగములలో ఈ ఆచంటేశ్వర లింగము ఒకటిగా చెప్పబడుచున్నది. ఇచటనున్న రామగుండమనే కోనేటిలో స్నానముచేసి సంవత్సరము రోజుల పర్యంతము ఆలయ ప్రదక్షిణములు చేసి, అత్యంత భక్తి శ్రద్ధలతో ఆచంటేశ్వరుని అర్చించినట్లయిన కుష్ఠురోగము మొదలైన దీర్ఘరోగములు కూడా పోవునని ప్రజల ప్రగాఢ విశ్వాసము.

## చారిత్రిక శాసనములు

ఆచంటకు సంబంధించిన శాసనాలను బట్టి 12వ శతాబ్దములో ఈ పుణ్యక్షేత్ర నామధేయము ఆచంట. ఇక్కడి దేవుడు ఆచంటేశ్వరుడు అని పిలువబడుచుండెనని తెలియుచున్నది. 12వ శతాబ్దిలో ఈ ఆచంటేశ్వరునకు విష్ణువర్ధన మహారాజు మున్నగు రాజులు కొందరు అఖండ దీపాలను అర్పించుకొనినట్లు శాసనములవలన వెల్లడగుచున్నది.

## ఆలయ నిర్మాణం

ఈ ఆలయమును మహ్మదీయ చక్రవర్తులు చాలావరకు శిథిల పరచారంటారు. ఇచటి గోడలపైనున్న సప్తమాతృకలు, భైరవుడు, దేవి, సూర్యుని ప్రతిమలు అతి పురాతనమైనవిగా గోచరించును. శిథిలమైన ఆలయ భాగాలను పునరుద్ధరించినట్లు కూడ కన్పట్టుచున్నది. రాకపోకల సౌకర్యాలు కలిగి గొప్ప చారిత్రిక ప్రాధాన్యత కలిగిన ఈ పుణ్యక్షేత్రం ప్రతి ఒక్కరు దర్శించదగ్గది.

శ్రీ గునుపాటి భోగీశ్వరం

# వ్యావహారిక భాషా వాదానికి పాశ్చాత్యులు చేసిన దోహదం

—శ్రీచావలి రామమూర్తి

పాశ్చాత్యులైన ఆంగ్లేయులు మన భారత దేశాన్ని సుమారు రెండు వందల సంవత్సరములు పరిపాలన కావించారు. ఈ దేశములో వారి అధికారాన్ని నిలబెట్టుకొనడానికి సాధారణముగా సామ్రాజ్య వాదులు చేసే పనులు, అనుసరించే మార్గాలు అమలుచేసారు. మన జాతీయ నాయకులను కారాగారాలలో ఉంచారు, మన సాంప్రదాయాలను సిద్ధాంతాలను మార్చివేయ ప్రయత్నించారు. మన ఐకమత్యాన్ని విచ్ఛిన్నముచేశారు. మనలను రక్షిస్తున్నామని భ్రమింపచేసి భక్షించారు. అది కాదు అనటానికి అవకాశములేదు.

అయితే వారు మన భాషా సంస్కృతుల అభివృద్ధికన్ని విశేషమైన కృషిచేశారు. మనలో నిద్రాణమై ఉన్న శక్తులకు చైతన్యము కలిగించారు. కరుడు కట్టుకొనిపోయిన విశ్వాసములలో కల సాధక బాధకాలు చూపించి మనకు నవీన భౌతిక రసాయనిక వృక్షాది శాస్త్రముల పఠనావసరమును, సర్వజన సుబోధకమగు శాస్త్రపఠనావసరములు కూడ తెలియచెప్పారు. ఎంతటి ప్రాచీన పక్షపాతము కలిగిన భారతీయుడయినా ఆంగ్లేయులు [illegible] మన మతాన్ని, సంస్కృతిని, సాంఘిక వ్యవస్థను భాషను ప్రభావితము చేసారని అంగీకరించక తప్పదు. విద్యావ్యాప్తి కావించారు. విద్యావ్యాప్తికి వ్యావహారికభాష ముఖ్యమని గుర్తించినవారు ఆంగ్లేయ మేధావులే.

ప్రజలలో నూతన భావాలు పెంపొందటానికి ఆంగ్లేయ విద్యా విధానమే ముఖ్యకారణము. దానికి తోడుగా ప్రాచీన కావ్యాలలోని తెలుగు భాష జనసామాన్యానికి అందుబాటులో లేదని, అది సర్వ సామాన్యులు గ్రహించ వీలుగా లేదని, దానివలన భాషకు, భావాలకు, సంఘానికి లాభము కలుగుట లేదని నిర్ణయించిన వారు పాశ్చాత్య పండితులే. అందుచే సహజమైన వ్యావహారిక భాషను అంగీకరించ వలసిన అవసరాన్ని వారు బహువిధముల ప్రచారము చేశారు.

1917వ సంవత్సరములో విలియం బ్రౌను అనే పాశ్చాత్య ప్రభుత్వ ఉద్యోగి వ్యావహారిక భాషకు ఒక నిఘంటువు తయారు చేశాడు. అంతే ఈ పాశ్చాత్యుడు జీవద్భాషకు గ్రంథ భాషకు గల వ్యత్యాసాన్ని గుర్తించి వ్యావహారిక భాషావాదానికి విత్తులు జల్లినాడన్న మాటకాదా!

## సి. పి. బ్రౌను

చార్లెస్ ఫిలిప్సు బ్రౌను అనే ఈస్టిండియా కంపెనీ ఉద్యోగి మన తెలుగుభాషా సాహిత్యాల అభివృద్ధికి విశేషమైన సేవచేశాడు. తెలుగు భాషాభివృద్ధి కొరకు అతడు పడనిపాటులేదు. స్వంత ధనముతో పండితులను పోషించాడు. భాషలోని లోతులన్నీ గ్రహించిన ఈ విద్వచ్ఛేఖరుడు

"Hindu Grammarians, like those of China neglect the colloquial dialect, which they suppose is already known to the student, and teach only poetical peculiarities. They are willing to aid our studies, either in Telugu poetry or in Sanscrit, they are reluctant to teach us the language of common business." అని తాను వ్రాసిన తెలుగు వ్యాకరణ పీఠికలో ప్రస్తావించాడు.

వ్యావహారిక భాషాజ్ఞానము లేనివారిని కూడ తెలుగు భాషా బోధకులు తెలుగు నభ్యసించుటకు అత్యంత క్లిష్టమైన గ్రంథములను పఠించమని కోరెదరని, అట్టికోరిక వ్యర్థమని వ్రాయుచు

"Telugu Assistants counsel us to read the Sanscrit vocabulary by Amara, the versified set of Telugu synonyms called Andhra Bhasha Bhushanam, or the treatise or grammar written by Nannaia Bhatta and Appa-Cavi Happily for me I never read one of these books until I had already (about the age of twenty seven) acquired a command of the spoken Telugu." అని విమర్శించాడు

బ్రౌనుదొర మనుచరిత్ర, వసుచరిత్ర ఇత్యాది గ్రంథములకు టీకలు వ్రాయించినప్పుడు, జనసామాన్యముకూడ కావ్యాస్వాదన

చేయుటకు అనువుగానుండుటకు, వ్యావహారిక భాషనుకూడ ఉపయోగించినాడు. వేమనచరిత్రకు "Notice" అనే పేరుతో పీఠిక వ్రాయుచు, 'Three commentries have been framed to explain it, and of these third (in familiar Telugu) written at my desire by a learned brahmin in my employ (in the year 1833) is now printed........."

బ్రౌను దొరకు వేమన మహాకవియెడల ప్రత్యేకమైన అభిమానము గలుగుటకు కారణము, వేమన వాడుకభాషలోని ప్రయోగముల నుపయోగించి, తన కవితను కూర్చుటయే. వేమన ప్రతిభకు నిష్కపటమైన శ్రద్ధాంజలి ఘటించుచు, బ్రౌనుదొర

" This author is in Telugu what Lucian is in Greek-a familiar writer, useful to a beginner, though neither poetical nor classical". అని పేర్కొనినాడు.

మామిడి వేంకయ్య అనే పండితుడు వ్రాసిన ఆంధ్ర దీపికను గూర్చి ముచ్చటించుచు బ్రౌనుదొర, అది కేవలము కావ్యాలలో ఉపయోగించిన పదములకే అర్థ వివరణ చూపినది. 'సామాన్య తెలుగు' కు ప్రాముఖ్యము లేదనివివరిస్తూ,

"The Dipica ఆంధ్రదీపిక. Dictionary of Telugu explained in Telugu written by మామిడి వెంకయ్య at Masulipatnam. It was completed in the year 1816. A duodecuno edition of this book was printed at Madras in 1848, but it is far from faithful. The Dipica gives a mere selection of the words used in Telugu poetry. The ordinary Telugu of common life is but slightly noticed" (C. P. Brown's Telugu, English Dictionary, page, VIII 1852 edition) అని వ్రాసినాడు.

దొర తన తెలుగు—ఇంగ్లీషు నిఘంటువులో, ఏవిధంగా పండితులు వ్యావహారిక భాషా పదాలను అభ్యంతర పెట్టి నారో వ్రాయుచు వారి పాండిత్య మెంతటి శ్లాఘనీయమైనను, వారి పక్షపాత వైఖరి మాత్రము సరిఅయినది కాదని అభిప్రాయమును వెలిబుచ్చినాడు.

Instead of that found in poems and used in ordinary life they (Sastris) wish to practice a pedantic style which is admired because conceited and far from clear. Such refinements are disregarded by men of real learning who are therefore considered vulgar by some who are inferior in sound scholarship (Telugu, English Dictionary)."

ఈ విధంగా ఛార్లస్ ఫిలిప్సు బ్రౌనుదొర విదేశస్థుడైనను, మన భాషకు విశేషమైన సేవ చేసి ప్రజల భాషయొక్క ప్రాముఖ్యమును పండితులకు గుర్తుచేయకలిగెను. దొర వ్యావహారిక భాషోద్యమమునకు ఆద్యుడు. ఆ తరువాత కాలములో జీవద్భాషోద్యమునకు రథసారథులైన గిడుగు గురజాడలు సమరం సాగించుటకు కావలసినంత ఇంధనాన్ని సమకూర్చి యిచ్చినాడు.

ప్రతి తెలుగు వాడు బ్రౌను జీవిత చరిత్రను చదువవలసి యున్నది. అతని జీవిత చరిత్రను, భాషాసేవను, డాక్టరు కొత్తపల్లి వీరభద్రరావుగారు. సి.పి. బ్రౌను (1798—1884) అను పేరున ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారి సహాయముతో ప్రకటించిరి. అస్మద్ గురువర్యులగు డాక్టరు రావుగారు ఆంధ్ర, ఆంగ్ల భాషలలో పరిపూర్ణ ప్రజ్ఞావంతులు, గొప్ప వక్తలు. విశాలదృష్టిగల జిజ్ఞాసులు వారు బ్రౌను దొరపై నీ గ్రంథము వ్రాయుటకు దేశ విదేశాలలో లభించిన అనేక సాక్ష్యములను ఏరి కూర్చి బహు పరిశ్రమచేసి, శాస్త్రబద్ధమైన సాక్ష్యములను అంగీకరించి నిష్పక్షపాత వైఖరితో నీ గ్రంథము రూపొందించిరి. ఇది తెలుగు ప్రజలు బ్రౌను దొరకు ఘటించగల శ్రద్ధాంజలి.

బ్రౌనదొర భారతదేశమును 1855లో వదలి ఇంగ్లాండునకు వెడలిపోయెను. ఆ తరువాత తెలుగు సరస్వతిని సేవించిన చిన్నయసూరి, బహుజనపల్లి, వీరేశలింగము వగైరాలు అందరు గ్రాంథిక భాషలోనే తమ రచనలు సాగించుట వలన, వ్యావహారిక భాషావాదమునకు తగిన చేయూత లభించలేదు. ఈ విధముగా వెనుక బడిన వ్యావహారిక భాషోద్యమానికి పునః ప్రాణప్రతిష్ఠ చేసినవాడు. జే. ఏ ఏట్సు అనే మరొక పాశ్చాత్య పండితుడు.

## జె. ఏ. ఏట్సు

1909వ సంవత్సరములో జే.ఏ. ఏట్సు దొర విశాఖపట్టణము ముఖ్య కార్యస్థానముగా విశాఖ, గోదావరి, గంజాం జిల్లాలకు ప్రధాన విద్యాశాఖాధికారిగా నియమింపబడినాడు. అప్పుడు విశాఖ పట్టణములో ఉన్న కళాశాలకు శ్రీ ఏ.టి. శ్రీనివాసయ్యంగారు అనే తమిళుడు ప్రిన్సిపాల్. విజయనగరము మహారాజా వారి కళాశాలకు రావు సాహెబ్ డాక్టరు కిళాంబి రామానుజాచార్యులు వారనే ప్రసిద్ధ విద్యావేత్త ప్రిన్సిపాల్. గురజాడ అప్పారావు పంతులగారు అప్పటికప్పుడే విజయనగరము మహరాజావారి కళాశాలలో ఉపన్యాసక వృత్తికి రాజీనామాచేసి, విజయనగర సంస్థానములో పరిపాలన సంబంధమైన రాజకీయ ఉద్యోగములో నిమగ్నులైనారు. పర్లాకిమిడి మహారాజవారి పాఠశాలలో గిడుగు రామమూర్తి పంతులు గారు ప్రధానోపాధ్యాయులు. ఇది నాటిస్థితి.

గంజాము, గోదావరి, విశాఖ మండలాలు తెలుగు భాషా స్థలాలు కావున ఏట్సు దొరకు తెలుగు ప్రజలతోను, తెలుగు భాషతోడను సన్నిహిత సంబంధము ఏర్పడినది. ఈ సన్నిహితత్వము తెలుగు భాషకు ఒక నవ ఉషస్సుగా పరిగణింపబడుతోంది. దీనికి కారణము ఏట్సు దొర జీవద్భాషకు కావ్య భాషకు గల తేడా తెలిసికొనగలుగుటయే! ఈ తేడాను గుర్తించిన ఏట్సు దొర శ్రీనివాసయ్యంగార్ని కలిసి, ఈ తేడాకు కారణము ఏమిటని ప్రశ్నించాడు. తాను తమిళుడనని, తెలుగు భాషతో నామమాత్రమైన పరిచయమే కలదని, అందుచే తెలుగు భాష తీరు తెన్నులు అంతగా తెలియని వాడనని, కావున విజయనగరములో గల శ్రీ గురజాడ

అప్పారావు గారు ఈ సందర్భములో విశేషమైన కృషి సల్పిన వాడని ఆయనను కలుసుకుంటే ద్వార సందేహ నివృత్తి కాగలదని తెలియ పర్చారు.

అయ్యం గారి సలహాననుసరించి దొర విజయనగరము వెళ్లి అప్పారావు గారిని కలిసినాడు వారు దొరకు జీవద్, కావ్యభాషలలో కల వైరుధ్యాన్ని నివేదించారు వారు వ్యావహారిక భాషావిషయములో జరిపిన కృషిని 'కన్యాశుల్కము' నాటకాన్ని గురించి వివరించి చెప్పారు మీరు ఈ ఉద్యమాన్ని చేపట్టి, దీనిని ప్రజా ఉద్యమముగా చేయవచ్చును కదా అని దొర కోరగా, తనకు సంస్థాన సంబంధమైన తొందర పనులు ఉండుటచే తాము ఈ కార్యభారాన్ని వహించలేమని, పర్లాకిమిడిలో గింటరు ఉద్యోగి గిడుగు రామమూర్తిని కలియమని కోరారు.

విసుగుచెందని ఆ పట్టుదొర పర్లాకిమిడిలో గిడుగు రామమూర్తిగారిని కలిసి వారిచేత 'వ్యావహారికభాషోద్యమము' అనే మహా యజ్ఞానికి సంకల్పము చేయించాడు అది మొదలు రామమూర్తి పంతులుగారు వ్యావహారికభాషా ప్రాశస్త్యాన్ని గురించి మహామహులతో ఢీకొని, మూడు దశాబ్దాలకుపైబడి బలుకుగా పోరాడారు.

ఇంతలో పత్రికలు, పుస్తకాలు కొల్లలుగా జన్మించాయి ఆంగ్లేయ విద్యావిధానమువలన పుస్తకపరిజ్ఞానము సామాన్యుడికి చేరువైంది. శాస్త్రసాంకేతికరంగాలలో విశేషమైన మార్పులు వచ్చాయి ప్రజలకు సాహిత్యము యెడల ప్రియత్వము, సంస్కారము యెడల అభిలాష జనించాయి. వ్యవహారికభాషావాదము ఈ కారణము వలన నిలద్రొక్కుకుంది. ఇటీవల శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారు, పి. హెచ్ డి పట్టను తీసుకొనుటకు సమర్పించు పరిశోధనాసామగ్రిని వ్యావహారికభాషలో వ్రాయవచ్చునని తీర్మానించారు.

## గెల్లెటే ద్వార

1937వ సంవత్సర ప్రాంతమున గెల్లెటే అనే ఇటలీదేశస్థుడు మన తెలుగుదేశములో కలెక్టరుగా ఉండేవాడు ఆయనకు తెలుగు భాష యెడల విశేషమైన ప్రేమ తెలుగుభాషాతత్వాన్ని గురించి బాగా గ్రహించిన ద్వార తెలుగులో వ్యావహారికానికి ఒక నిఘంటువు నిర్మించి దానిని అప్పటి బొబ్బిలి జమీందారు శ్రీ రావు రంగారావు గారికి అంకితము చేశాడు

భారతీయ విశ్వవిద్యాలయాల్లో విద్యాబోధన భారతీయభాషల్లోనే జరిగాలి అని చిరకాలంగా వాంఛింపబడుతూ ఉంది 1966లో విశ్వవిద్యాలయ గ్రాంట్లసంఘపు అప్పటి అధ్యక్షుడైన కొఠారి ఒక నివేదికను భారతప్రభుత్వమునకు సమర్పించెను దానిని కేంద్రరాష్ట్ర ప్రభుత్వములు అంగీకరించినవి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము మాజీ విద్యాశాఖ కార్యదర్శి అయిన జె పి యల్. గ్విన్ అధ్యక్షతన ఒక సంఘమును ఏర్పరచినది. ఆ సంఘమువారు గ్రంథములన్నియు తెలుగులోకి తర్జుమా కావలెననియు, డిగ్రీవరకు విశ్వవిద్యాలయ బోధన తెలుగులో నుండవలెననియు, శాస్త్ర గ్రంథపఠనమునకు శిష్టవ్యావహారికమును ఉపయోగించవలయుననియు సిఫార్సుచేసినది. ఆ సిఫార్సులన్నియు ఆమోదింపబడి, నేడు అమలులో పెట్టబడినవి గ్విన్ ద్వార ఐర్లండుదేశస్థుడు గుంటూరు, విశాఖపట్టణము, పశ్చిమగోదావరిజిల్లాలలో కలెక్టరుగాను, విద్యాశాఖ కార్యదర్శిగను వ్యవహరించి, ప్రస్తుతము హైదరాబాదులో స్థిరపడినాడు గ్విన్ నియామకము కాకతాళీయమైనను, ఒక పాశ్చాత్యుని అధ్యక్షతమున నియమింపబడిన సంఘమువారి సిఫార్సు శాసన రూపమాక్రమించుట ముదావహము.

ఇటీవలి కాలములో (జనవరి 1971 ప్రాంతములో మిస్ ఫ్రాన్సిస్ ఎస్టిరిజ్ అనే అమెరికన్ కన్య ఉస్మానియా ఆంధ్ర విశ్వవిద్యాలయాల్లో తెలుగుభాషను నేర్చి, వ్యావహారికభాషా ప్రాశస్త్యాన్ని గుర్తెరిగి, వ్యావహారికము గ్రంథస్థమెందులకు కాకూడదని ఆవేదనను వ్యక్తపరచుచు పత్రికాముఖమున సమాధానములు కోరినది పలువురు రచయితలు తమ అభిప్రాయములను వెలిబుచ్చి, ఆమె ఆవేదనను పరిష్కరించిరి.

ఈ విధముగా వ్యావహారికభాషా వాదమునకు ఆది నుంచి పాశ్చాత్యుల ప్రోద్బలము, ఆదరణ బహుళంగా లభించినవి.

---

(23 ఎ పేజీ నుండి )

# తాతాజీ

## బహుమతులు-సన్మానాలు

తాపీవారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో విశిష్ట సభ్యులు. వారికి ఆంధ్రదేశంలో అనేకచోట్ల అఖండమైన సన్మానాలు జరిగాయి. వారి విజయ విలాస వ్యాఖ్య 1971 వ సం.లో వెలువడ్డ గ్రంథాలలో ఉత్తమమైనదిగా ఎన్నికై కేంద్ర సాహిత్య అకాడమీ వారి బహుమతి పొందింది ఆయన వయసులో వృద్ధులైనా భావనలో యువకుడుగానే యుండి, యువతరానికి అత్యంత సన్నిహితులుగా ఉంటూ వచ్చారు. అనేక మంది యువకుల గ్రంథాలకు తమ అమూల్యమైన అభిప్రాయాలు వ్రాసి, వారిని ప్రోత్సహించారు.

తాపీవారు బహుముఖ విజ్ఞాననిధి. సాహితీవేత్త, సహృదయులు, సచ్చిదానంద మూర్తి: సాహిత్యక్షేత్రంలో ఆయన నాటని మొక్కలేదు. వికసించి, ఫలించని మొగ్గలేదు. ఆయన కవి, అంతకు మించిన పండితుడు, రెంటికి మించిన విమర్శకుడు, అన్నింటికీ మించిన గొప్ప వ్యాఖ్యాత. వీరు 1973 మే 5వ తేదీన కీర్తిశేషులయ్యారు

*

భారతీయ

జ్ఞానపీఠ

బహుమతి గ్రంథము

# ఊర్వశి

శ్రీ గాజులశెట్టి శ్రీరాములు

1972 వ సంవత్సరానికి సంబంధించిన భారతీయ జ్ఞానపీఠ బహుమతి ప్రముఖ హిందీ కవి శ్రీరామ్‌ధారీ సింహ్ 'దినకర్' కు ఆయన వ్రాసిన పద్యకావ్యం 'ఊర్వశి' కి గాను యివ్వబడింది. ఈ బహుమతి క్రింద వారికి లక్షరూపాయల నగదు, తామ్రప్రశంసా పత్రం, వాగ్దేవి కంచు విగ్రహం ఇవ్వబడినాయి. 1961 నుంచి 1965 వరకు 15 భారతీయ భాషలలో ఉత్తమమైన రచనగా 'ఊర్వశి' కి ఈ బహుమతి ఇవ్వబడింది.

శ్రీరామ్‌ధారీ సింహ్ 'దినకర్' బీహారు ప్రాంతంలోని ముంగరజిల్లా సిమరియా గ్రామంలో 1908 వ సంవత్సరం సెప్టెంబరు నెల 23 వ తేదీన జన్మించారు. వీరి తండ్రి శ్రీ రవిసింహ్ సాధారణ స్థితిగల రైతు. బీద కుటుంబంలో జన్మించిన కారణంగా దినకర్ బాల్యము అనేక సంఘర్షణల మధ్య నలిగి లోతైన జీవితానుభవాలను పొందగలిగెను. వీరు కొంతకాలం ప్రభుత్వ ఉద్యోగాలు చేసారు. కొంతకాలం వరకు ప్రొఫెసర్‌గా పనిచేశారు. కొంతకాలము పార్లమెంటు సభ్యులుగా కూడ ఉన్నారు. ప్రస్తుతము ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వ 'హిందీసలాహకార్ సమితి' అధ్యక్షులుగా ఉంటున్నారు.

దినకర్‌గారి భావనాశక్తి కడు గంభీరము, విస్తారము సంతరించుకొన్నది. జాతీయ కవుల పరంపరలో గొప్ప సమర్థుడని పేరుగాంచిరి. వీరి కవిత్వంలో తరుణ వయస్కుల హృదయాలను ఝంకృతి పరచే విలక్షణ శక్తి గలదు. ప్రారంభం నుండి కూడ భారతదేశ దీనస్థితినిచూసి తన కవిత్వంద్వారా కన్నీరుకార్చేవారు.

వీరి ప్రబంధ కావ్యాలలో కురుక్షేత్ర, రశ్మిరథి, ఊర్వశి ముఖ్యమైనవి. వీరి ఖండ కావ్యాలలో రేణుకా, హుంకార్, రసవంతి, బాపూ, పరశురామ్ కీ ప్రతిజ్ఞా పేరుగాంచినవి. గద్యకృతులలో మిట్టీకీఓర్, కావ్య కీ భూమికా, రేతీకేఫూల్, సంస్కృతి కే చార్ అధ్యాయ్ వంటివి ప్రసిద్ధములు.

వీరి రచనలన్నిటియందు జాతీయ గౌరవాన్ని పెంపొందింప చేయడమే ప్రధానాంశముగ కానవచ్చును. అందువలననే వీరి సాహిత్యములో ప్రగతివాద లక్షణాలు ప్రధానంగా కనుపించుచున్నవి. ఈ లాంటి సాహిత్యమహత్తువల్లనే వీరు 'భారత జాతీయ కవి'గా పేరు పొందిరి. కావుననే హిందీ సాహిత్య జగత్తునందు వారు నిజమైన దినకర్ గా భాసించుచున్నారు.

## మహాకావ్యం 'ఊర్వశి'

ఊర్వశి దేవలోకపు ఒక అప్సర అని మాత్రమే భారతీయ సాధారణ ప్రజానీకంలో ప్రతీతి. ఆది గ్రంథరాజములైన వేదములు మొదలు ఉపనిషత్తులు, పురాణాలు, ప్రబంధ కావ్యాలవరకు ఆమె ముఖ్య స్థానాన్నిఆక్రమించుకున్నవి. పండితులు ఊర్వశి పదానికి తీవ్ర అభిలాష,అపరిమిత కాముకత మొదలగు అర్థాలు చెప్పారు. కవీంద్రులైన రవీంద్రనాధ ఠాకూర్ గారు తన'చిత్రా'అనే కావ్య సంగ్రహంలో ఊర్వశిపైన ఒక మంచి కవిత వ్రాశారు. శ్రీ అరవిందులు కూడ ఒక ఖండకావ్యము వ్రాశారు. బహుశా కాళిదాసుని 'విక్రమోర్వశీయము' తరువాత భారతీయ సాహిత్యంలో ఖ్యాతిపొందిన రచన శ్రీ రవీంద్రనాథ్ ఠాకూర్ గారిదే కావచ్చును.

దినకర్‌గారి ఊర్వశి మహాకావ్యపు సమస్త లక్షణాలతో శోభాయమానంగా ఉంది. కవి దీనిని నాటకమువలె ఐదు అంకాలుగా విభజించాడు. సంకేతాలు, సంభాషణలు కూడ అభినయానికి అనుకూలంగా ఉంచాడు. ఈ విధంగా కవి పాఠకుల ఎదుట ఒకచిక్కు సమస్య తెచ్చిపెట్టాడు. 'ఊర్వశి'ని కావ్యమనవలెనా లేక నాటకమనవలెనా? కాని రసమర్మజ్ఞులు దీనిని కావ్యమనే అనగలరు. ఐనా దినకర్‌గారి 'ఊర్వశి' నాటకీయ కావ్యమనియే కొందరి అభిప్రాయం. ఇందలి పాత్రలు తమ భావ పరంపరను సరస స్వరంతో వ్యక్తీకరించెదరు. సనాతన పురుషుడు ప్రకృతియొక్క

రహస్య మయమైన భిత్తియే ఈ కావ్యానికి ఆధారం. ఇది హైందవ సాహిత్య సంస్కృతులకు ఆనుషంగికమైన ప్రవృత్తి.

నాటకీయ శృంగార కావ్యమైన 'ఊర్వశి' లో ఐదు అంకాలున్నవి. ప్రథమాంకములో ఊర్వశి స్వర్గలోకంనుండి మర్త్యలోకానికి దిగివచ్చినట్టి చర్య తనసఖులద్వారా వెల్లడవుతుంది. ద్వితీయాంకములో పురూరవ మహారాజు ఊర్వశి సాంగత్యముతో గంధమాదన పర్వతంపై విహరిస్తున్న విషయాన్ని మహారాణి ఔశీనరీదేవికి మహామంత్రి నివేదిస్తాడు. వేశ్యా కాముకుడైన తన భర్త ఆచరణను తలచుకొని రాణి అత్యంత వ్యాకులత చెందుతుంది. సఖులు ఆమెను ఓదార్పుటలో లీనమై పోతారు. తృతీయాంకము పూర్తిగా ఊర్వశీ పురూరవుల సంభాషణలతో నిండి ఉంటుంది. ఇందులో కవి జగత్తు రహస్యాన్ని విశదీకరించడములో నిమగ్నుడవుతాడు. ఇందులోనే కవి యొక్క ఉదీయమాన భావుకత చరమస్థాయి నందుకుంటుంది. నూటయేనభై ఆరు పేజీల పుస్తకంలో ఈ తృతీయాంకము అరవై పేజీల నాక్రమించింది. ఈ అంకమే ఈ మహా కావ్యానికి వెన్నెముక వంటిది. కవి ఇందులో తన సమస్త అస్తిత్వాన్ని క్రుమ్మరించి వేశాడు. అందంగా ఉత్తమంగా, మరి మధురంగా తాను చెప్పదలచిన దంతా తన హృదయ మస్తిష్కాలను పిండి ఇదే అంకములో పొందుపరచాడు. ఊర్వశీ పురూరవుల పరిపూర్ణ సంగమము ఈ అంకములోనే జరిగింది. శృంగార రసము ఇంతవరకు ప్రవహించి అగాధమైన అలలతో కూడిన సాగరమే అయిపోతుంది. పాఠకుడు సహజంగానే శృంగార భావనలో లీనమైపోతాడు.

ఊర్వశి పురూరవుని గాఢాలింగనములో లీనమై ఇలా అంటుంది.

> "रसमयी मेघमाला बनकर मैं तुझे घेर छा जाऊंगी
> फूलों की छाँह-तले अपने अधरों की सुधा पिलाऊंगी;"

(రసమయమైన మేఘమాలనై నిన్ను కప్పివేసి పూలనీడల క్రింద నా అధరామృతాన్ని త్రాగిస్తాను.)

> "कसे रहो, बस, इसी भाँति, उर पीडक आलिंगन में,
> और जपाते रहो अधर पुट को कठोर चुंबन से।"

(హృదయానికి మధుర బాధను కలిగించే ఆలింగనములో, ఆఁ, ఇలాగే అంటిపెట్టుకొని ఉండు. నా అధర పుటములపై కఠోర చుంబనాలందిస్తూ నన్ను జపిస్తూఉండమని అంటుంది ఊర్వశి. ఈ లాంటి కామసుఖమే ముక్తిమార్గమని ఋజువు చేస్తుంది.)

చతుర్థాంకములో చ్యవన ఋషి పత్ని సుకన్య, పుత్రవతియైన ఊర్వశుల హృదయ కోమలత్వపు సౌందర్యము దర్శనీయము, పంచమాంకములో పురూరవుని పుత్రుడు 'ఆయు' ఆగమనము, అతని పట్టాభిషేకము, రాజు సన్యసించుట వలన కలుగు పరిస్థితుల వర్ణన హృదయాన్ని కంపింపజేస్తాయి.

ఈ లాంటి ఇతి వృత్తాన్ని చేబట్టి కవితన కల్పన ద్వారా ఒక భవ్యరూపాన్ని సృష్టించి హృదయోల్లాసము చేకూర్చాడు. ఈ కల్పనా చాతురివలన పాత్రల విశిష్టత స్పష్టమవుతుంది. కథా గమనంలో స్ఫూర్తి కానవస్తుంది. ఈ కావ్యంలో దేవత్వ పరాజయపు మార్మిక చిత్రణ లభ్యమవుతుంది. ఊర్వశి లౌకిక సుఖానికి దాసురాలై స్వర్గమునుండి దిగివస్తుంది. కాని చివరలో అదృశ్యమై పోవడానికి కారణము చెప్పబడలేదు. భర్తనుగాని లేక పుత్రునిగాని ఒకరినే పొందగలదని ఊర్వశికి భరతముని శాపమున్నది. కాని ఈ దినకర్ కావ్యంలోని ఊర్వశి ఉభయులను వద్దని అదృశ్యమవుతుంది. బహుశః ఆమె దేవత్వము తిరిగి జాగృతమై ఉండవచ్చు లేక మానవ సంపర్కముపైన విరక్తి కలిగి ఉండవచ్చు.

## కావ్యగత విశేషాలు :

దినకర్ 'ఊర్వశి' శృంగార బహుళ కావ్యము. హిందీ సాహిత్యపు శృంగారకాలపు కవుల స్మృతులను జ్ఞప్తికి తెస్తుంది. భోగలాలసత్వము, విలాసవాసనల ఆధిక్యతవలన పాఠకుల మనస్సును పూర్తిగా రమింప జేస్తుంది. పాఠకుడు శృంగారములో మునిగి బయటికి తొంగిచూడ నొల్లడు. ఇందుపైన అచ్చటచ్చట ఠాకూరు, జయశంకర్ ప్రసాదుల ఛాయలు కాననగును. కాని జయశంకర్ ప్రసాదు మహాకావ్యము 'కామాయని' లోని శృంగారము ఇందుకు భిన్నమైనది. కామాయని శృంగారము ఎటువంటిదంటే, పాఠకుడు అందులో పూర్తిగా మునిగిపోయికూడా దానిని అంటకుండా ఉంటాడు. కాని దినకర్ 'ఊర్వశి' అలాంటి గ్యారంటీ ఇవ్వజాలదు. కాని విశుద్ధమైన కావ్యానందము దృష్టితో నారీ మనస్తత్వపు సూక్ష్మవివేచనం దృష్టితో చూస్తే ఇది ఒక బృహత్ సృష్టి అనిపిస్తుంది. వ్యంజనాత్మకమైన సరళభాష, మనోవిజ్ఞానపు అంతుపట్టనిలోతు, గల అక్షయ భండారమని చెప్పవచ్చును,




## 18

### ఆగ్రహం

"ఏమిజరిగింది"? ప్రశ్నించాడు సుల్తాను.

"ఖాసిం, అబ్దుల్లాలు మోసం చేశారు" అన్నాడు వజీర్ మలిక్.

"ఆఁ మోసం చేశారా? ఏవిధంగా?" ప్రశ్నించాడు సుల్తాన్. అతని మనస్సు ఆందోళన పడింది. అతనికి కోపంకూడ వచ్చింది.

"వారు మొదట మనసైన్యానికి నాయకత్వంవహిస్తున్నట్లే నటించారు. కాని కడపట హిందువుల వైపు తిరిగిపోయారు".

"ఆ మీద?"

" మన సైన్యం హిందువుల సైన్యం దెబ్బకాగలేక పరుగెత్త వలసివచ్చింది?"

"ఎంత మోసం జరిగింది?"

"హరిహర బుక్క రాయశ్లు శత్రు సేనలతో చేరి పోతూనే హిందూసేనల దాడికి తట్టుకోలేక మన సేనలు చాల నష్టపడినవి. మిగిలిన సేనలు దేవగిరిని చేరుకొన్నవి. తమ సేన తిరిగి వస్తూనే వజీర్ మలిక్‌కు యీ విషయాలన్నీతెలిశాయి. నాయకత్వం లేని సేన చిన్నా భిన్నమై బ్రతికి బయట పడింది. మలిక్ కది చాల విషాదాన్ని కలిగించింది.

సుల్తాను ఎన్నో మార్లు హిందూ రాజ్యాల మీదకి దండెత్తి వున్నాడు. తన సేనలను గూడ పంపివున్నాడు. ఈ విధంగా మాహమ్మదీయుల సేనలెన్నడూ మోసగింపబడలేదు. పరాభవం చెందియుండలేదు.

వజీర్ మలిక్‌కు ఖాసిం అబ్దుల్లాల మీద చాలాకోపంవచ్చింది. కాని అతడేమి చేయగలడు? ఇప్పుడు హరిహర బుక్కరాయశ్లే హిందూసైన్యాలకు నాయకులయ్యారు. వారి నెదిరించడానికి తగిన సేనలు తన వద్ద లేవు. ఈ విషయాన్ని గూర్చి సుల్తానులకు సవివరంగా నివేదించి, ప్రతి క్రియ కోసం ప్రయత్నించాలనిపించింది. అందు కోసమే ఆ మలిక్ ఢిలీ కి వచ్చి జరిగిన విషయాలన్నీ సుల్తానుకు నివేదిస్తున్నాడు.

"అయితే ఇప్పుడు వారెచ్చటున్నారు?" సుల్తాన్ ప్రశ్నించాడు?

"ఆనెగొందిలో ఉన్నారని విన్నాను. శృంగేరి పీఠాధిపతి కుట్ర గూడ ఇందులో వున్నదని విన్నాను. అతని బోధవల్లనే వారు తిరిగి పోయారని విన్నాను."

"ఆఁ సన్యాసి బోధలా! అతడు వారినెలా సంధించ గలిగాడు" ఆశ్చర్యంతో అడిగాడు సుల్తాను.

" మన సేనలు యుద్ధం మొదలు పెట్టడానికి ముందు దినం రాత్రి అతడు వారి గుడారంలోకి వచ్చాడట. వారికి నచ్చ జెప్పి యీ విధంగా చేయించాడట"

సుల్తానుకు ఆశ్చర్యంతోపాటు కోపం గూడ వచ్చింది.

"ఏమిటీ? మనసైన్యం మధ్యలోకి అతడెలా రాగలిగాడు? ఇందులో ఏదో కుట్ర వున్నది."

"అదే నాకు ఆశ్చర్యంగావుంది. అతడెలా ధైర్యం చేశాడో నాకు గూడ అర్థం కావడం లేదు."

"ముందు అతణ్ణి నాశనం చేయాలి. అప్పుడు గాని ఈ హిందువుల మదం అణగదు"

వజీర్ మలిక్ ఏమీ మాట్లాడలేదు.

"అయితే ఇప్పుడు ఏమి చేదామంటావు?"

"మీయిష్టం"

వెంటనే వారిమీద దాడి చేయడం మంచిదా " ఆలోచించండి.

"ఇచ్చట సైన్యాలు గూడ హెచ్చుగాలేవు,ఇతరులను నమ్మి పంపడానికి వీలు లేకున్నది. వస్తే నేనేరావాలి."

"ఆదే మంచిది. మీరు వస్తేనే వారి నెదిరించడానికి వీలుంటుంది."

"మరచాను సుల్తానాపూరులో మన సేన లలాగే వున్నాయి గదా?"

"ఉన్నాయి".

"వాటితోపాటు మరికొన్ని సేనలయితే సరిపోతాయా?"

"చాలవు. ఇప్పుడు మీరు తీరాంధ్రాన్ని తుంగభద్రా తీరాన్ని హోయసల రాజ్యాన్ని అంతటినీ జయించవలసి వుంటుంది".

సుల్తాను ఆలోచనలో పడ్డాడు.

ఈ మూడు ప్రాంతాలలోను తీర ప్రాంతమే చాల బలంగా వుంది. ఆ ప్రాంత నాయకుడైన కాపయ్యే యీ తిరుగుబాటుకంతటికీ కారణం. మొదట అతణ్ణి అణచి వేస్తే తరువాత ఇతరుల నణచడం చాలా సులభం.

"అవును. ఈమారు తీరాంధ్రం మీదనే దండెత్తాలి. మొదట ఓరుగల్లుకు వచ్చి, అచట నుండి తీరాంధ్రం మీద బడాలి."

"అలాగే చేయండి".

"దేవగిరిలో మన సేనల్ని గూడ సమాయత్తం చేసి వుంచు. వాటికి నీవే నాయకత్వం వహించడం మంచిది. ఇతరులను విశ్వసించి లాభంలేదు."

"అలాగే"

నేను తీరాంధ్రం "మీద దాడి సాగిస్తున్నప్పుడు ఆనెగొంది సేనలు గాని, హోయసల సేనలుగాని వారికి సహాయపడకుండా వుండేలాగా నీవు చూచుకోవాలి."

అలాచేయాలంటే నాకు మరికొంత సేనకావాలి."

"ఢిల్లీనుండి దేవగిరికి నేను సేనల్ని పంపలేను. అదనంగా ఉన్న సేనల్ని నాతో సుల్తానాపూరుకు తీసుకొని వెళ్లవలసివున్నది. నీవచ్చటే మరికొంత సేనను సమకూర్చుకోవాలి."

"అలానే."

"సరే." నీకు ఉత్తరువులందినప్పుడు నీవు సంసిద్ధంగా వుండాలి. సరే నీవు వెళ్లవచ్చు." అన్నాడు సుల్తాను. అతనికి వంగి సలాము గావించి, సెలవు తీసుకొన్నాడు వజీర్ మలిక్.

మలిక్ వెడుతూనే సుల్తాను పచారు గావిస్తూ ఆలోచింపసాగాడు.

నిజంగా తాను పొరబాటు గావించాడు. ఏ సామాన్యుడు గూడ చేయని పొరబాటు గావించాడు, హిందువుల మీద విశ్వాసముంచి తన సేనల్ని వారి చేతిలోపెట్టి పంపాడు. అంతకంటె పొరబాటుగాని, ప్రమాదముగాని మరొకటి ఉన్నదా? అంతకంటె తెలివితక్కువతనం వేరొకటి ఉన్నదా?

ఇప్పుడేం చేయ్యాలి? ఈ యవమానాన్ని ఎలా భరించాలి? ఈ తిరుగుబాటు నణచి వేయకుంటే ఇతరులు గూడ ఈలానే చేయరా? సుల్తానుకేమి పాలుపోలేదు.

ఆ కాపయ్య యెవడో దుర్మార్గుడులా వున్నాడు. అతడంటే అందరూ భయపడుతున్నారు. అతని పేరంటేనే తనవారికి హడలుగా వుంది. ముందు అతణ్ణి అణచి వేయాలి. బంధించి చీల్చి చెండాడాలి. ముక్కముక్కలుగా నరికి వేయాలి. ఆ ముక్కల్ని పెను మంటలలో ప్రేల్చి వేయాలి. ఇక ఒక నిమిషమైనా ఆగగూడదు, అనుకొన్నాడు సుల్తాను.

వెంటనే తన సేనానుల్ని పిలిచి సుల్తానాపూరుకు వెళ్లడానికి సంసిద్ధంగమ్మన్నాడు. తాను గూడ ఆయత్తమైనాడు. ఈ మారు అటో ఇటో తేల్చి వేయదలచు కొన్నాడు.

సుల్తాను ఓరుగల్లుకు వస్తూనే అచ్చటనున్న సేనానులు అతనికి, ఢిల్లీ సైన్యానికి ఘన స్వాగతమిచ్చారు. ఆ తరువాత సుల్తాను అచ్చటి విషయాలనన్నిటినీ తెలుసుకొన్నారు. పీరాంధ్రం మీదికి నడవడానికిప్రయత్నాలు గావించాడు.

మానవుడొకటి తలిస్తే దేవుడొకటి తలుస్తాడంటారు. సుల్తానెంత ఉంద్రేకంతో, ఉబలాటంతో, ఉత్సాహంతో దండయాత్ర కొనసాగించాలని వచ్చాడో హఠాత్తుగా అంత వ్యతిరేక పరిస్థితి ఏర్పడింది. ఓరుగల్లు మీద మహమ్మారి దండయాత్ర గావించింది. అది ఆ నగరంలో విలయ నృత్యం గావింపసాగింది.

మొదట మహమ్మారి కోట బయట నున్న వాడలలో వచ్చింది. అది కోటలోనికి ప్రవేశించి సైన్యంవున్న ప్రాంతానికి ప్రాకింది. తత్ఫలితంగా వేసకువేల సైనికులు చనిపోయారు. దాని దెబ్బకు అందరూ హడలిపోయారు.

మహమ్మారి నరికట్టడానికి సుల్తాను ఎంతో ప్రయత్నించాడు. ఆ ప్రాంతాలనుండి సైన్యాన్ని ఇతర ప్రాంతాలకు తరలించాడు. తీసుకొనవలసిన చర్యలన్నీ తీసుకొన్నాడు. కాని లాభం లేకపోయింది.

మహమ్మారి ఇతర ప్రాంతాల మీదికి గూడా దాడివెళ్ళింది. బలంగావున్న వారిని గూడ నిమిషాలమీద క్రుంగదీసి పీనుగుల్ని గావించింది. పెద్దలను, చిన్నలను, స్త్రీలను, పురుషులను అందరినీ తన పొట్టన పెట్టుకొననారంభించింది. అలాటివ్యాధి ఓరుగల్లు చరిత్రలో రాలేదు. అంత నష్టాన్ని ఎన్నడూ కలిగించలేదు.

ఆ వ్యాధి సైనికుల్నేగాక కొందరు సైన్యాధిపతుల్నిగూడ పట్టుకొని బాధించింది. అందులో ఒకరిద్దరి ప్రాణాలనుగూడ హరించింది. కడకు సుల్తానుగూడ దాని బారినుండి తప్పించుకొనలేక పోయాడు.

సుల్తానుకు మహమ్మారి సోకగానే సుల్తానాపూరంతా గడగడలాడింది. అల్లా తమమీద కోపించాడేమోనని అందరూ భయపడ్డారు. మసీదులలో ప్రార్థనలు గావించారు. కడకు సుల్తానేలాగో ఆ వ్యాధినుండి బ్రతికి బయటపడ్డాడు.

ఇక ఆ నగరంలో ఉండడం ప్రమాదకరమని, ఢిల్లీకి వెళ్ళడం మంచిదని రాజవైద్యులు సుల్తానుకు సలహా యిచ్చారు. మహమ్మారి సోకడంవల్ల సుల్తాను చాల బలహీనపడి ఉన్నాడు.

వెంటనే యుద్ధాన్ని ప్రారంభించడానికి సిద్ధంగా లేడు. పైగా అతని సైన్యంగూడ అదరిపోయి వుంది. అందువల్ల రాజవైద్యుల సలహాను పాటించడమే మంచిదనుకున్నాడు సుల్తాను దండయాత్ర అనే ఆలోచనకు స్వస్తిచెప్పి ఢిల్లీకి తిరుగుముఖం పట్టాడు.

## దాడికి సన్నాహములు

సుల్తానే తీరాంధ్రంమీదికి రానున్నాడన్నవార్తను గూఢచారులు కాపయ్య నాయకునికి తెలియజేశారు, ఈ మారు అటో ఇటో తేల్చివేయాలని వున్నాడనిగూడ వారతనికి నివేదించారు.

కాపయ్య నాయకుడుకూడ అందుకు సంసిద్ధంగానే వున్నాడు. నిరంతరం పోరాడుతూ వుండడం అతనికిష్టంలేదు. ఈమారు ఆంధ్రావని వుండడమో, ఊడడమో తేలిపోవాలని అతడుకూడ అనుకొన్నాడు.

కాపయ్య నాయకుడు ఈ వార్తను అన్నమంత్రికి, సింగమ నాయకునికి, వేమారెడ్డి మొదలైన ప్రధాన నాయకులకందరికీ తెలియబంపాడు. నాయకులందరినీ సమావేశపరచాడు. వారితో చర్చించాడు. వారు తమ బలాలను, శత్రుబలాలను అంచనావేశారు. తీరాంధ్రబలాలు, ఆనెగొంది బలాలు, హోయసలబలాలు చేరితే ఢిల్లీనుంచి రానున్నబలాలకు, దేవగిరి ఓరుగల్లు బలాలకు దాదాపు సగంకంటె హెచ్చుగావుంటాయి. అయినా వాటినెదిరించడానికవి సరిపోతాయి. ఢిల్లీ సేనలు ఫరవాలేదుగాని దేవగిరి, ఓరుగల్లు సేనలంత బలమైనవిగావు. మంచిశిక్షణ వున్నవిగూడగావు, కాబట్టి సులభంగా మొత్తం సేనల్నెదిరించవచ్చు. కాని ప్రమాదం మాత్రమున్నది. సుల్తాను తీరాంధ్రం మీదికి వచ్చినప్పుడు దేవగిరిసేనలు ఆనెగొందికి హోయసలసేనలు ఆ ప్రాంతానికి సహాయపడకుండా అడ్డు పెట్టవచ్చు. లేదా ఆ సైన్యాలు ముందుకువచ్చిన తరువాత వెనుకనుండి దాడి చేయవచ్చు. ఆ ప్రమాదాన్ని నివరించడమేలాగ?

ఆ విషయమై అందరు నాయకులు ఆలోచించారు.

దేవగిరి సైన్యాలు ముందుకు రాకుండా వుండాలంటే ఆనెగొంది సైన్యాలు వాటి నెదుర్కొనడానికి సిద్ధంగా వుండాలి. హోయసల సైన్యాలు తీరాంధ్ర సైన్యాలతో చేరాలి. అప్పుడు దేవగిరి సైన్యాలు సుల్తానుకు సాయపడకుండా వేరుచేయవచ్చు ననుకొన్నారు వారు.

ఆ చర్చలలో మరొక సమస్య తలెత్తింది. సుల్తాను ఓరుగల్లును చేరుకొంటూనే ఆ కోటను ముట్టడించాలా? లేక అతడు తీరాంధ్రంమీదికి వచ్చినప్పుడే ఎదిరించాలా? అని వారాలోచించారు.

కోటలో సుల్తానున్నప్పుడు అతణ్ణెదిరించడం కష్టం. ప్రమాదకరం. లేదా అతడు తీరాంధ్రంమీదికి వచ్చినప్పుడ తణ్ణెదుర్కోవడం మరీ ప్రమాదకరం. అతను కోటనువీడి కొంతదూరం వచ్చిన తరువాత, మరలా అతడు కోటలోనికి చేరుకోలేని స్థితిలో అతనిమీద బడితే బాగుంటుందని అనుకొన్నారు వారు. ఏమైనప్పటికీ పరిస్థితుల్ననుసరించి తుదినిర్ణయం గావించడానికి కాపయ్య నాయకునికి సంపూర్ణాధికారమిచ్చారు. వెంటనే ఆనెగొందికి, ద్వారసముద్రానికి తిప్పిపంపాలన్నారు.

ఆనెగొందికి వెళ్ళడానికి వేమారెడ్డిని, ద్వారసముద్రం వెళ్ళడానికి అనపోతనాయకుణ్ణి నియోగించారు.

అనపోతనాయకుడు ద్వారసముద్రం వెడుతూనే బళ్ళాలుడతనికి ఘనస్వాగతమిచ్చాడు. తప్పనిసరిగా తన సేనను పంపుతానని అతడు అనపోతనాయకునికి హామీనిచ్చాడు.

వేమారెడ్డివెళ్ళి హరిహరరాయల్ని, బుక్కరాయల్ని, సోమదేవరాజును, అన్నమదేవుణ్ణి విడివిడిగాను, అందర్నీ ఒకటిగాను చూచి సంప్రదింపులు జరిపాడు. తీరాంధ్ర నాయకుల నిర్ణయమే సరిగా న్నదని వారన్నారు. దేవగిరిసేనలనెదిరించే బాధ్యతను తాము వహిస్తామన్నారు.

కాపయ్యనాయకుని క్షేమాన్నిగూర్చి అన్నమదేవుడు పదేపదే ప్రశ్నించాడు. వేమారెడ్డి అతణ్ణిగూర్చి చెబుతున్నప్పుడెంతో ఆనందాన్ని పొందాడు. కాపయ్యనాయకుడు సుల్తానుతో పోరాటానికి వెళ్తుండే అతనిప్రక్కన నిలిచి పోరడడానికి తనకవకాశం కలుగనందుకు చాల చింతించాడు.

సుల్తాను ఓరుగల్లును చేరుకునేసరికి కాపయ్య నాయకుడు తన సేనలన్నిటినీ సిద్ధం చేసివుంచాడు, అతడు కోటను వీడివచ్చే సమయంకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

ఒకనాడు చారులువచ్చి ఓరుగల్లుపై మహామ్మారి విరుచుకొని పడిందని, దాని తాకిడికి వేలాదిమంది మరణించారని, కడకది ప్రజలను, సైనికులను, సైనికాధికారులనేగాక, సుల్తానునుగూడ ఓడించిందని, అతనేలాగో ఒకలాగు బ్రతికి బయటబడ్డాడని, వైద్యుల సలహానను సరించి ఢిల్లీకి వెళ్ళిపోతున్నాడని కాపయ్యనాయకునికి చెప్పారు. ఆ వార్త ఆ నాయకుని కమిత్యానందాన్ని కలిగించింది. ఇక సుల్తానుగొడవ తప్పినట్లేనని విశ్వాసం కలిగింది.

మరికొన్ని నాళ్ళకు ఓరుగల్లులో మహామ్మారి నిమ్మళించిందని, ఇప్పుడానగరంలో ఆ వ్యాధి ఏమాత్రంలేదని కాపయ్య నాయకునికి తెలిసింది. అప్పుడతని మనస్సులో ఒక ఆలోచన మెదిలింది.

ఓరుగల్లుపై ఇప్పుడు దాడి వెడలితే అదే సరియైన ఆలోచన అనిపించిందతనికి. వెంటనే హోయసలసేనలను, ఆనెగొంది సేనలను ఓరుగల్లు నగర మార్గంలో తనతో కలుసుకోవలసిందని విజ్ఞప్తులు పంపాడు. అన్నమంత్రితో చర్చించి వెంటనే సేనలను కదలడానికి సంసిద్ధంగా వుండవలసిందని హెచ్చరించాడు.

సుల్తాను ఢిల్లీ వెళ్ళిపోయాడన్న వార్త ఆనెగొందిలోను, ద్వారసముద్రంలోను ఎంతో ఆనందాన్ని కలిగించింది. ఇప్పుడు హఠాత్తుగా ఓరుగల్లును ముట్టడించాలని కాపయ్య నాయకుడు గావించిన నిర్ణయంగూడ వారికి చక్కగా నచ్చింది. గత కార్యక్రమంలో కలిగిన మార్పు అందరికంటె అన్నమదేవునికెంతో సంతోషాన్ని చేకూర్చింది.

హరిహరబుక్కరాయలిద్దరూ నగర నిర్మాణాన్ని పరిపాలనా వ్యవహారాలను చూస్తూవుండవలసి వచ్చింది. సోమదేవరాజుకిప్పుడే ఆరోగ్యం కొద్దిగా చెడింది. అందువల్ల ఆనెగొంది సేనలతో ఎవరు వెళ్ళాలి అనే సమస్య ఎదురయ్యింది.

అన్నమదేవుడు తాను వెడుతానని ముందుకు వచ్చాడు. అతని ఉత్సాహాన్ని చూచి హరిహరబుక్కరాయలిద్దరూ సమ్మతించారు. కాని సోమదేవరాజుకెందుకో భయంగలిగింది. ఎన్నడూ తనకలాంటి భయంతోచలేదు. తన సోదరుని శక్తిసామర్థ్యాలు, ధైర్యసాహసాలు, ప్రజ్ఞాప్రభావాలు అతనికి బాగుగా తెలుసు. ఏలాగ కంపలి సేనల్ని ఒంటరిగా ఎదిరించవలసిందో గూడ తెలుసు. కాని ఆనాడెందుకో అతనికి భయమనిపించింది. అయినప్పటికీ అతణ్ణి వద్దనడమెలా? తనకా ఆరోగ్యం సరిగా లేకున్నది. సేనకు నాయకత్వం వహించడానికి మరెవరున్నారు? అన్నమదేవుడు తప్ప. ఎంత భయంగావున్నా ఎంత బాధాకరంగావున్నా అన్నమదేవుణ్ణి పంపకతప్పడంలేదు అందువల్ల అతడు సోదరుణ్ణి పిలిచి సలహాలిచ్చి ఆశీర్వదించి పంపాడు. అన్నమదేవుడుత్సాహంతో వెడుతుంటే సోమదేవుని కళ్లు చెమ్మగిల్లాయి.

కాపయ్య నాయకుణ్ణిచూసే భాగ్యం, అతనితో మాట్లాడే అదృష్టం, అతనిప్రక్కన నిలబడి పోరాడే అవకాశం తనకు కలగనున్నందుకు అన్నమదేవుడెంతో సంబరపడ్డాడు. తన సైన్యాలను తరలించుకొని అనుకొన్నదానికంటె వేగంగా తీరాంధ్రసైన్యాలను చేరడానికి వెళ్లాడు.

ఆనెగొందిసైన్యాలు, హోయసలసైన్యాలు బయలుదేరాయని అవి త్వరత్వరగా తమ సైన్యాలను చేరడానికి అమితోత్సాహంతో ముందుకు వస్తున్నాయని తెలుస్తూనే కాపయ్యానాయకుడు తన సేనల్ని గూడ ముందుకు సాగమని ఉత్తరువులిచ్చాడు సేనలన్నీ చేరడానికి, నిర్దేశించిన ప్రదేశంవంకకు బయలుదేరారు.

కాపయ్యానాయకుడు నిర్ణీతప్రాంతానికి చేరిన కొన్ని గంటలలోనే హోయసలసైన్యాలు, ఆనెగొందిసైన్యాలు వచ్చిచేరాయి. ద్వారసముద్రసైన్యాలు కరాళనినాయకత్వం క్రింద వచ్చాయి. ఆనెగొంది సేనలు అన్నమదేవుని సేనాధిపత్యంక్రింద వచ్చాయి.

కాపయ్యానాయకుణ్ణి దగ్గరిస్తూనే అన్నమదేవుడు తన్నుతానే మరచి అతణ్ణి కౌగలించుకొనబోయి గుర్తుకొచ్చి హఠాత్తుగాఆగాడు. కాపయ్యానాయకుడు అన్నమదేవుని కరాన్నిబట్టి ఒత్తాడు. అప్పుడు అన్నమదేవుని మనస్సు పరవశించినట్లయింది.

అన్ని సేనలు పూర్తిగా సాయంసమయానికి ఆ ప్రాంతానికి చేరుకొన్నవి. ఆరాత్రి మూడుసైన్యాల నాయకులు, సేనానులు ఒకటిగా చేరి ఓరుగల్లుపై ఎలా ముట్టడిచేయాలి? అని చర్చించుకొన్నారు.

"మనమెంత రహస్యంగా హఠాత్తుగా ఓరుగల్లుపై దాడి చేయాలనుకొన్నప్పటికీ దీనినిగూర్చి ఇదివరకే వారికి తెలిసివుంటుంది. అందువల్ల వారుతమబలాలను త్వరగా తెచ్చుకొనలేకపోయినప్పటికీ ఉన్న బలాలతోనే మనల్నెదిరించడానికి సంసిద్ధమవుతుంటారు. అందుకని మనం అజాగ్రత్తగా వుండడానికిగాని, ఓరుగల్లును సులభంగా ఆక్రమించవచ్చుననే అపోహలోగాని వుండకూడదు"అన్నాడు కాపయ్యానాయకుడు.

అతనితో అందరూ ఏకీభవించారు.

ఇక ఓరుగల్లు నెలా ముట్టడించాలో అన్నమంత్రి సలహా యివ్వాలని కాపయ్యానాయకుడన్నాడు.

అన్నమంత్రి రుద్రమ్మ కాలంనుండి ప్రతాపరుద్రుని కాలం వరకు కాకతీయసామ్రాజ్యాన్ని సేవించినవాడు. ఓరుగల్లులోనే నివసించినవాడు, ఓరుగల్లును రక్షించడానికెన్నోమార్లు పోరాడినవాడు, అందువల్ల ఆ నగరానికి సంబంధించిన రహస్యాలన్నీ అతనికి తెలుసు దానిచుట్టూ ఉన్న కోటగోడల బలాబలాలన్నీ తెలుసు. అందువల్లనే ఆ నాయకుడు అన్నమంత్రి సలహానుకోరాడు.

అన్నమంత్రి నవ్వుతూ,—

"ఓరుగల్లుమీద దాడి చేయాలంటే, దానినాక్రమించాలంటే ముందు కంపదుర్గాన్ని, తరువాత మట్టిదుర్గాన్ని, రాజదుర్గాన్ని అధిగమించవలసివుంటుంది." అంటూ చెప్పనారంభించాడు.

"కంపదుర్గమంటే అగడ్తలో కర్రలు కంపలు వేసి మండిస్తారు. అప్పుడామంటలు ఒక దుర్గం లాగా అభేద్యంగా వుంటాయి. ఆ మంటలలో నూనెలనుగూడ పోస్తారు. గంధకంలాటి పదార్థాలను గూడ వేస్తారు. ఇది కాకతీయుల పోరాటపద్ధతి"

ఆ దుర్గాన్ని శత్రువులధిగమిస్తే ఆమీద మట్టిదుర్గాన్ని, రాతిదుర్గాన్ని, రాజదుర్గాన్ని అధిగమించాలి. అంతవరకు ఆ నగరం స్వాధీనంగాదు.

అంతేగాదు. త్వరగా ఆ నగరాన్ని పట్టుకోకపోతే దేవగిరినుండి ముట్టడిని ఎదుర్కోవలసివుంటుంది. అందువల్ల మూడు పక్కలనుండి నగరాన్ని ముట్టడించాలి." అని అన్నాడు అన్నమంత్రి.

ఆ తరువాత ముట్టడి వివరాలనుగూర్చి చర్చించారు. ఎవరెచ్చటనుండి పోరాడాలి? అన్న విషయాన్నిగూర్చి గూడ చర్చించి నిర్ణయించుకొన్నారు. (సశేషం)

# ప్రభాతగానం

శ్రీ యర్రమిల్లి చలపతిరావు శ్రీవత్సవ

ప్రత్యూషపవనాంకురాలు పైకొంటున్న వేళ
ప్రభాతగానం వినిపిస్తోంది దిక్కుల్లో
దీర్ఘ నిద్ర నుంచి లోకం మేల్కొంటున్న ఈ వేకువలో
దిక్కులు స్పందిస్తున్నాయ్, సంగీతంతో.

తురాయి చెట్టు కొమ్మమీద పిగిలి పిట్ట స్వైరం
విరామ సంకేతంలా గొంతు విప్పింది ఆనందంతో
ప్రాగ్దిశాకాశపు చీకటి తెరలలోంచి
ప్రస్ఫుటంగా మెరుస్తోంది ఉదయ తార.

సముద్రం మీద నుంచి వచ్చే సాగర సంగీతం
మహోదయాన్ని సూచిస్తూ మంగళగీతం పాడుతోంది
కోటి సూర్యులు ఉదయిస్తున్న మహోదయ ప్రభలతో
అవతరిస్తోంది దివి నుంచి భువికి, ఒక మహా తేజః పుంజం.

సుప్త చైతన్య స్థితిలోని పృథివీ భూతం చెవుల్లో
సప్తాశ్వ రథగమనం స్పష్టంగా వినిపిస్తోంది
గాఢ నిద్రలోంచి మేల్కొంటున్న లోకం ఆవలిస్తున్నట్టు
ఉషఃకాల మందమారుతం మెల్లగా వచ్చింది.

అరుణ రాగ రంజితమైంది ఆకాశం.
భగవానుని కరుణా రసం పృథివి మీద వెల్లి విరుస్తున్నట్టుగా
బంగారు కిరణాల కాంతివలయాలు నలు దిక్కులా
శృంగార వల్లికలు రచిస్తున్నాయి.
భేరీ నినాదాలు వినిపిస్తున్నాయి దిక్కుల్లో.
శంఖారవాలు చెలరేగుతున్నాయి గర్భాలయాల్లో
దేవాలయాల ఆవరణలనుండి వినవచ్చే జే గంటల మ్రోతలు
రింగుమంటూ, దిశాంచలాల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.
నిజంగా ఇదొక మహా ప్రభాతం కావొచ్చు.
నిస్సందేహంగా ఇదొక మహోదయం కావచ్చు.

మంగళ వాద్యాల సన్నాయి సంగీతం,
మంద మందంగా, హాయిగా, మధురంగా
మగత నిద్రలో వింటున్నాను, తీయగా
ఏనాటివో, బాల్యంలోని సుప్రభాతాలూ, మేలుకొలుపులూ
కల గంటున్నాను, కవినై, ఈ వేకువలో.

కలలు ఫలిస్తాయంటారు మనదేశపు దైవజ్ఞులు
కలలు కల్లలంటారు, మెటీరియలిస్టు తత్వజ్ఞులు
కల్లలైతే అవనీ, ఫలిస్తే ఫలించనీ
నిజాన్ని కలగనడమే కవిత్వం యొక్క తత్వం

మహాకవుల కలలు ఏనాటికైనా ఫలించక పోవు
మనందరి చిరస్వప్నమూ అయిన నవ సమాజ స్థాపన
కాస్త వివరంగా చెప్పాలంటే సమ సమాజ స్థాపన!

మనం చూస్తుండగానే ఒక శుభ క్షణాన
వేకువలేని ఈ నితాంత నిశ్శబ్ద నీరవనిశీధి
జాతి జీవన నిశీధి,
మహా ప్రభాతమై వెలసిల్లక తప్పదు!
మహోదయమై భాసిల్లక తప్పదు!

గాఢ నిద్రా మగ్నమైన జనత ఇప్పుడిప్పుడే
కళ్లు విప్పి మేల్కొంటున్నది
నవ నవోన్మేషకాంతులతో ఆకాశం ఇప్పుడిప్పుడే,
రెక్క విప్పుకుంటున్నది.

రానున్నది! ఒక మహోదయం!
రానున్నది ఒక మహాయుగం.

# మహాభారతము

తొమెగంటుల లక్ష్మణశాస్త్రి

68

## ధర్మరాజు చింతించుట

కర్ణుని ప్రతిజ్ఞ దూతల ముఖమున విని ధర్మరాజు చింతించెను. అభేద్యమైన కవచముగల కర్ణుని ఓడించుట అసాధ్యమని తలచెను. దుర్యోధనుడు సుఖముగా రాజ్యమేలుచు ధనమునకు త్యాగభోగములే ఫలమని తలచి విరివిగా దానముచేయుచు ఆనందముతో సర్వ సౌఖ్యములను అనుభవించుచుండెను. ధర్మరాజు బహు సర్పమృగాకీర్ణమైన ద్వైతవనమును విడిచి పోవ దలచుచుండెను.

ఒకరాత్రి స్వప్నమునందు ధర్మరాజునకు ద్వైతవనమందలి వన్యమృగములు కన్నీరు గార్చుచు కనపడెను. అదిచూచి యుధిష్ఠిరుడు 'మీరెందులకిట్లు దుఃఖించుచున్నారు? ఏమి కష్టము మూడినది?' అని ప్రశ్నించెను. అవి యిట్లనెను:— "రాజా! మీవల్ల మా మృగకులములన్నియు నశించినవి. బీజమాత్రముగా మిగిలియున్నాము. నీ తమ్ములు మహావీరులు, వేటతో మా కులములన్నింటిని సంహరించిరి. మాపైన దయచూపగలరు. ఈ మిగిలిన వారినైనను వృద్ధిచెందనీయుడు". ఆ మాటలు విని ధర్మసుతుడు జాలిపడి తెల్లవారిన తరువాత తమ్ములతో స్వప్న వృత్తాంతము తెలిపి "మనమీ ద్వైత వనమునకు వచ్చి ఒకసంవత్సరము ఎనిమిది నెలలయినది. ఇక ఇక్కడినుండి మరుభూమిలోనున్న కామ్యక వనమునకు తరలిపోవుదము" అని చెప్పి తమ్ముల తోను బ్రాహ్మణులతోను పరివారముతోను ధర్మరాజు కామ్యక వనమునకు పోయి అక్కడ తృణబిందు సరస్సువద్ద నివాసమేర్పరచుకొనెను. అచట తృణబిందు మహాముని తపస్సు చేయుచున్నందుచేత ఆ సరస్సునకు ఆ పేరు వచ్చినది.

పాండవుల వనవాస మిప్పటికి పదకొండు సంవత్సరములైనది. ఈ కాలమంతయు వారు అతి కష్టముతో గడిపిరి. సుఖమనుభవించ వలసిన వారు కాలాను సారముగా సంభవించిన దుఃఖమును అనుభవించిరి. యుధిష్ఠిరుడు తన అపరాధమువలన తమ్ములకు, భార్యకు చాల దుఃఖము గలిగెనుగదా! యని చింతించుచు రాత్రులు నిద్రలేకయుండెను. జూదములో జరిగిన దుష్టత్వము, కర్ణుడప్పుడాడిన దుర్భాషణములు శల్యములవలె మనస్సునకు గ్రుచ్చుకొనుచుండగా దీనుడై ధర్మరాజు అతి ఘోరమైన తన కోపవిషమును భరించి సహించి యుండెను. తమ్ములు, భార్య, యుధిష్ఠిరుని చూచి తమ దుఃఖమును అణచుకొనుచుండిరి. ఇక మిగిలిన వనవాస కాలము అల్పమేకదా యని తలచి వారు తమ ఉత్సాహముతో కోపముతో కూడిన చేష్టలతోను తమ శరీరములను పూర్వమువలె కాక వేరువిధముగానే చేసికొని బలవంతులుగా నుండిరి.

## వ్యాసుని ధర్మబోధ

ఇట్లు కొంతకాలము గడవగా వారిని చూచుటకు వ్యాస మహాముని వచ్చెను. ఆ మునిని ఎదుర్కొని ధర్మరాజు స్వాగత సత్కారములు చేసి సుఖాసీనుని చేసెను. పాండవులందరూ వ్యాసుని ఉపాసించుచు కూర్చుని యుండిరి. అట్లు దుఃఖార్తులై, వనవాసక్లేశము ననుభవించుచు కృశించియున్న మనుమలనుచూచి వ్యాసుడు దయగలవాడై బాష్ప గద్గద స్వరముతో నిట్లనెను:—

"యుధిష్ఠిరా! తపస్సు చేయనివారు లోకములో మహాసుఖమును అనుభవింపజాలరు. నీవు ధర్మాత్ముడవు. నీకు తెలియని ధర్మములులేవు. పురుషునకు సుఖ దుఃఖములు పర్యాయముగా ఒకటివెంట నొకటి కలుగుచుండును. ఎవడుకూడ అనంతమైన సుఖమును పొందజాలడు. ఉత్తమ బుద్ధిగల జ్ఞానియైనవాడే ఉదయాస్తమయముల తత్వమువంటి సుఖ దుఃఖములను గ్రహించ గలడు. అట్లే సృష్టి—స్థితి—లయములకు అధిష్ఠానభూతుడైనవాడు పరమాత్ముడే యని గ్రహించి యెప్పుడుగూడ హర్ష — శోకములకు వశుడుకాడు. సేద్యగాడు ఏ కాలమునకు ఏ పంట పండిన, దానితో తృప్తి చెందుచు పంటలు పండినప్పుడనుభవించుచు, కరువు-కాటకములను సహించుచు నుండునట్లే దేహిగూడ తనకు గలిగిన సుఖమును అనుభవించుచు దుఃఖమును సహించుచు నుండుట తగును. కాలానుగుణముగా సుఖదుఃఖములు వచ్చుచుండును. అంతమాత్రములో ధీరుడు చలించకూడదు. తపస్సుకన్న మించినది లేదు. తపస్సుచే చాల గొప్ప సుఖశాంతులను పొందవచ్చును. తపస్సుచేత సాధింపరాని దేదియు లేదు అని తెలిసికొనుము. మహారాజా! "సత్యము సరళభావము, అక్రోధము, దేవతలకు అతిథులకు అర్పణచేయగా మిగిలిన అన్నము భుజించుట, ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము గలిగియుండుట, ఇతరుల దోషములను చూడకుండుట, అసూయ లేకుండుట, హింసచేయకుండుట, వెలుపలను, మనస్సులోను పరి

శుద్ధముగా నుండుట, జ్ఞాన-కర్మేంద్రియములను పదింటిని అణచుకొని యుండుట.'' ఇవి పుణ్యాత్ముల సద్గుణములు. ఈ గుణములు గల వారందరు పవిత్రులుగానే భావించబడుదురు.

"అధర్మమునందు రుచిగలిగిన మూర్ఖులు పశు పక్షి మృగాదులుగా జన్మించెదరు. ఎప్పుడుగూడ వారు సుఖమును పొందజాలరు. ఈ జన్మములో ఇక్కడ చేసిన సుకృతమే పరలోకమునందు సుఖానుభవమునకు హేతువగును. కనుక పురుషుడు తన శరీరమును తపస్సునందు నియమ పాలనమునందు ప్రవేశింపజేయవలెను. అతిథి, వచ్చినప్పుడు తనకు ఉన్న దానిలో యథాశక్తి అతనికి ఇచ్చి పూజచేసి నమస్కరించవలెను. సత్యవాది యైనవాడు దీర్ఘాయువును, సుఖమును, సరళత్వమును పొందగలడు. కోపము లేని వాడు అసూయ పడనివాడు శాశ్వతమైన మోక్ష సామ్రాజ్య సుఖమును పొందగలడు. బహిరింద్రియ-అంతరింద్రియ (మనస్సు) నిగ్రహము గలవాడు దుఃఖమును పొందడు. శమదమాదులు గలవాడు ఇతరుల సంపదను చూచి పరితాపము చెందడు. దేవతలకు అతిథులకు అర్పించగా మిగిలిన దానిని భుజించు వానికి నిండుగా సుఖసామగ్రి లభించును. దానము చేయువాడు సుఖమును అనుభవించును. ప్రాణిహింస చేయనివాడు గొప్పకులములో జన్మించును, జితేంద్రియుడు దుర్వ్యసనములలో పడడు. అతడు ఇహపర లోకములలో సుఖమును అనుభవించును. శుభమునందే ఆసక్తి గలవాడు మరణించిన తరువాత శుభ కర్మాచరణబుద్ధి గలవాడై తిరిగి జన్మించును." ఆ ఉపదేశమును విని యుధిష్ఠిరుడు వ్యాసమునితో నిట్లనెను. "మహాత్మా! దాన ధర్మము-తపస్సు ఈ రెండిటిలో ఏది పరలోకమునందు ఫలము అధికముగా నిచ్చును? దాన-తపస్సులలో ఏది దుష్కరము? దయయుంచి తెలుపుడు." ఆ మాటలకు వ్యాసమహాముని యిట్లు చెప్పదొడగెను.

## దాన మహిమ

"నాయనా! దానము చేయుటకన్న దుష్కరమైన పని మరి యొకటి లేదు. ఎందుకనగా లోకులకు ధనలోభము ఎక్కువగా నుండును. ధనము అతి కష్టముతో సంపాదింపబడును. దానిని విడువజాలరు. జనులు ధనాశచేత ప్రియమైన ప్రాణములపైన గూడ ఆశవదలి సముద్రములో రత్నములు అడవులలో ధనము లభించునని అచట తిరుగుచుందురు. కొందరు తమ జీవికకై కృషికర్మను గోరక్షణమును చేసెదరు. మరి కొందరు సేవా వృత్తిలో దూరదేశములకు గూడ పోయెదరు. వీరందరు ధనార్థులై ఆ పనులను చేసెదరు. కనుక యుధిష్ఠిరా! కష్టము లనుభవించి సంపాదించిన ధనముపైన మిక్కిలి ప్రేమ గలవారై దానిని విడువ జాలరు. కనుక అన్ని ధర్మముల కన్నను దానమే అతి దుష్కరముసుమా! దానము చేయుటలో విశేషమేమనగా న్యాయ మార్గములో సంపాదించిన ధనమును పుణ్యకాలములలో పుణ్యదేశములలో సత్పురుషులకు దానము చేయుట యోగ్యము. అన్యాయముగా సంపాదించిన ధనమును దానము చేసిన వానిని ఆ దాన ధర్మము నరక భయమునుండి కాపాడజాలదు. పుణ్య కాలములందు సత్పాత్రులకు పరిశుద్ధ మనస్సుతో చేసిన దానము స్వల్పమైనను పరలోకములో అనంత ఫలమును ఈయగలదు అని ధర్మ శాస్త్రములు చెప్పుచున్నవి. పూర్వము ముద్గలుడు అను మహాముని ఒక తూమెడు ధాన్యము దానము చేసి పొందిన మహాఫలమును గూర్చిన యితిహాసము చెప్పెదను.

## ముద్గలుని దానధర్మము

కురుక్షేత్రమునందు 'ముద్గలుడు' అను ఋషియుండెను. అతడు మహాధర్మాత్ముడు, జితేంద్రియుడుగ నుండెను. అతడు 'శిల' వృత్తితో (పైర్లు కోసిన పిదప పొలములలో పడియున్న వరి గోధుమ వెన్నులను 'కాడలు' లీసికొని వచ్చి వాటికొనలను అంటుకొనియున్న గింజలను ఏరుకొనుట) 'ఉంఛ' వృత్తితోను (పైర్లు కోసిన పిదప పొలములలో రాలి పడియున్న గింజలను గాని, అంగడి వీధిలో ధాన్యము అమ్ముడు పోయిన తరువాత ఆ ప్రాంతములో పడి యున్న గింజలను గాని యేరుకొనుట, జీవికను నిర్వహించుచుండెను. అతడు జితేంద్రియుడు. మహాధర్మాత్ముడు. సత్యవాది. ఈర్ష్యాసూయలు లేనివాడు. అతిథులను సత్కరించు దీక్షగలవాడు. కర్మ నిష్ఠుడుగా ఉండి 'కపోత వృత్తిని' (అవశ్యకమైన అహారము కన్న అధికము కూర్చుకొనకుండుట) ఆశ్రయించి జీవనము గడుపు చుండెను. అతడు తన పుత్రునితో, పత్నితోను కలిసి పదునైదు దినములకొక సారి కపోతము (పావురము) ధాన్యమును ఏరుకొనునట్లుగా ఏరుకొని ఆ ధాన్యముతో ఇష్టి కృత్యము, అను యజ్ఞమును చేయుచుండెను. ఇష్టి కృత్యమనగా పూర్ణిమ-అమావాస్య దినములందు పక్షమున కొక సారి చేయు యజ్ఞము. ఆ నాడే ఆ మువ్వురు గూడ భోజనము. ఈ విధముగా ఆ కుటుంబము వారు పక్షములకు ఒక సారి పూర్ణిమ, అమవాస్యలందు భోజనము చేయుచు ఒక్కిన దినములందు ఉపవాసము చేయుచుండెడివారు. ఈ విధముగా రెండు 'దర్శ' (అమావాస్య) పూర్ణిమా యజ్ఞములు చేసి దేవతలను తృప్తి పరచుచు మిగిలిన ఆహారముతో అతిథులను తృప్తి పరచుచు ఆ తరువాత మిగిలిన అన్నమును తాను భార్యాపుత్రులతో పక్షమున కొకపర్యాయము భుజించి జీవించుచుండెను. అతనికి ఎవరి యెడల కూడ మాత్సర్యము లేకుండెను. ఆ ముని యిచ్చు హవిర్భాగమును ఇంద్రుడు దేవగణములతో స్వయముగా వచ్చి ప్రత్యక్షముగా గ్రహించుచుండెను అట్లే పక్షమునకొక పర్యాయము సంతోషపూర్వకముగా అతిథులకు సంతర్పణ చేయుచుండెను. ఇట్లు ఒక తూమెడు ధాన్యముతో దేవతలకు అతిథులకు తృప్తి చేయుచున్న ఆ ముద్గలమునికి ఆ సంతర్పణనాడు అతిథు లెవరైనను ఎక్కువ సంఖ్యలో వచ్చినప్పుడు ఆశ్చర్యమేమనగా, ఆ వచ్చిన అతిథులకు సరిపడు ధాన్యము అతని యింట వృద్ధి చెందుచుండెను. వందల కొలది అతిథులు వచ్చినను సరిపడు ధాన్యము వృద్ధి చెందుచుండెను. అతని దానధర్మ మహిమ అట్టిది.

## దుర్వాసుడు ముద్గలుని పరీక్షించుట

ఈ సంగతి విని దిగంబర వేషముతో దుర్వాసుడు ఒకసారి ముద్గలుని ఆశ్రమమునకు అతిథిగా వచ్చెను. దుర్వాసుడు శిరస్సు ముండనము చేయించుకొని వికారవేషముతో దుర్భాషలు మాట్లా

డుచు ముద్గలుని సమీపించి అన్నార్థినై వచ్చినానని చెప్పెను. ముద్గలముని అతనిని ఎదుర్కొని అర్ఘ్యపాద్యాదులతో పూజించి అతనికి అన్నము పెట్టెను. ఉన్మత్తుడుగానున్న దుర్వాసుడు తృప్తిగా వండిన అన్నమంతయు తానొక్కడే భుజించి మిగిలిన యెంగిలి అన్నముతో శరీరమంతయు లేపనము చేసుకొని వెడలిపోయెను. ఈ విధముగా దుర్వాసుడు ఆ తరువాత పక్షము రోజులకు గూడ వచ్చి ఉంఛవృత్తితో ముద్గలుడు సంపాదించిన అన్నమంతయు తానొక్కడే భుజించిపోయెను. ముద్గలుడు ఏ మాత్రము మనో వికారము చెందక ఉపవాసముతోనే తిరిగి ఉంఛవృత్తి చేయుచుండెను. అతనికి కోపముగాని మాత్సర్యముగాని దుర్వాసుని యెడల కలుగ లేదు. దుర్వాసుడు ముద్గలుని ధైర్యమును పరీక్షించుటకు ఆ విధము గానే ఆరు పర్యాయములు ఆరు పక్షములకు వచ్చి అన్నమంతయు తిని పోవుచుండెను. ఇంత చేసినను శుద్ధసత్వ స్వరూపుడగు ముద్గలుని మనస్సులో ఏ విధమైన వికారభావముగూడ దుర్వాసునికి కనబడలేదు. అది చూచి దుర్వాసుడు ఆశ్చర్యపడి ముద్గలునితో నిట్లనెను:—

"మహాత్మా! మాత్సర్యములేకుండ దానము చేయుటలో నీతో సమానుడు ఈ లోకములో మరియొకడు లేడు. ఆకలి యనునది గొప్ప మహాత్ములకు గూడ ధర్మజ్ఞానము పోగొట్టును. ధైర్యమును లాగివేయును. రుచిని అనుసరించు జిహ్వ సర్వదా రుచికరములైన వస్తువులపైపే ఆకృష్టమగును. ఆహారముచేతనే ప్రాణరక్షణము కలుగును. చంచలమైన మనస్సును నిగ్రహించుటకు సాధ్యముకాదు. మనస్సు–ఇంద్రియములు–వీటి యేకాగ్రతయే నిశ్చలమైన తపస్సు అనబడును. శ్రమపడి సంపాదించిన వస్తువును విడుచుట చాల దుఃఖకరమగును. నీవు ఆర్జించిన ఆహార ధాన్యమునంతయు పరిశుద్ధమైన మనస్సుతో త్యాగము చేసితివి. నీచేత మేము అనుగ్రహింపబడితిమి. నిన్ను కలుసుకొని తృప్తి చెందితిమి. ఇంద్రియ జయము, ధైర్యము, దేవతలను అతిథులను తృప్తి పరచిన తరువాత మిగిలిన దానిని సంతృప్తితో అనుభవించు సద్గుణము, బహిరింద్రియ నిగ్రహము, మనోనిగ్రహము, దయ, సత్యము, ధర్మము ఈ సద్గుణములన్నియు నీయందు ప్రతిష్ఠితములై యున్నవి, విశుద్ధసత్వగుణసంపన్నుడు నీవుతప్ప మరియెవరు ఏ లోకమునను లేరు. నీసత్కర్మలచేత అన్ని పుణ్యలోకములను జయించితివి. ఉత్కృష్టమైన పరమపదమును పొందితివి. ఆహా! స్వర్గలోకవాసులు గూడ నీ దానధర్మమును సర్వత్ర ఉద్ఘోషించి ప్రకటించిరి. నీపుణ్యకర్మఫలముగా నీవు సశరీర స్వర్గ సుఖమును పొందగలవు."

అని యిట్లు దుర్వాసుడు అనుచుండగనే దేవదూత విమానముతో ముద్గలుని వద్దకు వచ్చెను. ఆ విమానము హంస–సారసపక్షుల తోను, గజ్జెల చప్పుళ్లతోను, విచిత్రమైన దివ్యగంధముతోను విరాజిల్లుచు కామగమనము ( ఇష్టము వచ్చిన చోటికి పోవుట ) గలదై యుండెను. "మహాత్మా! నీవు ఉత్కృష్టలోకములను పొందితివి. నీ సత్కర్మలచే లభించిన యీ దివ్యవిమానములో ఎక్కుము," అని దేవదూత పలికెను. ఆ మాటకు ముద్గలుడిట్లనెను:—"దేవదూతా! నీ నోటినుండి స్వర్గలోకవాసుల గుణములను వినగోరుచున్నాను. వారికి ఏయే గుణములు ఉండును? వారు ఎట్టి తపస్సు చేసిన వారు? వారి నిశ్చితమైన భావములెవ్వి? స్వర్గములో ఎట్టి సుఖము ఉండును? అక్కడ ఉన్న దోషములెవ్వి? సత్పురుషులతో ఏడు అడుగులు నడిచినను, ఏడు మాటలు మాట్లాడినను మైత్రి యేర్పడునుగదా! కనుక నీ యెడల నాకు ఇప్పుడు కలిగిన మైత్రిని పురస్కరించుకొని అడుగుచున్నాను. ఈ ప్రశ్నలకు సత్యము–హితకరము నైన ఉత్తరమును ఏ మాత్రము విచారించక నాకు చెప్పుము. నీ మాటలు వినిన తరువాత స్వర్గమునకు వచ్చుటను గూర్చి నానిశ్చయము నీకు తెలిపెదను." ముద్గలముని మాటవిని దేవదూత యిట్లు ఉత్తరము చెప్పసాగెను:—

## స్వర్గములోని గుణదోషములు

"మహర్షీ! నీ బుద్ధి చాల ఉత్తమమైనది. ఏ స్వర్గసుఖము కొరకు ఇతరులు ప్రాకులాడుచు అది చాల ఉత్తమమని తలచుచుందురో అది నీకిపుడు సంప్రాప్తమైయున్నది. దానిని బహుమాన పూర్వకముగా స్వీకరించక అజ్ఞానివలె దానిలోని గుణదోష విచారము చేయుచున్నావు. స్వర్గమును 'ఊర్ధ్వలోకము' అనెదరు. అది చాల పైనను న్నది. అక్కడికి చేరుటకు పైకి పోవలసి యుండును. గనుక దానికి 'ఊర్ధ్వగమనము' అని పేరు గూడ కలదు. ఆ మార్గము చాల ఉత్తమము. అక్కడివారు సర్వదా విమానములలోనే తిరుగుచుందురు. తపస్సు చేయనివారు, యజ్ఞములు చేయనివారు, అసత్యవాదులు, నాస్తికులు (వేదశాస్త్రములు–దేవుడు లేడు అనువారు) స్వర్గలోకమునకు పోవజాలరు. ధర్మాత్ములు, జితేంద్రియులు, శమదమాది సంపన్నులు, ఈర్ష్యాసూయలు లేనివారు, దానధర్మపరులు, యుద్ధవీరులు మాత్రమే అక్కడికి పోవగలరు. అక్కడ, దేవతలకు, సిద్ధ–సాధ్య–గంధర్వ–అప్సరస ఇత్యాదులకు వేర్వేరు స్థానములు కలవు. ఇచ్ఛానుసారముగా వారు ఆలోకములలో సంచరించుచుందురు. అచ్చటివారు సర్వదా ప్రకాశమానులై కామగమనము కలవారై ఉందురు. ముప్పదిమూడువేల ఆమడలు వైశాల్యము గల సువర్ణమయ మేరుపర్వతము అక్కడ ఉన్నది. దానిపైన నందనము మొదలైన దేవోద్యానములు కలవు. పుణ్యకర్మలు చేసినవారు విహరించుటకు వేరుగా స్థానములు కలవు. అక్కడ ఆకలి దప్పులు, శ్రమ–శీతోష్ణముల బాధ, భయము ఏవిగూడ ఉండవు. అసహ్యకరము, అశుభము–నైనవస్తు వేదియు నుండదు. పరిమళము, సుఖస్పర్శము గల వాయువులు సర్వదా వీచుచుండును. చెవులకు –మనస్సునకు ఇంపైనధ్వనులు అంతట వినుపించుచుండును. స్వర్గమునందు శోకము, ముసలితనము, అలసట, దుఃఖకరమైన విలాపములు ఉండవు. మహామునీ! తాను చేసిన కర్మలు కారణముగా, పుణ్యవంతులైనవారు ఇటువంటి స్వర్గలోకమును చేరెదరు. స్వర్గవాసుల శరీరములు ధగధగ మెరయుచుండును. వారిశరీరములు మాతా పితరుల వలన పుట్టినవికావు. కేవలము వారు చేసిన పుణ్యకర్మల వలననే అవి పుట్టినవి. స్వర్గవాసుల శరీరములను చెమట, దుర్గంధము, మలమూత్రములు, రజోదర్శనము (స్త్రీలకు) ఇవి యేవియు బాధించవు. దివ్య పరిమళయుక్తములు, మనోహరములు, ఎప్పుడుగూడ వాడిపోకుండునవియు నైన పుష్పమాలికలచే సుశోభితములగు విమానములలో స్వర్గవాసులు తిరుగుచుందురు.

అక్కడి వారికి ఈర్ష్య, శోకము అలసట, మోహము, మాత్స ర్యము ఇవియేవియు నుండవు. సుఖముగా నుందెదరు.

"మహాముని! ఇప్పుడు చెప్పిన స్వర్గలోకమునకు పైన మరి యెన్నియో పుణ్యలోకములు గలవు. ఆ యన్నిటిపైన బ్రహ్మలోక మున్నది. అది అత్యంత మంగళకరము-అక్కడ మహామునులు ఉండెదరు. అక్కడనే దేవతలకు గూడ పూజ్యులైన 'ఋషులు' అనువారలు ఉందురు. దేవలోకముకంటే అది ఉత్కృష్టము దేవతలు గూడ యజ్ఞములద్వారా ఆ ఋషులను పూజించుచుందురు. ఆ లోకము స్వయం ప్రకాశము, అన్ని కోరికలు నెరవేర్చునదిగా నుండును. అచటివారికి స్త్రీలకొరకైన సంతాపము ఉండదు. ఇతరుల సంపదలను చూచి అచటి వారికె ఎప్పుడునూ అసూయ కలుగదు. వారికి దేవతలవలె యజ్ఞములోనిచ్చు ఆహుతులచేత కాని, అమృత పానము చేసికాని జీవికా నిర్వహణము చేయవలసిన ఆవశ్యకత ఉండదు. వారిశరీరము జ్యోతిర్మయము. వారికి విశిష్టమైన ఆకారము ఏదియు ఉండదు. అక్కడివారు సనాతనులైన దేవదేవుం గనుక వారికి సుఖేచ్ఛలేదు. యుగములు మారినను వారిలో మార్పు రాదు. జరా మరణములు లేక సర్వదా హర్ష-ప్రీతి-సుఖములతో అలలాడుచుందురు. సుఖ-దుఃఖ, రాగ-ద్వేషాదులగు ద్వంద్వము లకు వారు అతీతులు. స్వర్గవాసులు గూడ ఆ ఋషులలోకమును కాంక్షింతురు.

అది పరాసిద్ధియొక్క పరమావస్థ. అత్యంత దుర్లభమైనది. లౌకిక విషయ భోగాసక్తిగలవారు అక్కడికి చేరజాలరు. ఈముప్పది మూడు దేవతల లోకములకు తపస్సు దానములుచేసిన వారే పోగలు గుదురు. ముద్గలమహాముని! నీవు అనేక దానములుచేసి యీ సంప దలన్నియు సుఖముగా పొందినావు. నీ పుణ్యకర్మల ద్వారా సంపా దించిన యీ సంపదను తపోమహిమచేత ప్రకాశించు నీవు అనుభవిం చుము. స్వర్గసుఖమును గూర్చియు, నానావిధ లోకములను గూర్చియు, స్వర్గగుణములను గూర్చియు నీకిప్పుడు చెప్పినాను. ఇక స్వర్గమునందలి దోషములను గూర్చి వినుము:—

"ఈ లోకమునందు పురుషుడు చేసిన పుణ్యఫలమునే అచట అనుభవించునుగాని అక్కడ ఏలాటి కర్మము చేయడు. ఆ సుఖము నకు మూలభూతమైన పుణ్యమును వ్యయపరచుచు అవి తీరిన తరు వాత తిరిగి యీలోకములోకి పడిపోవును. స్వర్గలోకమునందు గూడ ఉచ్చనీచభావము కలదు. తమ కర్మఫలము ననుసరించి నీచస్థితి యందు ఉన్నవారు తమకన్న ఉన్నతస్థితిలో ఉన్న ఉత్తమపుణ్యాత్ము లను చూచి అసంతుష్టిచెందుచుందురు. పుణ్యము క్షీణించిన తరువాత స్వర్గమునుండి క్రింద పడుచున్నవారికి చైతన్యము లోపించి మోహము ఆవరించును. వారు ధరించిన పుష్పమాలలు వాడిపోవును. అది వారు క్రిందపడుటకు సూచనగా నుండును అది చూచి వారు భయము చెందుదురు.

"బ్రహ్మలోక పర్యంతము ఈ దోషములన్నియు నుండును. స్వర్గవాసులగు పుణ్యాత్ముల గుణములు అనేక సహస్ర సంఖ్యలో నుండును. స్వర్గమునుండి క్రింద పడిన వారిలో ఒక సుగుణము మాత్రము కనపడుచున్నది. అది యేమనగా, అతడు తన పూర్వ పుణ్య వశమున భూలోకమునందు తిరిగి మనుష్యుడుగా జన్మించును. అందులోగూడ ఆ పుణ్యాత్ముడు సుఖము ననుభవించువాడుగానే పుట్టును. అట్లు పుట్టిన తరువాత మానవుడుగా తన కర్తవ్యమును అతడు తెలిసికొనకున్నచో అంతకన్న నీచ యోనిలో జన్మించును. మునీంద్రా! ఇక్కడ చేసిన కర్మమునే పురుషుడు అక్కడ అనుభ వించును. ఇది కర్మచేయు భూమి. అది ఫలమును అనుభవించు భూమి." దేవదూత మాటలువిని ముద్గలముని "స్వర్గమునందలి గొప్ప దోషములను చెప్పితివి. ఏ దోషములుగూడ లేని దేశమును గూర్చి వివరింపుము" అని యడిగెను. దేవదూత యిట్లు చెప్పెను:—

" మహాముని! బ్రహ్మలోకమునకన్నను పై భాగమునందు విష్ణు లోకము కలదు. అది పరిశుద్ధము, సనాతనము, జ్యోతిర్మ యము. ఆ లోకమును 'పరబ్రహ్మ' అని కూడ అనెదరు. ఆ లోక మునకు, విషయాసక్తులు, మోహము-కామక్రోధాదులుగలవారు చేరజాలరు. అహంకార-మమకార రహితులు, ద్వంద్వాతీతులు, ఇంద్రియనిగ్రహులు, ధ్యానయోగపరులు నగు మానవులు ఆ లోక మునకు పోవజాలుదురు. ముద్గల మహాముని! నీవు అడిగిన ప్రశ్న ముల కన్నిటికిని బదులు చెప్పితిని. ఇక మనము స్వర్గమునకు పోవుదము. దయయుంచి యీ విమానమును అధిష్ఠించుము" దేవదూత చెప్పిన మాటలన్నియు ముద్గలుడు మనస్సులో బాగుగా విమర్శించుకొని అతనితో నిట్లనెను:—

## ముద్గలుడు స్వర్గమును తిరస్కరించుట

"దేవదూతా! నీవు సుఖముగా తిరిగి మీ లోకమునకు పొమ్ము. మహాదోషయుక్తమైన స్వర్గము, స్వర్గసుఖము నాకు అక్కరలేదు. అక్కడినుండి క్రిందపడిన తరువాత అతి భయం కరమైన దుఃఖమును, పరితాపమును ప్రాణులు ఇక్కడ అనుభవిం చెదరు. కనుక స్వర్గమును నేను కోరను. ఏ చోటికి పోయిన తరువాత శోకము, బాధ, చంచలత్వము, ఉండవో ఆ స్థానమును అన్వేషించెదను" అని చెప్పి దేవదూతను పంపి మరల ముద్గలుడు శిలోంఛ వృత్తితో తన జీవనము గడుపుచు శాంతితో నుండెను.

(సశేషం)

# పిల్లలం

* వె. సుందరి *

" పిల్లలం మేం పిల్లలం నవభారత బాలలం మేం పిల్లలం
జాతిమతం భాషా భేదం లేనేలేదనే వారలం
చెట్టపట్టాలేసుకొని కలిసిమెలిసి తిరుగుతాం ॥పిల్లలం
చక్కని కథలూ, తీయని పాటలూ వేడుకతో మోదముతో
ఎప్పుడు వినేవారలం.
స్నేహానికి పంతాలకు ప్రాణాలొడ్డే వారలం
ముందడుగు వేస్తాం, వెనకంజ వేయం.
ఉత్సాహం, ఆనందం, వీరత్వం మా ధ్యేయం
భరతావనిని మేము తీర్చి దిద్ది చూపిస్తాం
సాధిస్తాం, బోధిస్తాం, జయిస్తాం మురిపిస్తాం ॥పిల్లలం॥

# విజయభేరి మ్రోగింది

" భారత వీర జవానుల్లారా విజయము మీదేనోయ్.
విజయము మీదేనోయ్,
పగలనకా రేయనకా ఎండనకా వాననకా
హోరాహోరి పోరాడే సిపాయిల్లారా, వీరుల్లారా, ధీరుల్లారా,
రణధీరుల్లారా,
విజయలక్ష్మిని వెంటబెట్టుకొని వేగముగా వేగముగా రండోయ్
జయ జయ భారత వీర జవానుల్లారా
విజయము మీదేనోయ్.
దేశం కోసం అసువులు బాసి,
వీరస్వర్గం పొందారా మీ జన్మ సార్థకం చెందారా,
విజయభేరీ మ్రోగిందీ...... భరతమాత మురిసిందీ. జయ॥

  

# చందమామ

చెప్పుమా ఓ చందమామ నీ కథ మా పాపకు,
గోరు గోరు ముద్దలు తినిపించు వేళ
మారాము చేసే మా పాపకు ॥చె॥
జాబిల్లివై వెలుగొందేవు, నెలరాజువై [illegible] చూపేవు.
చందమామవై విందు గొలిపేవు.
తారా ప్రియుడవు, కళా విభూషణుడవు.
చందమామవు, మా అందని వాడవు ॥చె॥
చిత్రసీమలో నీదు రూపము చిత్రకారులు చిత్రించినారు.
గగన సీమలో నీదు బింబము ఎవరు సృష్టించినారు?
చిత్రము, విచిత్రము నీదు చరిత్రము.
శృంగార రసపూర్ణ చంద్రుడవని కవులు నీపైన కవితలల్లినారు
రాగసుధామృత భాండమవని, గాయకులు నీదు
గానము చేసినారు.
విజ్ఞాన వేత్తలు, వినువీధిలో నిను వీక్షించినారని
విన్నవింప ఏది నిజం ? ఏది నిజం ?
నిక్కముగ మాకొక్కసారి వినిపించుమా ॥చె॥

# వేల్పుగొండ

శ్రీ ఎ. పండరినాథ్

ఒకప్పుడు "వేల్పుగొండ" ను "షహర్" లేదా 'జఫర్‌గడ్' అనే పేర్లతో పిలిచేవారు. దీనికే విజ్ఞానగరమని మరొక పేరుండెడిది. వేల్పుగొండ లేదా జఫర్‌గడ్ దుర్గం ఒక ఎత్తైన పర్వతంపై నిర్మింపబడింది. ఈ పర్వతానికి అగస్త్య మహర్షి పూజించిన సాలగ్రామమనే ప్రశస్తికూడా ఉన్నది.

ఈ పర్వతంపైన ఒక గుహలో యోగానంద నరసింహ స్వామి వెలిశాడు. ఆ తరువాత ఇచట ఆలయం నిర్మింపబడింది. ఈ ఆలయాన్ని ఆనుకొని పాదాల గుండం, కొంతదూరంలో స్నానాల గుండం ఉన్నాయి. స్వయంవ్యక్తుడైన స్వామి నేటికీ రెండుజాములవేళ ఈ గుండంలో స్నానమాచరిస్తాడని ప్రతీతి. ఈ యోగానంద నృసింహునకు చట్టుపంచ నృసింహము, వీర నృసింహము, లక్ష్మీనృసింహము, సుప్రసన్న నృసింహము, కొండ సింగరప్ప అనే పేర్లు గలవు. ఐదుపేర్ల నృసింహ దేవతలు వెలసినందున ఈ క్షేత్రాన్ని "పంచ నృసింహక్షేత్ర" మంటారు. ఈ పర్వతంపైన లోతైన జలాశయాలు, నూనె గుండాలు, పాల గుండం, అక్కచెల్లెండ్ల గుండం ఉన్నాయి.

దీనికి పశ్చిమంగా మరో ఎత్తైన పర్వతం ఉన్నది. దీని పైకి వెళ్లడానికి రహస్య మార్గాలున్నాయి. వీనినే నేలబొయ్యారాలంటారు. ఈ కొండపై నిర్మించిన కోట గోడలు నేటికీ చెక్కు చెదరకుండా ఉన్నాయి. ఈ కోటలో ఆనాడు ఫిరంగులు, తుపాకులు, మందు గుండు సామగ్రి, సైన్యం మాత్రమే ఉండేవి.

ఈ రెండు పర్వతాల క్రిందనే షహర్ వెలిసింది. అదే ఈనాడు 'జఫర్‌గడ్' పేరుతో వ్యవహరింపబడుతున్న గ్రామం. ఈ షహర్ చుట్టూ మూడు ద్వారాలున్నాయి. దీని చుట్టూ 12 గజాల వెడల్పు, 12 గజాల లోతున కందకమున్నట్లు నేటికీ ఆధారాలున్నాయి. దీనికి 16 బురుజులున్నాయి. ఆనాడిచట 10 మందుల కొట్టులున్నట్లు చరిత్ర తెలుపుతూ ఉన్నది. దీనికి తూర్పు దిక్కున ఒక పిల్ల ద్వారమున్నది. దీనిని భజంత్రి ద్వారమంటారు. దీని పైన బావులు, చక్కని జలాశయాలున్నాయి. వీటిలో నీరు స్వచ్ఛంగానూ, త్రాగడానికి వీలుగానూ ఉంటుంది.

జఫర్‌గడ్ వరంగల్‌కు సుమారు 25 మైళ్ల దూరంలోనూ ఘనపురం స్టేషన్‌కు సుమారు 10 మైళ్ల దూరంలోనూ ఉన్నది. వరంగల్ నుండి లేదా ఘనపురం స్టేషనునుండి ప్రైవేటు సర్వీసుల ద్వారా ఇచటికి చేరుకోవచ్చును.

ఈ ప్రదేశం జఫరుద్దౌలా అనే ముస్లిం వీరునికి విహార ప్రాంతమైనందున, ఆ తర్వాత నివాస ప్రదేశమై కొండమీద దుర్గాన్ని నిర్మించినందున ఈ గ్రామానికి జఫర్‌గడ్ అని పేరు వచ్చింది.

## లక్క మేడ

ఈ గ్రామానికి నాలుగు దిక్కుల నాలుగు ద్వారాలున్నాయి. మొదటి ద్వారాన్ని హనుమకొండ ద్వారమంటారు. రెండవ ద్వారాన్ని పట్నం ద్వారమనీ, మూడవ ద్వారాన్ని ఖమ్మం ద్వారమంటారు. నాలుగవ ద్వారానికి ఏ పేరున్నదీ తెలియరావడంలేదు. ఈ గ్రామానికి చుట్టూఉన్న కందకం నానాటికీ పూడిపోతూఉన్నది. తూర్పువైపున ఉన్న కొండపై నిర్మించబడ్డ దుర్గంలోని కట్టడాలలో లక్కమేడ అందమైనది. ఇది నేడు శిథిలావస్థలో నున్నది. దుర్గం సింహద్వారం దగ్గర ఒకపెద్ద తాళం ఉన్నది. దీనిని ముగ్గురు, నలుగురు కలిసి కూడా లేపలేరు.

ఈ దుర్గాన్ని నిర్మించిన జఫరుద్దౌలా నిర్మల్‌కు చెందినవాడు. ఇతడు రుక్నుద్దౌలా నవాబువద్ద ఏడు సర్కారులను పొంది వాటికి అధిపతియై జఫరుద్దౌలా అనే బిరుదును పొందాడు. జఫరుద్దౌలా మొదట ఒక బ్రాహ్మణుని వద్ద పశువుల కాపరిగా పనిచేసాడు. భవిష్యత్తులో ఇతడు గొప్పవాడవుతాడని ఆ బ్రాహ్మణుడు ఇతనికి విద్యాబుద్ధులు చెప్పించాడు. ఇతన్ని చిన్నప్పుడు ధంసా అని పిలిచేవారు.

ధంసా పెరిగి మంచి వీరుడుగా, బుద్ధిమంతుడుగా, దృఢ కాయుడుగా తయారై హైదరాబాదు నిజాం సేనలో సైనికుడై గొప్ప యోధుడుగా పేరుపొందాడు. ఆ తరువాత ధంసా బొబ్బిలిలో కొంత కాలమున్నాడు. ధంసా బొబ్బిలిలో వున్నప్పుడు వేల్పుగొండ కోటలో పనిచేస్తున్న రాంసింగ్, నరసింహఖాను వేల్పుగొండను వీడి ఇతని కొలువులో చేరారు. వీరి ద్వారా వేల్పుగొండ సమాచారాన్ని విని ధంసా 1300 సైన్యంతో బయలుదేరి దండెత్తి జయించి ఇచట పటిష్ఠమైన కోటను నిర్మించాడు. ఇతడు 1771 లో నిర్మల్‌లోను, 1754 లో జగిత్యాలలోను దుర్గాలను నిర్మించాడు.

దంసా పేర్నగొండను జయించి ఇచటనే నివసించసాగాడు. ఇతడు ఈ కోట మార్గానికి కావలాగా ఒగ్గన్నాపి హవాలి (ఒగ్గు పంతులు), బ్రహ్మండి నాయకుడు అనే వారిని నియమించాడు. ఇతడు పేర్నగొండలో మున్ని, కుర్ర అనే పెంపుడో ఉన్నట్లు చరిత్రలో పేర్కొబడింది. దంసా పేర్నగొండలో లేని సమయంలో శత్రువులు బ్రహ్మండినాయకుడు, ఒగ్గుపంతులును వెంటో వేసుకొని కోటను స్వాధీనం చేసుకున్నారు.

అశ్వారావు పేటను కొల్లగొట్టి అనాటనంలో 1500 సైనికులలో వస్తున్న దంసాకు ఈ విషయం తెలియగానే ముందు వెడి హుటాహుటిని సైన్యాన్ని 2100 వరకు పెంచుకొని కోటకు 3 మైళ్ల దూరంలో విడిదిచేసాడు. శత్రువుపైన దేశముఖ్, దంసాకు 10, 11 మాసాలు హోరా హోరీ యుద్ధం జరిగింది. శత్రువులు కోట ద్వారాలను మూసివేసారు. దాని భోజనసామగ్రి అయిపోయి కష్టతరంకాగానే సంధికి నిశ్చయించుకున్నారు. కాని వారు కొండదారిగా తప్పించుకుని పారిపోసాగారు. దంసా వారిని పట్టుకొని చిత్రవధ చేసాడు. స్వామిద్రోహులైన ఒగ్గుపంతులును, బ్రహ్మండి నాయకుణ్ణి వదించాడు.

తర్వాత దంసా నిర్భయం లేకుండా "జవరుద్దౌలా" అనే పేరుతో స్వేచ్ఛగా ఏలసాగాడు. ఇతడు చివరికి నిజాం ప్రభువును కూడా ధిక్కరించాడు. నిజాం ప్రభువు దంసాను జయించ ప్రయత్నించి విఫలుడయ్యాడు. దంసా తర్వాత ఇతని కొడుకులు బలహీనులైనందున నిజాం ప్రభువు కోటను స్వాధీనం చేసుకున్నాడు. తర్వాత ఇతని ప్రియురాండ్లు మున్ని, కుర్రల అవశేషాల యెద పెరిగిన వారైనందున జవరుద్దౌలా ఇచట యోగానంద నరసింహ స్వామికి అర్చన ఏర్పాట్లు గావించాడని ప్రతీతి. వీరిద్దరి పేరిట రెండు శిలామయ కూపాలను నిర్మింపజేసాడు. పశ్చిమ ద్వారానికి ఉత్తర భాగంలో మొదటి బావి, దక్షిణముఖ ద్వారానికి రెండు మైళ్ల దూరంలో రెండవ బావి ఉన్నాయి. ద్వారాలకు అనతి దూరంలో దంసా రాతి కట్టడంతో ఒక పెద్ద చెరువును నిర్మింప జేసాడు.

ఇటువంటి దుర్గాలలోను, గ్రామంలోను చాలా పెద్ద లోపములున్నాయి. వీటి నిర్మాణం అద్భుతంగా ఉన్నది. ఇచటి కట్టడాల శిల్పచాతుర్యం దాక్షిణాత్య శిల్ప విధానాన్ని పోలి ఉంటుంది. ★

---

( 11వ పేజీ నుండి )

## మన రాజ్యాంగము : వెనుకబడిన వర్గాలు

ప్రత్యేక రక్షణలను తొలగించవచ్చు. ప్రతి పౌరునికి సమాన అవకాశాలు కల్పించాలనే రాజ్యాంగం ముఖ్య లక్ష్యం. అందరూ సాంఘిక సమానత సాధించినప్పుడు గాని, అమలు జరపడానికి వీలుపడదు. అంతవరకు సాంఘికంగా పురోగతి సాధించినవారు, తమ పవిత్ర బాధ్యతగా గుర్తించి, వెనుకబడిన వర్గాలవారి అభివృద్ధికి హృదయ పూర్వకంగా తోడ్పడవలసివుంది. చారిత్రకంగా చూస్తే కూడా, నైతిక బాధ్యత పురోగతి చెందిన వారిపై ఉంది. అనాదిగా మనదేశంలో కాయకష్టం చేసేవారికి తగిన గౌరవం లేదు. ప్రవదిలేకుండా కాయకష్టం చేసే కోట్లాది దళిత జాతులవారు, కనీసావసరాలకు ఇక్కట్లుపడుతూ అనారోగ్యం, నిరక్షరాస్యత, ఆర్థిక ఇబ్బందులు, కొంప-గోడు లేని నికృష్టమైన పరిస్థితులలో సతమతమౌతున్నారు. దేశంలో, ఏ ప్రజలు పొలాలు దున్ని పంటలు పండిస్తున్నారో, ఏ వర్గాలవారి కృషి ఫలితంగా భారతీయులకు ఉపయోగపడే వస్తుసముదాయం యావత్తు సృజింపబడుతున్నదో, ఆ వర్గాలవారు అనాగరికమైన బ్రతుకులు వెళ్ళబుచ్చుతూ ఉంటే, ఆ దేశం అభివృద్ధి ఎలా సాధిస్తుంది? ఈ ప్రశ్నలు ఎవరికి వారు వేసుకొంటే తమ హక్కులలో కొంతభాగాన్ని, వెనుకబడిన వర్గాల పురోగతికొరకు స్వేచ్ఛగా సంక్రమింప చేయడానికి వెనుకాడరు. ఈ త్యాగనిరతి చూపించిననాడు వర్గాల కుమ్ములాటలు ఉండవు. పైగా కాయకష్టం చేసి జీవించే వారిపైన గౌరవభావం కలుగుతుంది. ఈ మానసిక పరివర్తన కలిగినప్పుడే భూ సంస్కరణలు, తక్కిన దళిత జాతి పథకాలు బాగా అమలు జరుగుతాయి. దేశ సౌభాగ్యం. త్వరితగతిని పెంపొందించడానికి వీలు పడుతుంది. "కృషితో నాస్తి దుర్భిక్షం" అన్న ఆర్యోక్తి ప్రస్తుతం, అర్థంలేని గీర్వాణ భాషోక్తిగా మిగిలిపోయింది. దీనిని అర్థవంతం చేసినప్పుడు, రాజ్యాంగ లక్ష్యాలు ఒకదానివెంట ఒకటి, సఫలీకృతం ఔతాయి. అప్పుడే రాజ్యాంగం యొక్క 38వ అనుచ్ఛేదంలో, ఉదహరింపబడిన, సాంఘిక సమానత్వం, ఆర్థిక, రాజకీయ రంగాలలో న్యాయం, ప్రజాసంక్షేమ వ్యవస్థలగల సంస్థల పునః నిర్మాణము జరుగుతుంది. ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యంలో నిజమైన పౌరులుగా భారత ప్రజలు మనగల్గుతారు.

వెనుకబడిన వర్గాల వారుగూడా, కేవలం రక్షణల మీద ఆధారపడకుండా స్వయంకృషితో పైకి రావాలి అనేది ధ్యేయంగా పెట్టుకోవాలి. ఎందువల్లనంటే, రాజ్యాంగ రక్షణలవల్లే వెనుకబడిన ప్రజలందరు అభివృద్ధి సాధిస్తారనుకోవటం కేవలం భ్రమమాత్రమే గనుక ఆ రక్షణలు, ఒక ఉపాధిగా భావించి, ఎక్కువగా స్వయం కృషితో అభివృద్ధిని సాధించాలనే ఆశయసిద్ధికి వెనుకబడిన వర్గాలు పాటుపడితే తప్ప, వారి జీవనప్రమాణ పరిస్థితులు మెరుగుపడవు. ఇది కాదనలేని సత్యం. హిందూ సమాజంలో కులతత్వం, వెనుకబడిన తనానికి కొంత కారణభూతము కాబట్టి, కులనిర్మూలన కార్యక్రమం కూడా వెనువెంటనే చేపట్టవలసి ఉంది. రాష్ట్ర ప్రభుత్వం, దీనికి కొంత చేయూత ఇవ్వవలసి ఉంది. తమిళనాడు, మైసూరు, మహారాష్ట్ర, కేరళ ప్రభుత్వాలు, ఈ మార్గంలో కొంత కృషి చేస్తున్నాయి. వర్ణాంతర వివాహాలకు కులాంతర వివాహాలకు మతాంతర వివాహాలకు, ప్రోత్సాహం వలు పైపులనుండి వస్తే, సాంఘిక అసమానతలు, మత వైషమ్యాలు, తొలగిపోయి, భారత ప్రజలందరు ఏకమానవ జాతిగా మనగల్గుతారు.



# జమలాపురం— శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయం

శ్రీ వి. ఎస్. సుబ్రహ్మణ్యం



జమలాపురంలోని వేంకటేశ్వరస్వామి దేవాలయం

ఖమ్మం జిల్లా, మధిర తాలూకా, జమలాపురం గ్రామములోని శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయ పునరుద్ధరణకు ఇరువదిఐదు లక్షల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా.

ఈ దేవాలయమునకు కావలసిన నల్లరాయి గుంటూరు జిల్లాలోని ఫిరంగిపురం నుండి సేకరించబడుచున్నది

ఈ దేవాలయముయొక్క ముఖ్య గోపురము పని పూర్తి అయి యిది జిల్లాలో ఒక చక్కని శిల్పకళా ఖండముగా వెలసిల్లుచున్నది ఈ దేవాలయములో లేలే ఆకుపచ్చని రాయితో చెక్కబడిన ఐదు అడుగుల ఆరు అంగుళముల నిడివిగల శ్రీ వేంకటేశ్వరస్వామి వారి విగ్రహమును ప్రతిష్ఠించుటకుగాను తయారు చేయించిరి.

లక్ష ఏబదివేలతో చక్కని శిల్పనైపుణ్యముగల పదునారు స్తంభములతో కూడిన మహామండపము, ఒక లక్ష రూపాయలతో ముప్పదిరెండు అడుగుల పొడవుగలిగిన సోపానములు క్రింద నుండి దేవాలయ సింహద్వారము వరకు మరియు ఒకలక్ష ఇరువదివేల రూపాయల ఖర్చుతో శ్రీమతి పద్మావతి అమ్మవారి ఆలయము వగైరా కట్టడములు చాలా చురుకుగా కొనసాగుచున్నవి ఈ కార్యక్రమములన్నియు సుమారు ఆరు మాసములలో పూర్తియగును

తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఇరువది నాలుగు గదులు గల సత్రమును నిర్మించుటకుగాను నాలుగు లక్షల రూపాయలు మంజూరీ ఇచ్చియున్నారు ఇంతవరకు పండ్రెండు గదులు లింటల్ లెవల్ వరకు పూర్తిఅయినవి మిగతాపని కొనసాగుచున్నది.

వేములవాడ దేవస్థానమువారు పదివేల రూపాయలు సత్రము కట్టుటకు మంజూరీ ఇచ్చియున్నారు.

ఈ జమలాపుర గ్రామమునకు రక్షిత నీటి సరఫరా పథకమునకుగాను ప్రభుత్వమువారు ఒక లక్ష రూపాయలు మంజూరీచేసియున్నారు. ఈ పనికూడ చురుకుగా కొనసాగుచున్నది.

జమలాపురం ఎఱ్ఱుపాలెము రైల్వేస్టేషనుకు (C.Rly) మూడు కిలోమీటర్లు మరియు మధిర రైల్వేస్టేషనుకు ఇరువది ఐదు కిలోమీటర్లు దూరములోనున్నది.

ఇక్కడి శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవాలయము చాలా పురాతనమైనది.

ఈ దేవాలయము జిల్లాలోఉన్న దేవాలయములలో భద్రాచలం తరువాత రెండవ స్థానము ఆక్రమిస్తుంది.




## అష్టదిగ్గజ కవి సమాజములో రాయల నాశ్రయించిన తొలి కవి యెవరు?

(రచయిత–శ్రీ కె. ఎస్. కోదండరామయ్య, ఎం.ఎ. బి.ఓ.ఎల్., బి.టి., ఎం.ఎల్.ఎ., హోసూరు ధర్మపురిజిల్లా తమిళనాడు. ప్రకాశకులు–శివదేవయాంధ్ర గ్రంథమాల, హోసూరు. పుటలు–112. 1/16 క్రౌను. మూల్యము– రూ. 3.00. ప్రాప్తి స్థానము–ప్రకాశకులు.)

"ఎదురైనచో దన మద కరీంద్రము డిగ్గి
చేయూత యొసగి యెక్కించుకొనియె,
మను చరిత్రంబందుకొనువేళ బురమేగ
బల్లకి తన కేల బట్టి యెత్తె,
కోకటగ్రామాద్యనేకాగ్రహారంబు
లడిగిన సీమల యందు నిచ్చె,
బిరుదైన కవిగండ పెండేరమున కీవ
తగ దని తానె పాదమున దొడిగె,
"ఆంధ్ర కవితా పితామహ ! యల్లసాని
పెద్దన కవీంద్ర" యనితన్ను

పిలిచినట్లు పెద్దనామాత్యుడు చెప్పికొన్న చాటువును బట్టి, ఇతర కథలనుబట్టి పెద్దనామాత్యుడే కృష్ణరాయల భువన విజయాస్థానమున తొలికవి యనియు, అంతియేకాక భువన విజయాస్థాన స్థాపనమునకు ముందుగనే కృష్ణరాయల నాశ్రయించిన కవియు నతడే యనియు వదంతులు వ్యాపించియున్నవి. అంతేకాక నందితిమ్మన రాయలకు గజపతుల విజయము తర్వాత, రాజ తంత్రజ్ఞతతో జరిగిన వివాహముతో అరణముగా వచ్చిన వాడనియు, తిమ్మన కృతి మనుచరిత్రకన్నను ముందుగనే రచితమయినను రాయలు పెద్దనను ప్రాంతీయతతోను దండనాథ, రాజప్రతినిధ్యాది కార్యములతోను విశేషముగా నాదరించెననియును వదంతులు వ్యాపించియున్నవి. శ్రీ కె.ఎస్. కోదండరామయ్యగారు ఈ వదంతులకు గొడ్డలిపెట్టుగా ఈ గ్రంథమును రచించి, భువన విజయమెప్పుడు ఏర్పడినది, అష్టదిగ్గజములలో మొదటివారెవరు, మున్నగు విషయములను తెలుపుటయేగాక, విజయనగర చరిత్రకు సంబంధించిన పెక్కు నూతనాంశములను ఆంధ్ర ప్రజలకు తెలియ జేసినారు.

శ్రీ కోదండరామయ్యగారు గడచిన మూడు దశాబ్దములుగ దక్షిణాంధ్రులకై తమ జీవితమును ధార బోసినవారు. "హోసూరు తాలూకా ఆంధ్ర సాంస్కృతిక సమితి" "దక్షిణాంధ్రభాషా రక్షణ సమాజము" అను రెండు సంస్థలను స్థాపించి, మైసూరు, తమిళనాడు, కేరళ రాష్ట్రములలో 75 లక్షల సంఖ్యలోగల ఆంధ్రుల సాంఘిక సాంస్కృతిక పునరుజ్జీవనమునకు పరిశ్రమించుచున్నట్టివారు! ఆంధ్రుల హక్కులకోసము తమిళనాడు శాసనసభలో నిరంతరము పోరాడుచున్న ఉద్దనపల్లి సభ్యులు, మైసూరు రాష్ట్రములోని వివిధ ప్రాంతముల నుండి అమూల్యములగు ప్రాచీన తాళపత్ర గ్రంథములు సేకరించి, వాటిని గురించి విపులముగా, వివిధ పత్రికలలో అపూర్వ వ్యాసములు ప్రకటించి, తెలుగు వారికి ఎన్నియో నూతన విషయములను దెలిపినట్టి వారు; సాహిత్య చరిత్ర వేత్తలతో ఔననిపించుకొన్నట్టివారు. అట్టివారు ఈ గ్రంథమును ప్రామాణికముగా రచించినారనియు, సాహిత్య చరిత్ర కారులకు కనువిప్పు కావించినారనియు వేరుగ చెప్పనక్కర లేదు.

ఈ గ్రంథమున మూడు ప్రకరణము లున్నవి. మొదటి ప్రకరణమున అష్టదిగ్గజ కవులెప్పుడెవ్వరు ? శ్రీముఖ సంవత్సర వసంతోత్సవము, అష్టదిగ్గజ పద్ధతి ఎపుడేర్పడెను ? అష్టదిగ్గజ కవులలో మొదటి వారైన అల్లసాని పెద్దన, ముక్కుతిమ్మన, మాదయగారి మల్లన అను వారిలో రాయల నాశ్రయించిన తొలికవి యెవరు ? అను విషయములు చర్చింపబడినవి. అష్టదిగ్గజ కవులను వారు రాయల భువన విజయాస్థానమున నున్నట్లు కడప జిల్లా తిప్పలూరు గ్రామమున లభించిన 1527 నాటి శాసనమునకు ఉపబృంహకముగా కోదండ రామయ్యగారు కోలారు జిల్లా నంది దుర్గము నందుండు సోమేశ్వరస్వామి ఆలయముననున్న శాసనమును ఉదహరించినారు. "యస్యాష్టౌ కవిదిగ్గజాః పృథుయశోభాసైః జగచ్ఛోభనాః" అని దానిలో నిస్సందేహముగా నుండుటను పేర్కొన్నారు. భువన విజయాఖ్య సభ 1513–14 లలో ఏర్పడియుండ బోవునని సూచించినారు. ముక్కు తిమ్మన రాయల సామ్రాజ్య విస్తరణకు మూలబంధ మనదగిన ఉమ్మత్తూరు–శివసముద్రము దండయాత్రను వర్ణించుటను బట్టియు, పెద్దన ఆ దండయాత్రను వర్ణింపక పూర్వ దిగ్విజయయాత్రనే వర్ణించుటవలనను, గంగరాజులపై విజయము 1512లో జరిగియుండుటవలనను తిమ్మన అష్టదిగ్గజ కవి వ్యవస్థ ఏర్పడకముందే రాయల నాశ్రయించి యుండెననియు శ్రీ కోదండ రామయ్యగారు నిరూపించినారు.

ద్వితీయ ప్రకరణమున ముక్కు తిమ్మనార్యుడు చేసియుండు రాయల పూర్వ దిగ్విజయ వర్ణనము, దక్షిణ దిగ్విజయ వర్ణనము, కృష్ణరాయల తండ్రి నరసనాయకుడు (1498–1503) చోళపాండ్యాది రాజుల జయించుట, శ్రీరంగ పట్టణమున నరసనాయకుని యునికి, గంగరాజు ఎట్లు మరణించెను మొదలగు విషయములన్నియు విపు

లముగ చారిత్రక, సాహిత్యాధారములతో నిరూపింపబడినవి. ఈ ప్రకరణము చారిత్రకముగా చాల ముఖ్యమైనది. శ్రీ కోదండ రామయ్యగారు పలువురు చరిత్రకారులను ఉదాహరించి, పెక్కు మూలనాంశములను నిరూపించినారు. ఇంతవరకు విజయనగర చరిత్రకారులందరును, రాయల పూర్వదిగ్విజయ యాత్రనే విశేషముగా తెలిపినారు. రాయల ప్రథమ దక్షిణ దిగ్విజయ యాత్రను గూర్చి పారిజాతాపహరణమున లభించు నాందీరంగ ప్రమాణమును శ్రీ కోదండ రామయ్యగారు వివరించి రెండు లఘుపాఠములకు సవరణను గూడ సూచించినారు. "చోళవల్లభునకు సురవధూ మధురాధరము లిచ్చి మధురాపురంబు గొనియె" (పారి 1-13) అను ప్రస్తుత పాఠమును బట్టి నరసనాయకుడు చోళరాజును చంపి మధురాపురమును వశపరచుకున్నాడను అపార్థము కలుగును. చోళుల రాజధాని తంజావూరుగాని మధుర కాదు. మధురను పాండ్యులు ఏలిరి. తెన్కాశి (దక్షిణకాశి)-శివగంగను రాజధానిగ జేసుకొనుట, మధురను మరవరాజులు ఆక్రమించుటయను చారిత్రక విషయముతో సమన్వయించి "చోళవల్లభునకు సురవధూ మధురాధరము లిచ్చె; మధురాపురంబు గొనియె" అను సవరణ సూచించి చరిత్రకు మహోపకార మొనర్చినారు. అట్లే, "శ్రీరంగ పట్టణ సీమ ఎదు నటీవినోదంబు యాపనేంద్రునకు జూపె, అని యొక పాఠము "హైసణేంద్రునకు" అను మరియొక పాఠము (పారి-1-13) పారిజాతాపహరణమునందున్నట్లు శ్రీ కోదండ రామయ్యగారు తెలిపి ఈ రెండు పాఠములు సరైనవి కావని, రైస్ మున్నగు చరిత్రకారుల వ్రాతలు ప్రమాణముగ చూపి "హొయిసణేంద్రునకు జూపె" అని మార్చుట చరిత్రానుగుణమని నిరూపించినారు. నరసనాయకుడు శ్రీరంగపట్టణమును జయించిన పిదప కుమార వీరయ్య దండనాయకుని కుమార్తె తిరుమలాంబను తన కుమారుని కిప్పించి పెండ్లి చేసెననియు, తిమ్మన తన మేనమామ కాలము నుండియే నరసనాయకునకు పరిచితుడై, వీరయ దండనాయకుని గూడ ఆశ్రయించిన వాడగుటచే రాయల కరణముగా విజయనగరమునకు వచ్చెనను అంశమును నిరూపించినారు.

మూడవ ప్రకరణమున ముక్కు తిమ్మన రాయల నెపుడాశ్రయించెను? తిమ్మకవి యే ప్రాంతమువాడు? కోలారు మండలము తెలుగు సీమ అను విషయములు చర్చించబడెను. నరసనాయకుడు సేనానాయకత్వమునుండి చక్రవర్తియయి తీరికగా కొలువు దీరినది విజయనగరములో కాక శ్రీరంగపట్టణములో నని శ్రీ కోదండ రామయ్యగారు శాసనాధారములతో నిరూపించి నరసనాయకునకు వరాహ పురాణమును అంకిత మిచ్చిన ఘంటసింగయ్య మూలమున కొలువున కలిగిన ప్రవేశము వలనను 'నంది' అను నింటి పేరుగల వారు కోలారు జిల్లా చిన్న బళ్లాపురము తాలూకాలో పెక్కుమంది యుండుట వలనను, అచ్చటనే 'నంది' అను గ్రామము నేటికిని యుండుటవలనను, వీరయ్య నాయకుడు పంపిన అరణపు కవియగుట వలనను తిమ్మన కోలారు జిల్లా నందిగ్రామ వాస్తవ్యుడని స్పష్టపరిచినారు. తిమ్మన కాలము నాటికే అష్టదిగ్గజ వ్యవస్థ ఏర్పడినదనియు, చిన్నాదేవి అరణముగా వచ్చిన తిమ్మన రాయల యాస్థానమున దూరెననియు పలువురు చేసిన వాదములను కోదండ రామయ్యగారు సోపపత్తికముగా ఖండించినారు.

చివర అనుబంధములో నందియరాజు శాసనమునిచ్చి, దాని కాల నిర్ణయము చేసినారు.

కాని కొలవి గోపరాజు విషయమున శ్రీ కోదండ రామయ్యగారు చెప్పినది ఇంకను నిరూపితము కావలసి యున్నది. అతడు తెలంగాణములోని కరీంనగరు జిల్లా ధర్మపురి వాడని ఇదివరకు నిర్ణయము. కోలారు మండల మందలి వేములపల్లి నేలిన రాణా వంశ రాజైన మల్లరాజు వంశము వాడని వీరు చెప్పిన దానికి మరికొంత ప్రమాణము దొరికిన మేలని నా ఊహ.

ఏమయినను సమకాలిక రాజకీయములలోను, దక్షిణాంధ్రుల సాంస్కృతిక రంగమునను నిరంతర కృషి ఒనర్చు తీరికలేని కోదండ రామయ్యగారు, సాహిత్య చరిత్ర పరిశోధనను కూలంకషముగా సలుపుటయే గాక ఇదివరకు చరిత్రకారులు తెలుపని అపూర్వ విషయములను తెలిపినందుకు ఆంధ్రావళి వారి యెడల కృతజ్ఞతతో నుండవలె. ఇప్పుడు శ్రీ కోదండ రామయ్యగారు దక్షిణాపథమైసూరు ప్రాంతాల తెలుగు వారిని ఆంధ్రావళికి మరెందరినో పరిచయము చేసే అపూర్వ విషయములు తెలిపి సత్య స్థాపన చేయుదురుగాక.

క. ల. శాస్త్రి

## తిమ్మరాజు శతకము

(తిమ్మరాజు శతకము—రచన—వల్లభనేని కాశీ విశ్వనాథం ప్రచురణ— ప్రజా ప్రచురణలు—పవర్ పేట—ఏలూరు

వెల — యాభై పైసలు.

ప్రాప్తిస్థానం: ప్రచురణకర్త)

సంస్కృతంలో భర్తృహరి శతకం, మహిషశతకం మొదలైనవి ఉన్నాయిగాని శతకవాఙ్మయ ప్రచారం ఆ భాషలో తక్కువ. తెలుగులో శతకవాఙ్మయానికి ప్రాముఖ్యం—ప్రచారము విరివిగా ఉంది. మొదట దైవస్తుతి పరంగా రచింపబడిన నరసింహ శతకం, కృష్ణశతకం ఇత్యాదులు చాల తెలుగులో వెలిశాయి. వాటితో పాటే నీతిశతకములుగూడ వేమన మొదలైన మహాకవులు రచించారు. ద్రావిడ భాషల్లో తెలుగుకే శతకాల అగ్రస్థానము, ప్రత్యేకత మనవారు కలిగించారు. తిమ్మరాజు శతకముగూడ ఇది బోధకంగా రచించబడదే. కాశీవిశ్వనాథంగారు దీన్ని సుబోధకంగా ఉండేలాగు తేటతెలుగులో వ్రాశారు. అగ్రజన్ములు అస్పృశ్యులనేడివి పిచ్చియూహలు, సమసమాజము స్థాపించవలెను, జాతి మతములనెడి పూతలకు బదులు మానవత్వమొకటె మాన్యమైనది మొదలైన భావములు పల్లెపట్టుల అభ్యుదయ మార్గములకు కూడా అనుసరణీయంగా ఉంది.

క. ల. శాస్త్రి



జూలై 8వ తేదీన గుంటూరు దగ్గర నల్లపాడులో ప్రభుత్వోద్యోగుల సహకార గృహ నిర్మాణ కాలనీకి గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్ శంఖుస్థాపన చేశారు.



## ప్రత్యేక ఉపాధి పథకం ప్రారంభోత్సవం

గవర్నరు సలహాదారు, శ్రీ వి. కె. రావు, జూన్ 20 న శ్రీకాకుళం జిల్లా, కొత్తూరు బ్లాకులోని ఘనసారలో హరిజనులు, గిరిజనులకు చెందిన ప్రత్యేక ఉపాధి పథకానికి ప్రారంభోత్సవం చేస్తూ హరిజన, గిరిజనులకు సహాయపడడానికి ప్రభుత్వం శాయ శక్తులా కృషిచేస్తున్నదని అన్నారు. హరిజన గిరిజన కాలనీకి ఆయన శంఖుస్థాపన చేశారు.

## నిజామాబాదు జిల్లా పరిషత్తు

నిజామాబాదు జిల్లా పరిషత్తు ఒకటవ స్థాయీ సంఘం సమావేశం జిల్లా కలెక్టరు శ్రీ ఎస్. కె. సూరయా అధ్యక్షతన నిజామాబాదులో యిటీవల జరిగింది. జిల్లాలోని వ్యవసాయ కార్యక్రమాలను గూర్చి సమావేశంలో సమీక్షించారు. జిల్లా కలెక్టరు సమావేశంలో ప్రసంగిస్తూ శాఖ పరమైన నిల్వల నుండి నేరుగా 600 టన్నుల ఎరువులు జిల్లా సహకార మార్కెటింగ్ సంఘం నుండి 200 టన్నుల ఎరువులు వివిధ సమితులకు పంపిణీ చేయడం జరిగిందని తెలియజేశారు. మరో 1000 టన్నులు నేరుగా లభిస్తాయని వాటిని రైతులకు పంపిణీ చేయడం జరుగుతుందని అన్నారు.

జిల్లా వ్యవసాయ శాఖాధికారి శ్రీ హేమచందర్ ప్రసంగిస్తూ 1400 మెట్రిక్ టన్నుల విత్తనాలు పంపిణీ చేయడానికి ఏర్పాట్లు జరగాలని అన్నారు. ఇప్పటికి 900 మెట్రిక్ టన్నుల విత్తనాలు పంపిణీచేశారని, మిగతా 500 మెట్రిక్ టన్నుల విత్తనాలు వివిధ గోదాములలో ఉన్నాయని ఆయన అన్నారు.



జూలై 21వ తేదీన గంట్యాడలో శీతారామనగర్ కోపరేటివ్ హౌసింగ్ కాలనీకి
గవర్నరు సలహాదారు శ్రీ వి. కె. రావు ప్రారంభోత్సవం చేశారు.




అదేరోజున గంట్యాడ పాల సహకార సంఘం, సామూహిక రేడియో కేంద్రాలకు కూడా
శ్రీ వి. కె. రావు ప్రారంభోత్సవం చేశారు.



జూన్ 22వ తేదీన గుడివాడ ప్రభుత్వ ఆసుపత్రిలో కొత్తగా నిర్వహించిన అవుట్ పేషంటు వార్డుకు గవర్నరు సలహాదారు శ్రీ వి. కె. రావు ప్రారంభోత్సవం చేశారు.



ప్రారంభోత్సవ సమావేశం మరొక దృశ్యం.

## జైనాదులో పత్తిపంటపై స్ప్రేయింగు ప్రదర్శన

ఆదిలాబాదు జిల్లాలోని జైనాదు గ్రామంలో హెచ్-4 ప్రత్తి పంటపై స్ప్రేయింగు ప్రదర్శనను నిర్మల్‌లోని ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ పరిశ్రమల కార్పొరేషనువారు నిర్వహించారు. జిల్లా కలెక్టరు శ్రీ ఆర్.కె.ఆర్. గోనెలా యీ ప్రదర్శనను తిలకించారు. హెచ్-4 ప్రత్తి పంటపై ఆర్.ఎన్.-09 ట్రాక్టరుతో స్ప్రేయింగు జరపడంలోగల ప్రయోజనాలను గూర్చి వ్యవసాయశాఖ డిప్యూటీ డైరెక్టరు, జిల్లా మేనేజరు రైతులకు వివరించారు.

ఆదిలాబాదు పంచాయతీ సమితిలో 2,661 ఎకరాలలో హెచ్-4 ప్రత్తిపంట వేశారు. ట్రాక్టరు ద్వారా స్ప్రేయింగు నిర్వహణకు గంటకు రూ. 31ల చొప్పున ఛార్జి విధిస్తారు. ఈ విధంగా ఎకరాకు రూ. 5లు ఖర్చు అవుతుంది.

## నల్లగొండ జిల్లాలో రూ. 14 లక్షల ఖర్చుతో పాల శీతల కేంద్రం

నల్లగొండ జిల్లా కలెక్టరు, శ్రీ ఎల్. బుల్లయ్య, జూలై 30 న నల్లగొండ పత్రికా ప్రతినిధులతో ప్రసంగిస్తూ యీ సంవత్సరం నల్లగొండ జిల్లాలో రూ. 14 లక్షల ఖర్చుతో సహకార రంగంలో ఒక పాల శీతల కేంద్రం నెలకొల్పబడుతుందని తెలియజేశారు. ఈ కార్యక్రమం శేమ వాటాగా రూ. 3.00 లక్షలు మంజూరు చేయడానికి సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ అంగీకరించింది.

సన్నకారు రైతులు, మధ్యతరగతి రైతుల అభివృద్ధి నిమిత్తం సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థకు రూ. 1.13 కోట్లు, మధ్యతరగతి రైతులు, వ్యవసాయ కూలీల అభివృద్ధి పథకాలకు రూ. 1.15 కోట్లు కేటాయించారని కలెక్టరు అన్నారు. సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ కార్యక్రమాలు అమలు జరిపే ప్రాంతంలో పశుగణాభివృద్ధి పథకం క్రింద రూ. 36 లక్షల ఖర్చుతో 600 పాడిక్షేత్రాల యూనిట్లను ఏర్పాటు చేస్తారు. కోళ్ల పెంపకం పథకం క్రింద ప్రతి యూనిట్లలో 100 కోళ్ల చొప్పున 250 కోళ్ల పెంపకం కేంద్రాలను ఏర్పాటు చేస్తారు. మత్స్య పరిశ్రమ అభివృద్ధి పథకం క్రింద రూ. 4 లక్షలు ఖర్చు చేయాలని ప్రతిపాదించారు.

ఈ పథకాల అమలుతో ఆర్థిక సహాయ సంస్థలు అందజేసే ఋణాలతో సన్నకారు రైతులకు 25 శాతం సబ్సిడీ లభిస్తుంది. మధ్యతరగతి రైతులు, వ్యవసాయ కూలీలకు అందజేసే ఋణాలలో 33 1/3 శాతం సబ్సిడీగా లభిస్తుంది.

## మునిసిపల్ కార్మికుల యిండ్ల కాలనీకి ప్రారంభోత్సవము

చిత్తూరు జిల్లా కలెక్టరు శ్రీవల్లియప్పన్, జూలై 23న చిత్తూరులో మునిసిపల్ కార్మికుల యిండ్ల కాలనీకి శంకుస్థాపన చేస్తూ పట్టణ ప్రాంతాలలో స్థానిక సంస్థల ఉద్యోగులకు, ప్రభుత్వ ఉద్యోగులకు నివేశన సౌకర్యాలు కల్పించడానికి ప్రభుత్వం శ్రద్ధ వహిస్తున్నదని అన్నారు. ఈ కాలనీలో 18 యిండ్లు నిర్మించాలని ప్రతిపాదించారు.



శ్రీకాకుళం జిల్లాలో వట్టిగడ్డ రిజర్వాయరు ప్రాజెక్టులో స్పిల్‌వే దృశ్యం.



వట్టిగడ్డ ప్రాజెక్టు క్రింద కుడికాలువ త్రవ్వకం పనులు.



జూలై 22 వ తేదీన గుంటూరు జిల్లా పెదనందిపాడులో నల్లమడ మురుగు కాలువపై వంతెనను ఛీఫ్ ఇంజనీరు శ్రీ ఎ. ఆర్. సత్యనారాయణరావు ప్రారంభించారు.

## రు. 90,000 ల ఖర్చుతో కూడిన యిండ్ల కాలనీకి శంకుస్థాపన

గవర్నరు సలహాదారు, శ్రీ వి. కె. రావు జూలై 20న శ్రీకాకుళం జిల్లా పాలకొండ సమితిలోని గోపిదేవిపేటలో హరిజనులు, గిరిజనులకు చెందిన యిండ్ల కాలనీకి శంకుస్థాపన చేశారు. రూ. 90,000 ల ఖర్చుతో 90 యిండ్లు యీ కాలనీలో నిర్మించబడుతున్నాయి. గిరిజనులు, హరిజనులకు చెందిన సహకార భూమి కాలనైజేషన్ పథకానికి, ప్రత్యేక ఉపాధి పథకానికి కూడా ఆయన ప్రారంభోత్సవం చేశారు.

శ్రీముఖలింగం వద్ద వంశధారపై రు. 1.98 లక్షల ఖర్చుతో ఒకమైలు మూడు ఫర్లాంగుల పొడవుగల కొత్త వరదకట్ట నిర్మాణానికి ఆయన ప్రారంభోత్సవం చేశారు. నగరికటకం కాలువ మరమ్మతు కూడా యీ పథకంలో చేర్చబడింది.

శ్రీముఖలింగంలో మధురేశ్వర దేవాలయాన్ని శ్రీ వి. కె. రావు సందర్శించినప్పుడు ఆయనకు ఆలయ మర్యాదలతో స్వాగతం చెప్పారు. భూముల బాగుచేతకు, యిటీవల వరదవల్ల వచ్చిన మేట తీసివేతకు, పంపుసెట్ల కొనుగోలుకు అవసరమైన రుణాలను మంజూరు చేయాలని గవర్నరు సలహాదారులకు గ్రామస్థులు విజ్ఞప్తి చేశారు.

## సీతానగరం హరిజన కాలనీకి ప్రారంభోత్సవం

గవర్నరు సలహాదారు శ్రీ వి. కె. రావు, జూలై 21న విశాఖపట్నం జిల్లా గంట్యాడలో సీతానగరం హరిజన కాలనీకి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ విశాఖపట్నంలో హరిజనులు, యితర బలహీనవర్గాల ప్రజలకు యింతవరకు 2,452 యిండ్లు నిర్మించబడినాయనీ మరికొన్ని నిర్మించబడుతాయనీ తెలియజేశారు. ప్రయోజనం పొందినవారు రుణాలను సకాలంలో సక్రమంగా తిరిగి చెల్లించాలని ఆయన ఉద్బోధించారు. దీనివల్ల యితర గ్రామాలలో తమతోటి వారికి యిండ్లు నిర్మించడానికి వీలుకలుగుతుందని ఆయన అన్నారు.

జిల్లా పరిషత్తు అధ్యక్షుడు, శ్రీ సాగి సీతారామరాజు ప్రసంగిస్తూ రాష్ట్రంలో 50,000 యిండ్లు నిర్మించడానికి రూ. 10 కోట్లు మంజూరు చేశారనీ తెల్పుతూ, హరిజనులు, యితర బలహీన వర్గాలు దీనివల్ల ప్రయోజనం పొందాలని సలహా యిచ్చారు.

శాసన సభ్యులు శ్రీ యం. వి. సూర్యనారాయణరాజు ప్రసంగిస్తూ ఈ యిండ్లలో ఉండేవారికి పాల సరఫరా పథకం కూడా అమలు జరుపుతారని అన్నారు.

రూ. 72,000 ల ఖర్చుతో 40 యిండ్లను యీ కాలనీలో నిర్మిస్తున్నారు. ఈ కాలనీలో వీధి దీపాలు, రేడియో గది, పాల సరఫరా సహకార సంఘం, పార్కు సౌకర్యాలు కల్పిస్తున్నారు. దీనివల్ల ప్రయోజనం పొందినవారందరికీ కొబ్బరిమొక్కలు పంపిణీ చేశారు.



విశాఖపట్టణంలో "గాంధీప్లేస్" వ్యాపారకేంద్రానికి గవర్నరు సలహాదారు శ్రీ వి. కె. రావు జులై 22 తేదీ శంకుస్థాపన చేశారు.



కరీంనగర్ జిల్లా వడ్లూరులో "కరువుకు వ్యతిరేకంగా యువత" శిబిరం నిర్వహించబడింది.



గుంటూరు సమీపంలోని ఏటుకూరులో "కరువుకు వ్యతిరేకంగా యువత" శిబిరానికి రాష్ట్ర కోఆర్డినేటర్ శ్రీ ఎల్. లవణం ప్రారంభోత్సవం చేశారు.

## సారవకోట సమితిలో ఎరువుల పంపిణీ

సారవకోట సమితిలో ఎరువుల పంపిణీ సలహా సంఘము సమితి అధ్యక్షులు శ్రీ ధర్మనారాయణరావు గారి ఆధ్వర్యమున సమావేశము కాబడినది. 5గురు సలహా సభ్యులు హాజరైరి. ఎకరమునకు 10 కిలో గ్రాముల అమ్మోనియం సల్ఫేటు లేక తదితర రసాయనిక ఎరువులు 8 వేల ఎకరముల మేరకు 15% కోటానుండి కంట్రోలు ధరకు 5 ఎకరములకు మించి 25 ఎకరములకు లోబడి వున్న రైతులకు అమ్ముటకు నిర్ణయించబడినది. ఎరువుల డిపోలు బి.డి.ఓ. గారు; తహశీల్దారుగారు డెప్యూటీ తహశీల్దారుగారి పర్యవేక్షణ క్రింద వుంచుటకు నిర్ణయము గైకొనడమైనది. పాతపట్నం అసెంబ్లీ సభ్యురాలు శ్రీమతి చుక్క పగడాలమ్మగారు సమావేశమునకు హాజరైరి.

## పులివెందులలో 34 మంది నాయీబ్రాహ్మణులకు నివేశన స్థలాల పంపిణీ

కడపజిల్లా పులివెందుల పంచాయతీ సమితి అధ్యక్షుడు, శ్రీ డి. రామకృష్ణారెడ్డి యిటీవల గృహవసతిలేని 34 మంది నాయీబ్రాహ్మణులకు నివేశనస్థలాల పట్టాలను పంపిణీ చేశారు. అంతేగాక సామూహిక, మత సంబంధ కార్యాలకు, సాంస్కృతిక, కార్యక్రమాలకు, దేవాలయం, మంచినీటి బావుల నిమిత్తం 3 ప్లాట్లు రిజర్వుచేశారు.

## 46 మంది హరిజనులకు నివేశనస్థలాల పంపిణీ

మహబూబునగర్ జిల్లా సాంఘిక సంక్షేమ అధికారి శ్రీ ఎ. ఎమ్. అన్సారీ యిటీవల *బిజినేపల్లి* సమితిలోని మంగనూరు గ్రామానికిచెందిన 46 మంది హరిజనులకు, ఏడుగురు గిరిజనులకు ఒక్కొక్కరికి రు. 100/- ల చొప్పున రు. 100/ల రొక్కం, నివేశనస్థలాల పట్టాలను పంపిణీచేస్తూ జిల్లా సహకారగృహ నిర్మాణ సంఘంలో సభ్యులుగాచేరాలని విజ్ఞప్తి చేశారు. హరిజనులకు నివేశన స్థలాలు కల్పించడానికి వీలుగా సాంఘిక సంక్షేమశాఖ 2.20 ఎకరాల భూమిని కొనుగోలుచేసింది.

## మైలవరంలో కమ్యూనిటీ కేంద్రానికి ప్రారంభోత్సవం

నిజామాబాదు జిల్లా పరిషత్తు అధ్యక్షుడు, శ్రీ కె.ఆర్.రాజారెడ్డి జూలై 4న మైలవరంలో కమ్యూనిటీ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. *ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ ప్రజలలో ముఖ్యంగా* సమాజంలోని బలహీనవర్గాలలో విద్యావ్యాప్తి జరగాల్సిన అవసరాన్ని గూర్చి నొక్కిచెప్పారు. ఉత్సవానికి అధ్యక్షత వహించిన సమితి అధ్యక్షుడు శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి ప్రసంగిస్తూ బలహీన వర్గాలకు అవసరమైన సహాయం అందచేయడానికి సాధ్యమైనంతగా కృషి జరుగుతున్నదని అన్నారు.

## కొవ్వూరులో వీర్యసేకరణ కేంద్రానికి ప్రారంభోత్సవం

పశుగణాభివృద్ధిశాఖ డైరెక్టరు, డా. బి.ఎ. షిరాజి జూలై 22 కొవ్వూరులో వీర్య సేకరణ కేంద్రం పరిశోధనా విభాగానికి ప్రారంభోత్సవం చేశారు. పరిశోధనా విభాగం భవనాన్ని నిర్మించడానికి స్థానిక గ్రామస్తుడు శ్రీ యల్లాసిరి నారాయణరెడ్డి రూ. 25,000/లు విరాళంగా యిచ్చారు. మరొకదాత శ్రీ వేమారెడ్డి భవన నిర్మాణానికి రూ. 15,000/-లు విలువచేసే స్థలాన్ని విరాళంగా యిచ్చారు. మరో పదిమంది దాతలు రూ. 1116-/లు చొప్పున విరాళాలు అందజేశారు.

## నుడిమళ్ళ సమితిలో రూ. 1,55,000/-ల స్వల్పకాలిక ఋణాలు

ఖమ్మం జిల్లా నుడిమళ్ళ పంచాయతీ సమితి యిటీవల రైతులకు స్వల్పకాలిక ఋణంగా రూ. 1,55,000 లు మంజూరు చేసింది. ఈ పథకం క్రింద రూ. 1,35,000 ల విలువగల ఎరువులు, రూ. 20,000 ల విలువగల అధిక దిగుబడి వంగడాలు సరఫరా చేయడం జరిగింది. అధిక దిగుబడి పైర్లను వేసే రైతులకు మాత్రమే యీ పథకం క్రింద ఎరువులు సరఫరా చేశారు.

## వరదన్నపేట సమితిలో 5,000 మంది విద్యార్థులకు మధ్యాహ్న భోజనం

వరంగల్లు జిల్లా, వరదన్నపేట పంచాయతీ సమితి ఆర్థిక విషయాల సంఘం యిటీవల సమావేశమయింది. సమితి అధ్యక్షుడు, శ్రీ టి. అమృతరావు సమావేశానికి అధ్యక్షత వహించారు. సమావేశంలో మధ్యాహ్నభోజన పథకం అమలుకు రూ. 11.24 వేలు మంజూరు చేశారు. ఈ పథకంవల్ల 64 సమితి పాఠశాలలలోని 5,000 మంది విద్యార్థులకు ప్రయోజనం కలుగుతుంది. వరదన్నపేటలోని హరిజన బాలుర హాస్టల్ నిర్వహణకు జూన్, జూలైలలో జరిగిన రూ. 3,416 ల ఖర్చును యీ సంఘం ఆమోదించింది. వచ్చే రెండు నెలల నిర్వహణ ఖర్చుల నిమిత్తం రూ. 4,000 లు కూడా మంజూరు చేసింది.

## కూడేరు సమితిలో ఎరువులు విత్తనాల పంపిణీ

అనంతపురం జిల్లా కూడేరు సమితి ప్రాంతంలో జులై నెలలో సంకరజాతి, స్వర్ణ జొన్న సేద్యంచేయడానికి రైతులకు 6 టన్నుల యూరియా, *11* టన్నుల కాల్షియం అమ్మోనియం, నత్రజని ఎరువులు పంపిణీ చేశారు.

మార్తాడు, కూడేరు, వెనకచట్లి, పి. ఎల్లేరు గ్రామాలలో 604 జొన్నకు చెందిన 25 కేజీ విత్తనాల సంచులను రైతులకు ఉచితంగా పంపిణీచేశారు.

## పాఠ్య గ్రంథాల సంఘం: తిరుపతిలో చర్చలు

విద్యాశాఖ కార్యదర్శి శ్రీ.ఎస్.ఆర్. రామమూర్తి అధ్యక్షతన గల జాతీయం చేయబడిన పాఠ్యగ్రంథాల సంఘం జూలై 22 నుండి రెండు రోజులపాటు తిరుపతిలో జరిపిన చర్చలు పూర్తి అయినాయి. అక్కడ ప్రచురణకర్తలను, ఉపాధ్యాయులను, విద్యార్థులను, తల్లిదండ్రులను, జర్నలిస్టులను ఇంటర్వ్యూచేశారు. ప్రభుత్వానికి తమ నివేదికను సమర్పించడానికి ముందు, ఆగస్టునెలలో హరియానా, పంజాబులను సందర్శించాలని తలపెట్టారు.

తిరుపతిలో త్వరలోనే ప్రాంతీయ పుస్తక విక్రయశాలను ఏర్పాటు చేయడం జరుగుతుందని పాఠ్యపుస్తకాల ముద్రణశాఖ డైరెక్టరు. శ్రీ బి.వి. రెడ్డి చెప్పారు. సర్వశ్రీ వి.పి. రాఘవాచారి, ఎం.ఎల్.సి, వావిలాల గోపాలకృష్ణయ్య, మాజీ ఎం. ఎల్. ఎ., విద్యాశాఖ డైరెక్టరు శ్రీ వి. రామచంద్రన్, ముద్రణశాఖ డైరెక్టరు శ్రీ అల్లాయార్ ఖాన్, ట్రెజరీల డైరెక్టరు శ్రీ ఎం. అరుణాచలం సమావేశానికి హాజరైనారు.

## ఇండోర్ స్టేడియం నిర్మాణానికి శంఖుస్థాపన

గవర్నరు సలహాదారు శ్రీ హెచ్.సి. సరీన్ సతీమణి శ్రీమతి పుష్ప సరీన్ జూలై 9న సాయంత్రం గుంటూరులోని బ్రహ్మానందరెడ్డి స్టేడియంలో ఇండోరు స్టేడియం భవనం నిర్మాణానికి శంఖుస్థాపన చేశారు. ఈ సందర్భంగా గవర్నరు సలహాదారు శ్రీ సరీన్ ప్రసంగిస్తూ క్రీడాభివృద్ధికి గుంటూరులో స్టేడియం నిర్మించినందుకు తన సంతోషాన్ని వ్యక్తంచేశారు. అనేక ఇతర దేశాలలో క్రీడలను ప్రోత్సహించడానికి ప్రభుత్వంనుండిగాక వాణిజ్య సంస్థల నుండి ఆర్థిక సహాయం లభిస్తున్నదని అయన అన్నారు.

సభకు అధ్యక్షత వహించిన ఐ. ఎల్. టి. డి. డైరెక్టరు శ్రీ డి. రమణారావు ప్రసంగిస్తూ రాష్ట్రం క్రీడాభివృద్ధికి సహాయం చేస్తున్నందుకు శ్రీ సరీన్‌కు కృతజ్ఞతలు అందజేశారు.

జిల్లా కలెక్టరు శ్రీ జయభారత రెడ్డి ముఖ్యఅతిథులకు, సభికులకు స్వాగతంచెబుతూ జిల్లా క్రీడా మండలి ఆధ్వర్యంలో జిల్లాలో క్రీడల అభివృద్ధికి జరుగుతున్న కృషిని వివరించారు.

## పునరావాస గృహానికి ప్రారంభోత్సవం

గవర్నరు సలహాదారు శ్రీ సరీన్ సతీమణి శ్రీమతి పుష్పసరీన్, జూలై 9న గుంటూరులో రెడ్‌క్రాస్ భవనాల ఆవరణలో పునరావాస గృహానికి ప్రారంభోత్సవం చేశారు. శ్రీమతి అరుణా జయశ్రీ, జయభారతరెడ్డి అతిథులకు స్వాగతం చెప్పారు. జిల్లా కలెక్టరు, రెడ్‌క్రాస్ సంఘం అధ్యక్షులు యీ ఉత్సవానికి అధ్యక్షతవహించారు.

శ్రీ సరీన్ స్వయం ఉపాధి పథకం క్రింద పాలిథిన్ బ్యాగ్స్ ఫ్యాక్టరీకి శంఖుస్థాపనచేశారు.

## మాచెర్లలో యిండ్ల కాలనీకి ప్రారంభోత్సవం

గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్ సతీమణి శ్రీమతి పుష్పసరీన్ జూలై 8న గుంటూరు జిల్లా మాచెర్లలో వడ్డెర్ల నిమిత్తం జీవితభీమా సంస్థ నిర్మించిన యిండ్లకాలనీకి ప్రారంభోత్సవం చేశారు. బడుగు వర్గాల ప్రజల నిమిత్తం శ్రీ సరీన్ చేస్తున్న ప్రత్యేక కృషికి ప్రజల మెప్పుకు చిహ్నంగా యీ కాలనీకి 'సరీన్ నగర్' అని పేరు పెట్టారు.

వాతావరణం సరిగా లేకపోయినప్పటికీ అనేక గ్రామాలకు చెందిన వేలాదిమంది పురుషులు, స్త్రీలు యీ ఉత్సవానికి హాజరై శ్రీ సరీన్ దంపతులకు మేళతాళాలతో ఘనమైన స్వాగతం పలికారు. కాలనీకి చెందిన ఒక వడ్డెర్ల మహిళ శ్రీమతి సరీన్ నుదిటిపై తిలకం ధరింపజేసింది. బాలబాలికలు అతిథులపై పుష్పవర్షం కురిపించారు.

ఈ సందర్భంగా శ్రీ సరీన్ ప్రసంగిస్తూ ప్రారంభోత్సవం సందర్భంగా జల్లులు పడడం శుభసూచకమని అన్నారు. కాలనీ ప్రజలు సుఖసంతోషాలతో జీవితం గడపాలని తన శుభాకాంక్షలు అందజేశారు. ఈ ప్రాంతం ప్రజలను నాగార్జునసాగర్ జలాలు సౌభాగ్యవంతులను చేస్తాయనే ఆశాభావాన్ని వెలిబుచ్చారు. రైతుల కష్టనిష్ఠూరాలను తెలుసుకుని వాటికి పరిష్కార మార్గాలను అన్వేషించడానికి తాను పర్యటిస్తున్నానని శ్రీ సరీన్ అన్నారు. ఈ సందర్భంగా శ్రీమతి సరీన్ కూడా ప్రసంగించారు. జిల్లా కలక్టరు శ్రీ కె. జయభారతరెడ్డి ఉత్సవానికి అధ్యక్షత వహించారు.

జీవిత భీమా కార్పొరేషన్ గుంటురు జిల్లాలో హరిజన, గిరిజనులకు నిర్మించదలచిన 1640 యిండ్లతో కూడిన 40 కాలనీలలో యిదొకభాగం. ఈ కాలనీలో 50 యిండ్లు ఉన్నాయి. ప్రతి గృహం సింగిల్ యూనిటుగా కాలనీ నిర్మిస్తూ వాటిలో రోడ్డు, సామూహిక మంచినీటి బావి, కొబ్బరి మొక్కలు నాటడం యీ కాలనీల ప్రత్యేకతగా భావించవచ్చు.

అంతకు ముందు పంచాయతీసమితి అధ్యక్షుడు శ్రీ కోటయ్య శ్రీ సరీన్‌కు స్వాగత పత్రం సమర్పిచారు. శ్రీ సరీన్ పరిపాలనా దక్షతకు మాచర్ల పంచాయతీ నివాళులు అర్పించింది.

## కారెంపూడిలో ఇందిరా నగర్‌కు ప్రారంభోత్సవం

గవర్నరు సలహాదారు శ్రీ హెచ్.సి. సరీన్ జూలై 8న కారెంపూడిలో రు. 51,000ల ఖర్చుతో నిర్మించిన 30 యిండ్లతో కూడిన గిరిజనుల కాలనీకి ప్రారంభోత్సవం చేసారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ జాతీయం చేయబడిన బ్యాంకుల సహాయంతో గ్రామీణ ప్రాంతాలలో సామూహిక ప్రాతిపదికపై లఘు పరిశ్రములను ప్రారంభించే పథకాలను ప్రభుత్వం ప్రోత్సహిస్తుందని అన్నారు. గురజాల ప్రాంతంలో త్వరలోనే కంకర తయారు చేసే పరిశ్రమ నెలకొల్పబడుతుందని వెల్లడించారు. శ్రీమతి పుష్ప సరీన్ కాలనీలో విద్యుచ్ఛక్తి సరఫరాకు ప్రారంభోత్సవం చేశారు. శ్రీ సరీన్ దంపతులు కాలనీలో కొబ్బరి మొక్కలను నాటారు.

## నల్లపాడులో ఎన్. జి. ఒ ల కాలనీకి శంఖుస్థాపన

గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్ జూలై 9న గుంటూరు జిల్లా నల్లపాడు సమీపంలో ఎన్.జి.ఒ. ల కాలనీ నిర్మాణానికి శంఖుస్థాపన చేస్తూ సుందరమై ప్రదేశంలో యీ కాలనీ నిర్మిం

చడానికి కృషి చేస్తున్నందుకు. జిల్లా కలక్టరును ఆర్గనైజరను అభినందించారు. ఎన్. జి. ఒల సమస్యల పరిష్కారానికి మార్గాన్వేషణలో సహాయపడ్తానని శ్రీ సరీన్ వాగ్దానంచేశారు.

అంతకు ముందు ఎన్. జీ. ఓ.ల సంఘం అసోసియేటెడ్ అధ్యక్షుడు శ్రీ డి. వెలుగొండయ్య స్వాగతపత్రం సమర్పిస్తూ స్టాంపు డ్యూటీ మొదలైన వారినుండి మినహాయింపు యివ్వాలని కోరారు. జీవిత బీమా కార్పొరేషన్ నుండి గానీ బ్యాంకుల నుండిగాని రు. 64 లక్షలు రుణాన్ని మంజూరు చేయాలని గవర్నరుకు విజ్ఞప్తి చేశారు.

కాలనీలో యింటికి రు. 16.000ల ఖర్చుతో 400 యిండ్లు నిర్మించాలని నిర్ణయించారు. రాష్ట్ర ఎన్. జీ. ఒ సంఘ అధ్యక్షుడు శ్రీ ఐ. బి. రామకృష్ణారావు ప్రసంగిస్తూ రాష్ట్రంలో ఎన్. జి. ఒ. లందరికీ యిండ్లు నిర్మించడానికి వీలుగా రివాల్వింగ్ నిధిని ఏర్పాటు చేయాలని కోరారు.

## ఉప్పలపాడు పాఠశాల భవనానికి శ్రీ సరీన్ ప్రారంభోత్సవం

గవర్నరు సలహాదారు శ్రీ ఎచ్. సి. సరీన్ జూలై 9న గుంటూరు జిల్లాలోని ఉప్పల పాడులో జిల్లా పరిషత్తు ఉన్నతపాఠశాల కొత్త భవనానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ గుంటూరు మిర్చి. పొగాకు పంటలకు నిలయం మాత్రమే గాక ఉత్తమ కార్యాలకు ఉదారంగా విరాళాలు యిచ్చే దాతలకు కూడా కొదవలేదు అని అన్నారు. ఉత్తమ కార్యాలు నిర్వహించినందుకు జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ కె. వెంగళరెడ్డిని ఆయన అభినందించారు. శ్రీ హనుమయ్య వంటి దాతల సహాయంతో యీ పాఠశాల అభివృద్ధి సాధించాలని హనుమయ్య వంటి దాతలను యీ పాఠశాల సృష్టించాలని తన ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. హరిజనులకు యిండ్ల పట్టాలను శ్రీ సరీన్ పంపిణీ చేశారు.

ఉత్సవానికి అధ్యక్షత వహించిన జిల్లా కలక్టరు శ్రీ కె. జయభారతరెడ్డి ప్రసంగిస్తూ పాఠశాలలకు మంచి భవనాలు నిర్మించడానికి పాఠశాల ఆవరణలను అభివృద్ధిపరచడానికి విరివిగా విరాళాలు అందజేయడానికి దాతలు ముందుకు రావాలని విజ్ఞప్తి చేశారు. జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ కె. వెంగళరెడ్డి ప్రసంగిస్తూ సాధారణ నిధులనుండి ఖర్చు చేసిన మొత్తాలను సర్దుబాటు చేయాలని భవనాల నిర్మాణానికి నిధులను విడుదల చేయాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

## కూడేరు బ్లాకులో 4 పాడి పశువుల పంపిణీ

అనంతపురం జిల్లా కూడేరుబ్లాకుకు చెందిన శ్రీమతి జి. లక్ష్మమ్మ, శ్రీమతి జె. లక్ష్మీదేవి, శ్రీ జి. అప్పయ్యలకు, రెవిన్యూ డివిజనల్ అధికారి శ్రీ ఎం. సుబ్రిమణ్యం నాలుగు పాడి పశువులను పంపిణీచేశారు. వెనుకబడిన తరగతులవారి ఆర్థిక పరిస్థితిమెరుగు పరచే ఉద్దేశంతో యివి ఉచితంగా యివ్వబడినాయి. 

## ఈ సంచికలోని రచయితలు

శ్రీయుతులు.........

చండి జగన్నాథం, 38/3 ఆర్.టి., సంజీవరెడ్డినగర్, హైదరాబాదు–38
మాదల వీరభద్రరావు, సబ్–ఎడిటరు, ఆంధ్రప్రభ, క్వీన్స్‌రోడ్డు, బెంగుళూరు–1.
వావిలాల గోపాలకృష్ణయ్య, సత్తెనపల్లి, గుంటూరు జిల్లా.
జె. వీరాస్వామి, న్యాయశాఖ కార్యదర్శి, సచివాలయం, హైదరాబాదు.
తక్కెలపాటి సుబ్రమణి, పానగల్ గార్డెన్సు, పానగల్, శ్రీ కాళహస్తి, చిత్తూరుజిల్లా.
మధురశ్రీ, పెద్దాపురం, తూ. గో. జిల్లా.
త్రిపురనేని సుబ్బారావు, కవిరాజ సాహితీ సదనం, శ్రీనివాసకాలనీ, 3–3–214/15, హైదరాబాదు–38.
కె. వి. హనుమంతరావు, C/o ఆర్, సి, రెడ్డి. డిస్ట్రిక్టు మానేజరు, టెలిఫోన్సు ఆఫీసు, హైదరాబాదు–33.
ఆదిరాజు వీరభద్రరావు, సహీఫా పోస్టాఫీసు వెనుక, అజంపురా, హైదరాబాదు.
గంధం జోయల్, 22–7–82/1, మండీగల్లి, పత్తర్‌గట్టి, హైదరాబాదు–2
గునుపాటి భోగీశ్వరం, 2/64, పోస్టాఫీసు రోడ్డు, కోటపోస్టు, నెల్లూరు జిల్లా.
చావలి రామమూర్తి, 5/3 ఆర్.టి. కంఠాస్వరి. నిజామాబాదు.
గాదంసెట్టి శ్రీరాములు, హిందీ విభాగం, ప్రభుత్వ కళాశాల, పాలకొల్లు, తూ, గో. జిల్లా.
పి. రాజగోపాల నాయుడు, ఎమ్. ఎల్. సి., చిత్తూరు.
యజ్జిమిల్లి చలపతిరావు "శ్రీవత్సవ" చౌడువాడ, వయా గోవాడ, విశాఖపట్నం జిల్లా.
ఉత్పల సత్యనారాయణాచార్య, 1–9–286, విద్యానగర్, హైదరాబాదు–46.
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, 69, ఆదర్శనగర్, హైదరాబాదు–4.
కె. సుందరి, 5, కె, కళింగ కాలనీ, కరుణానిధినగర్, మద్రాసు–83.
ఎ. పండరీనాథ్, టీచరు, జడ్. పి. హైస్కూలు, ఇబ్రహీంపట్నం, హైదరాబాదు జిల్లా.
వి. ఎస్. సుబ్రహ్మణ్యం, డి. పి. ఆర్. ఒ. ఖమ్మం.

PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH, AT THE GOVT. CENTRAL PRESS HYDERABAD
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION, PUBLIC RELATIONS & TOURISM ANDHRA PRADESH, HYDERABAD.

